he Largest
Circulated
Telugu
Monthly

# చతుర

డిసెంబర్ 1993
రూ.5/-



## అమృతహస్తం

— పి.వి.శేషారత్నం



ఫొటో: ఎస్.జి. శేషగిరి

పెచ్చు తీసే పనిలేదు.  ముక్కలు తరగక్కర్లేదు. 

 శుభ్రం చేసే శ్రమలేదు.  నూరుకునే భారంలేదు.

ఒక్కక్షణం కూడా వృథాకాదు!

## ఏ వేళనైనా - ఏ వంటకానికైనా 
## మీకోసం సంసిద్ధం.

## స్వచ్ఛమైన - శుద్ధమైన
## ప్రియ అల్లం వెల్లుల్లి
##  మిశ్రమం.




తిరుగులేని నాణ్యత కోసం
తాజా పరిమళపు ఘుమ ఘుమలకోసం
'ప్రియ' అల్లం వెల్లుల్లి మిశ్రమం.

ఏ విధ కృత్రిమ పదార్థాలు మచ్చుకైనా లేవు. నూటికి
నూరుపాళ్ళు ప్రకృతి సిద్ధంగా తయారైన సహజ మిశ్రమం.

# దారి

ఆటో మాట్లాడుకుని బస్స్టాండునుంచి బయ ల్దేరేరు సీతాపతి దంపతులు.

కాలనీ చేరుకోగానే స్నేహితుడి ఇంటి అడ్రెస్కోసం జేబులన్నీ వెతుక్కున్నాడు. అడ్రెస్ రాసుకున్న కాగితం ఎక్కడోపోయింది.

"మీ స్నేహితుడి ఇల్లు ఎక్కడో గుర్తువట్ట లేరా? అంతకుముందు రెండుమూడు సార్లు



వెళ్లానన్నారుగా" అంది రాధ.

భార్యవైపు విసుగ్గా చూశాడు సీతాపతి.

ఆటో దిగకుండానే కాలనీలోని వీధులన్నీ చుట్టేసినా ప్రయోజనం లేకుండాపోయింది. కాలనీలోని ఇళ్ళన్నీ ఒకే మోడల్గా వుండ టంతో స్నేహితుడి ఇల్లు గుర్తువట్టడం కష్టమై పోయింది.

ఆటోవాడు కూడా విసుక్కోవడంతో సెంట రులో దిగిపోయేరు.

"నువ్వు సూట్కేస్ దగ్గరపెట్టుకుని ఇక్కడే వుండవే... నేను అలా నాలుగురోడ్లు తిరిగివస్తా ను... ఇల్లు గుర్తువట్టగానే నిన్ను తీసుకువెళ్తా ను" అనేసి అక్కడనుంచి కదిలేడు సీతాపతి.

"బాబూ... గోపాలరావుగారని సచివాల యంలో పనిచేస్తున్నారు ఆయన ఇల్లెక్కడ?" ఎదురుపడిన వ్యక్తిని అడిగేడు సీతాపతి.

"ఈ రోడ్డు చివరికి వెళ్లి కుడివక్కకు తిర గండి. అక్కడో హోటల్ కన్పిస్తుంది. హో టల్ వక్కనే" అనేసి హడావుడిగా వెళ్లిపోయా డాయన.

"గోపాలరావు ఇంటి వక్కన హోటల్ లేదే!" అనుకుంటూనే ఆ వ్యక్తి చెప్పిన దిక్కు కే నడిచేడు సీతాపతి.

హోటల్ వక్కనే శివాలయం కన్పించింది కానీ గోపాలరావు ఇల్లు కన్పించలేదు.

మళ్లీ కాళ్ళీడ్చుకుంటూ వెనక్కు వచ్చాడు రాధ నిలబడిన చోటుకి.

---

కవర్ఫొటో: సురేష్చంద్రబచావత్

గోపాలరావు ఇల్లు హొటల్ పక్కనని చెప్పి నవ్యక్తి మళ్లీ కన్పించేడు.

"దర్శనం అయిందా?" నవ్వుతూ అడిగేడు అతను.

"శివాలయం కాదండీ... సచివాలయంలో పనిచేసే గోపాలరావుగారి ఇల్లెక్కడ?" గట్టిగా అరిచేడు సీతాపతి.

"ఎందుకలా గట్టిగా అరుస్తారు నాకేమన్నా చెముడనుకున్నారా?" విసుక్కుంటూ విసవిసా నడిచి వెళ్లిపోయాడతను.

అతనికి చెముడని నమ్మకం కుదిరింది సీతాపతికి.

నలుగురైదుగురు కాలేజీ కుర్రాళ్లు ఎదురొచ్చేరు.

"సచివాలయంలో పని చేసే గోపాలరావు గారి ఇల్లెక్కడో చెబుతారా బాబూ!" కాలేజీ కుర్రాళ్లను అడిగేడు.

"సర్వీసులోవున్న గోపాలరావా? రిటైరయిన గోపాలరావా?"

"రిటైరయ్యాడు... వాళ్లబ్బాయి పెళ్లి సాయంత్రం... రెండేళ్ల క్రిందట వాళ్లింటికి వెళ్లానుగానీ ప్రస్తుతం గుర్తు పట్టలేకపోతున్నాను"

"మాకు తెలీదండీ" అన్నారు కుర్రాళ్లందరూ మూకుమ్మడిగా.

సీతాపతికి ఆ క్షణంలో మెరుపులాంటి ఆలోచన మెదడు పొరల్లో మెదిలింది.

"కోమలి అనే అమ్మాయి వుండాలి. పొడుగాటి జడ, కోలమొహం, బుగ్గమీద పుట్టుమచ్చ ఆకర్షణీయంగా కన్పిస్తుంది. పాటలు కూడా పాడుతూ వుంటుంది. చైతన్య కళాశాలలో బి.యస్.సి చదువుతోంది. ఆ అమ్మాయి ఇల్లు మీకు తెలుసా?"

కుర్రాళ్లలో చైతన్యం కొట్టొచ్చినట్లు కన్పించింది.

"కోమలి ఇల్లు తెలియకపోవడమేమిటి? మీరు వాళ్ల బంధువులా సార్? రండిసార్! దారిమేం చూపిస్తాం" అన్నాడో కుర్రాడు.

సీతాపతి భార్య చేతిలోని సూట్‌కేసుకూడా ఆ కుర్రాడే అందుకున్నాడు. బ్యాగ్ మరో కుర్రాడు అందుకున్నాడు.

"చూశావా! గోపాలరావు పేరు చెబితే తెలియదన్నారు ఈ కుర్రాళ్లు, ఎదురింటి కోమలి పేరు చెప్పగానే చంకలు కొట్టుకుంటూ ఇల్లు చూపిస్తామంటూ వెంటబడ్డారు" కుర్రాళ్లతోపాటు జోరుగా నడవలేక వెనుకబడిన సీతాపతి అన్నాడు భార్య చెవిలో మెల్లగా.

"మీ స్నేహితుడి ఇంటి నెంబరు మీకు గుర్తులేదు... రెండేళ్లక్రితం చూసిన వాళ్ల ఎదురింటి అమ్మాయి పేరు, వివరాలు మాత్రం బాగా గుర్తుంటాయి" దెప్పిపొడిచింది రాధ మొగుడిని.

-అలపర్తి రామకృష్ణ

---

## పొరపాటు ఎక్కడ?

"కూరగాయలు తెప్పిద్దామంటే మా పెద్ద వెధవ పరీక్షలంటూ పుస్తకం వదిలి ఇవతలికి రావడంలేదు. ఇంట్లో చూద్దామా అంటే ఒక్క కూరా లేదు" వస్తూనే దిగులుగా అన్నారు లక్ష్మమ్మగారు.

"పోనీ మావాణ్ణి పంపిస్తాను... మార్కెట్ నించి మీక్కావల్సినవి తెప్పించుకోండి" అంది నాంచారమ్మ.

"థాంక్సండీ" ఆనందంతో మతాబులా వెలిగిపోయింది లక్ష్మమ్మగారి ముఖం. ఆ తర్వాత నాంచారమ్మ కొడుకును వెంటబెట్టుకుని ఆమె తన పోర్షన్‌లోకి వెళ్ళిపోయారు.

★ ★ ★

"మా సన్నాసికి ముందుచూపు బొత్తిగా లేకుండాపోతోంది. పరీక్షకి పట్టుమని పావు గంటన్నా టైము లేదాయె. వెళ్దామని తీరా బయలుదేరాక చూసుకుంటే సైకిలు పంక్చర్. నడిచి వెళ్ళాలంటే టైం చాలదని కళ్ళనీళ్ళెట్టుకుంటున్నాడు వెధవ..." లక్ష్మమ్మగారి గొంతులో బాధ సుళ్ళుతిరుగుతోంది.

"ఆమాత్రందానికంత దిగులెందుకండీ? మావారికి చెబుతాను. స్కూటర్‌మీద డ్రాప్ చేసివస్తారు.. ఎలాగూ నైట్ డ్యూటీయేగదా ఇంట్లోనే పడుకుని ఉన్నారాయన..." అంటూ భర్తను లేపడానికి లోనికి వెళ్లింది నాంచారమ్మ.



నాంచారమ్మ ఔదార్యానికి లక్ష్మమ్మగారి కంట్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

★ ★ ★

“అయ్యో వంటగదిలో సడెన్‌గా గ్యాస్ అయిపోయింది. ఏం చేయాలో తోచడంలేదు. ఇంట్లో కిరోసిన్ కూడా లేదు” లక్ష్మమ్మగారు వస్తూనే డీలాపడిపోయారు.

“ఆమాత్రందానికలా జావగారిపోతారెందుకండి? సగం పూర్తయిన వంట పాడైపోక ముందే తొందరగా తెచ్చి మా పొయ్యిమీద పెట్టేయండి”



“నాంచారమ్మగారూ! మీరు మా పక్కపోర్షన్‌లో దిగినపుడు మిమ్మల్ని గురించి పల్లెటూరి బైతనీ, చదువుసంధ్యా లేని ఎడ్డెమనిషని అదిగో ఆ పక్కింటి సుగుణ అంటే అప్పట్లో నిజమేనేమో అనుకున్నాను. కానీ మీరు నిజంగా దేవతలాంటివారు”

“అబ్బబ్బ... ఏమిటీ పొగడ్తలు? ఇరుగుపొరుగన్నాక ఈమాత్రం సహకారం ఇచ్చిపుచ్చుకోడంలో వింతేముంది? మీ వంట పూర్తయ్యాక అంతగా కావాలంటే మా ఇంట్లో స్పేర్ సిలెండర్ ఉంది. పట్టుకెళ్ళండి. మీది వచ్చాక నాకిద్దురుగాని...” అంది నాంచారమ్మ నవ్వుతూ.

లక్ష్మమ్మగారి నోట మాటరాలేదు. కొంచెంసేపటికెలాగో గొంతు పెగుల్చుకుని, “మీలాంటి ఉత్తమ ఇల్లాళ్ళు ఇంకా అక్కడక్కడా ఉండబట్టే ఈ మాయదారి కాలంలో ఈమాత్రమైనా వర్షాలు పడుతున్నాయమ్మా” అంటూ నాంచారమ్మ రెండు చేతులూ పట్టుకుంది ఆప్యాయంగా.

★ ★ ★

ఇది జరిగిన రెండు వారాలకే వాళ్ళిద్దరూ భద్ధ శత్రువులైపోయారు. ముఖ్యంగా లక్ష్మమ్మగారు ఎవరైనా ఆవిడ ఎదురుగా నాంచారమ్మ పేరెత్తితేచాలు మండిపడ్డం మొదలెట్టారు. ఆవిడలా సడెన్‌గా ఎందుకు మారిపోయారో నాంచారమ్మకి ఎంతకీ అర్థంకాలేదు. అసలు ఆరోజు ఏం జరిగిందంటే...

ఆరోజు శ్రావణ శుక్రవారం...

రాజ్యలక్ష్మమ్మగారు వస్తూనే, “పూజంతా అయింది. వంటలు పూర్తయ్యాయి. అప్పుడే మధ్యాహ్నం రెండు కావస్తోంది. పాదాలకి నమస్కారం చేసి అక్షింతలు వేయించుకుందామంటే ఈయనగారు ఇంతమటుకూ అయిపూఅజా లేకుండాపోయారు. ఎప్పుడు వస్తారో ఏమో...” అంటూ నీరసంగా కుర్చీలో జారగిలబడ్డారు.

“పోనీ మావారిని పంపనా? ఆయనకెలాగూ నైట్...”

నాంచారమ్మ మాట పూర్తి చేయకుండానే లక్ష్మమ్మగారు లేచి విసవిసా వెళ్ళిపోయారు.

తన భర్తని పంపి రాజ్యలక్ష్మమ్మగారి భర్తను స్కూటర్‌మీద త్వరగా ఇంటికి పిలిపించాలనుకున్న నాంచారమ్మకి తన తప్పు ఏమిటో అర్థంకాలేదు.

-ప్రతాపచంద్ర

---

## హాస్యం ఖరీదు

పిల్లికి బిచ్చం పెట్టని పార్లమెంటు సభ్యుడు రెండొందలమంది పార్టీ కార్యకర్తలకు స్వంత డబ్బుతో చికెన్‌బిర్యానీ చేయించి పెడుతున్నాట్ట.

ఆ విషయం తెలిసి రోజూకన్నా ముందుగానే- సాయంత్రం ఆరుగంటలకల్లా టీ కొట్టు కట్టేసి హడావిడిగా ఎం.పీ.గారింటికి బయల్దేరాడు నాంచారయ్య. పార్లమెంటుకు మధ్యంతర ఎన్నికలొస్తున్నాయేమో? అనుకున్నాడు. కానీ విషయం అది కాదట. ఎం.పి.గారింటిముందు పార్టీ బహిరంగసభ ఉందిట!

నాంచారయ్యకు చాలా ఆనందంగా ఉంది! పగలంతా టీకొట్లో యిరగబడి చాకిరిచేసే నాంచారయ్య ఆ అవకాశాన్ని చస్తే విడిచిపెట్టడు.

నవ్వు నానారకాలుగా ఆరోగ్యప్రదమట!

ఈమధ్యకాలంలో హాస్యం అనేది చచ్చేపోయింది. తెలుగు సినిమాల్లో మరీనూ! హాస్య సన్నివేశాలొస్తేనే బోలెడు దుఃఖం ముంచుకొస్తోంది. కాస్తో కూస్తో హాస్యం ఇంకా బతికుందంటే అది రాజకీయనాయకుల పుణ్యమే!

అవిశ్వాస తీర్మానంమీద చర్చ జరిగేరోజు పార్లమెంటు భవనంలా ఎం.పీ.గారిల్లంతా హడావిడిగా ఉంది! ఇంటిముందే చిన్న స్టేజి ఏర్పాటుచేసేరు. దానిమీద మైకుంది. మైకు వెనకాలే నాలుగు దర్బారు కుర్చీలున్నాయి. ఆ దర్బారు కుర్చీల వెనక స్టేజి కర్టెనుకు పిన్నులు గుచ్చి మహాత్మాగాంధీ, పీటర్‌పాల్, రాజీవ్ గాంధీ, మటన్‌కొట్టు మస్తాన్ ఫొటోలు వేలాడదీసేరు. మీటింగ్‌ఖర్చూ, బిర్యానీ ఖర్చూ మస్తాన్‌దట.

స్టేజికి కుడివేపు ఎం.పీ.గారి నిలువెత్తు ఆయిల్‌పెంటు నిలబెట్టుంది.

కార్యకర్తలంతా అప్పటికే బిర్యానీ తింటం పూర్తిచేసి ఎం.పీ.గారికి జిందాబాద్‌లు కొడుతూ- వేదికముందు కూచున్నారు.

కార్యకర్తలంతా జేజేలు కొడుతూ చేతుల్తో గొంతులు రాసుకొంటుంటే అది గమనించిన ఎం.పీ.గారికి అప్పుడు గుర్తొచ్చింది. మున్సిపా



లిటీవారికి ఆదేశాలు జారీచేసేరు. మంచినీళ్ళ టాంకుకోసం.

నాంచారయ్య కూడా ఒక మూలగా ఒదిగి కూచొని ఆసక్తిగా అంతా గమనిస్తున్నాడు.

సభ ప్రారంభం కావటమే తరువాయి! సరిగ్గా అప్పుడే స్వాతంత్ర సమరయోధుడు నమక్‌శాస్త్రి హడావిడిగా స్టేజి దగ్గరికి వెళ్లాడు. ఏదో కాయితంతీసి ఎం.పీ.గారి చేతికిచ్చి పార్లమెంటులో బాంబులువేసి కూడా నిబ్బరంగా నించున్న భగత్‌సింగులా అక్కడే నించున్నాడు!

కాయితంవిప్పి చదువుకున్న ఎంపీ.గారి మొఖంలో రంగులు మారేయి. కాయితాన్ని వుండచుట్టి బల్లమీద గిరాటేస్తూ "తమరింక వెళ్ళి కూచోండి" అన్నాడు కోపంగా.

నమక్‌శాస్త్రి భయపళ్ళేదు. లాఠీదెబ్బలు తింటూ కూడా అంగుళం కూడా కదలని లాలాలజపతిరాయ్‌లా అలాగే నించున్నాడు! "నా ప్రశ్నను మైకులో చదివి జవాబు చెప్పాల్సిందే. అంతవరకూ నేను కదలను" పెద్దగా అరిచేడు నమక్‌శాస్త్రి.

సభాధ్యక్షులు గుప్తాగారికి చొరవెక్కువ. ఆసక్తీ ఎక్కువే. ఎం.పీ.గారు ఉండచుట్టేసిన కాయితాన్ని అందుకున్నారు. జాగ్రత్తగా ఉండతిప్పి కాయితాన్ని సరిచేసి పెద్దగానే చదివేరు.

ఎం.పీ.గారూ!

తమరు నియోజకవర్గాన్ని పూర్తిగా మర్చేపోయారు. పైగా పార్లమెంటు సమావేశాలు జరిగేప్పుడు తమరు బెంగుళూర్లోనూ, సమావేశాలు లేనప్పుడు ఢిల్లీలోనూ ఉంటున్నట్లు తెలుస్తోంది. ఓటేసిన జనాన్ని విస్మరిస్తే ఎలా?

సభికులంతా మౌనంగా కూచోని చోద్యంగా చూస్తున్నారు.

ఇక తప్పదనుకొని ఎం.పీ.గారు లేచి నించున్నారు. సాలోచనగా తలపంకిస్తూ మైకు దగ్గరికొచ్చి- రెండు చిటికెలేసేరు.

ఎం.పీ.గారు మైకులో ఒక చిటికవేస్తే ఏంటో, రెండు చిటికెలేస్తే ఏంటో- ఆ సంకేతం బటన్‌చాకూ భరత్‌కుమార్‌కి మాత్రమే తెలును!





సందేశం అందుకున్న భరత్‌కుమార్ గళ్ళ లుంగీని ఒకసారి వూడదీసి మళ్లీ బిర్రుగా కట్టుకొని తామ్రపత్రగ్రహీత నమక్‌శాస్త్రి నించున్న చోటికి వెళ్తున్నాడు.

నాంచారయ్య తాపీగా కూచున్నవాడల్లా కొంచెంపైకి లేచి మోకాళ్ళమీద నిలబడి భరత్ కదలికల్ని గమనిస్తున్నాడు!

ఎం.పీ.గారు సభకు వినమ్రంగా నమస్కరించేరు. గొంతు సవరించుకొని చెప్పటం ప్రారంభించేరు.

"పూజ్యులైన ఓటరు మహాశయులారా! నేను నా నియోజకవర్గాన్ని మర్చేపోయానన్న విమర్శ నాకు చాలా బాధగా ఉంది. కానీ ఒక్క విషయం మాత్రం చెప్పదల్చేను. మనం పుణ్యంకోసం ఎప్పుడోగాని పాపనాశనం వెళ్ళం. పాయిఖానాకు మాత్రం రోజూ వెళ్తాం. అంత మాత్రాన పాయిఖానా గొప్పదా...? పాపనాశనం గొప్పదా?"

"పాపనాశనమే గొప్పది" బటన్‌చాకూ భరత్‌కుమార్ అప్పటికే నమక్‌శాస్త్రి పక్కకు వెళ్లి నించొని పెద్దగా అరిచేడు.

"కరెక్ట్... పాపనాశనం గొప్పది. అలాగే నేను నియోజకవర్గానికి ఎప్పుడోగాని రాకపోయినా నా దృష్టిలో ఈ నియోజకవర్గం పాపనాశనం లాగానే పవిత్రమైంది!"

నమక్‌శాస్త్రి పెద్దగా అరిచేడు. "నో... నో... ఎం.పీ.గారు విషయాన్ని పక్కకు మళ్లిస్తున్నారు. ఇది అన్యాయం"

ఎం.పీగారు భరత్‌కుమార్ కళ్లలోకి చూసేరు.

భరత్ ఆలస్యం చెయ్యలేదు. పిడికిలి బిగించి బలంగా నమక్‌శాస్త్రి మాడుమీద గుద్దేడు.

నమక్ కళ్లు బైర్లు కమ్మేయి. ఎక్కడో నక్షత్రాలు మెరిసేయి. చేతన కోల్పోతూ "క్విట్ ఇండియా... క్విట్ ఇండియా..." అంటూ అక్కడే కుప్పలా కూలబడిపోయేడు!

నాంచారయ్య అప్పుడుగాని గమనించలేదు. ఎప్పుడొచ్చేరోగానీ చాలామంది పోలీసులు లాఠీలతోసహా చుట్టూ నిలబడిఉన్నారు.

నాంచారయ్యకు భయమేసింది. పదిరోజుల క్రితమే ఎవరో కూలి పార్టీ వాళ్ళమంటూ

అందంగా జానపదగేయాలు పాడుతూ సభ జరుపుతుంటే నాంచారయ్యా కూడా వెళ్ళేడు. కొంచెంసేపటికి ఇలాగే పోలీసులొచ్చేరు. సభకు వచ్చిన జనంమీద విరుచుకుపడి లాఠీ ఛార్జిచేసి జనాన్ని పారద్రోలేరు.

నాంచారయ్యకు కూడా నాలుగులాఠీదెబ్బలు తగిలేయి.

అది గుర్తొచ్చింది నాంచారయ్యకు. పోలీసులకేసి భయం భయంగా చూస్తూ అక్కణ్ణించి వెళ్లిపోవాలనుకొని లేచి నించున్నాడు. హడావిడిగా నడుస్తూ జనాన్ని తప్పించుకుంటూ కొంచెం దూరంపోగానే నాంచారయ్యను పోలీసులు చుట్టుముట్టేరు.

''ఎక్కడికిరా పోతున్నావ్ నా కొడకా?''

''తప్పయిపోయింది సార్. ఇంకెప్పుడూ మీటింగులకు రాను'' కూలీపార్టీ మీటింగప్పుడు తిన్నదెబ్బలు గుర్తొచ్చి వణికిపోతూ చెప్పేడు నాంచారయ్య.

''మీటింగులకు రావా? వచ్చినవాడివి బుద్ధిగా కూచోకుండా సభమధ్యలో లేచి ఇంటికెళ్తావా?'' అంటూ ఇద్దరు పోలీసులు నాంచారయ్యను కిందపడేసి మీటింగు అయ్యేదాకా కాపలాకాసేరు.

లాఠీదెబ్బలకు పొంగుతున్న చేతుల్ని చూసుకొంటూ తనలోతనే అనుకున్నాడు నాంచారయ్య-

హాస్యం చాలా ఖరీదు సుమీ''

**-గోపరాజు నాగేశ్వరరావు**

---

## ప్రయోగం

ఈశ్వరరావు పుస్తకాల షాపుల్లోకి వెళ్లి ''ఆడవాళ్ళ సైకాలజీ తెలియజేసే పుస్తకాలేమైనా వున్నాయా?'' అనడిగాడు షాపతన్ని.

షాపతను ఎగాదిగా చూసి, ''ఒక్క పుస్తకం మాత్రం వుంది'' అన్నాడు.

''మంచిదేనా?'' అనడిగాడు ఈశ్వరరావు అనుమానంగా.

''వారంక్రితం వందకాపీలు వస్తే ఒక్కటే మిగిలింది. ఆ పుస్తకం చదివితే మీరు ఆడవాళ్ల అంతరంగాన్ని ఎక్స్‌రే తీసినట్టు తెలుసుకుంటారు. పుస్తకాలు కొన్నవాళ్ళు కొంతమంది నాతో అలా అని చెప్పారు'' అన్నాడు షాపతను.

''సరే... ఆ కాపీ ఇవ్వండి'' అని 'ఆడవాళ్ల మనస్తత్వం- అనేక కోణాలు' అనే ఆ పుస్తకాన్ని ఎనభైరూపాయలు ఇచ్చి కొనుక్కుని, షాపు నించి బయటపడ్డాడు ఈశ్వరరావు.

రోడ్డుమీద ఉత్సాహంగా నడుస్తూ 'ఇక వీరలక్ష్మి మనను తెలుసుకున్నట్టే. ఇన్నాళ్లూ తనకి అందకుండా పరుగులు దీస్తున్న ఈ వీరలక్ష్మి కొంగు తనకు దొరికిపోయినట్లే' అనుకున్నాడు ఈశ్వరరావు.

వీరలక్ష్మి- ఈశ్వరరావు ఇంటికి పైభాగంలో వుంటోంది. డిగ్రీ చదివి ఏదో ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేస్తోంది. అప్పుడప్పుడు ఈశ్వరరావు గదికి నవల్లు, కథల పుస్తకాల కోసం వస్తూవుంటుంది.

కొన్నిరోజుల క్రితందాకా ఈశ్వరరావుకు ప్రేమంటే ఏమిటో తెలీదు. సినిమాల్లో హీరో హీరోయిన్ల ముద్దులసీన్లూ, కౌగిలింతల సీన్లూ చూసి ఇదేదో సినిమా వ్యవహారమనీ, రొటీన్‌గా జరిగిపోతుందనీ అనుకునేవాడు.

కాని ఒకరోజు వీరలక్ష్మి ఏదయినా నవలుంటే పట్రమ్మని తమ్ముడ్ని ఈశ్వరరావు గదికి పంపించింది. కాని అవేవీ చదివే అలవాటు లేని కారణంగా అతని దగ్గర యేపుస్తకమూలేదు. అందుకు బాధపడి అప్పటికప్పుడే బజారుకెళ్లి నాలుగైదు తాజా నవల్లు, కథల పుస్తకాలూ తెచ్చి వీరలక్ష్మికి పంపించాడు. వాటన్నింటినీ చదివి వాపసు ఇవ్వటానికి వచ్చింది వీరలక్ష్మి.

ఈశ్వరరావుకి వీరలక్ష్మి థాంక్స్ చెప్పగానే అతన్లో ఏదో తెలీని ప్రేమపుట్టుకొచ్చింది. అప్పటికప్పుడే అతడి మెదడుల్లో ప్రేమకు సంబంధించిన అనేకానేక సినిమాల రీళ్లు తిరిగిపోయాయి.

అప్పటినించీ వీరలక్ష్మికోసం అతను రెగ్యులర్‌గా పుస్తకాలు కొనటం, అద్దెకు తేవటం మొదలుపెట్టాడు. ఆమె కూడా అతని దగ్గరకు వస్తూపోతూ వుండేది. నవ్వుతూ మాట్లాడేది. జోకులు వేసేది. ఎంతో ఫ్రీగా వుండేది.



అంతా బాగానే వుందిగానీ వీరలక్ష్మి తనని ప్రేమిస్తున్నట్టుగా చెప్పకపోవటం ఈశ్వరరావును విపరీతంగా బాధించింది. ఆమె మనసులో ఏముందో తెలుసుకోటానికి ఆఖరిప్రయత్నంగా ఆ రాత్రంతా మేలుకుని 'ఆడవాళ్ల మనస్తత్వం- అనేక కోణాలు' పుస్తకాన్ని మళ్లీ మళ్లీ చదివి అందులో వున్న ఒక చిట్కాను వీరలక్ష్మిపై ప్రయోగించాడు.

ఒక ఉత్తరం రాసి దాన్ని వీరలక్ష్మి తమ్ముడి చేత ఆమెకు అందజేశాడు. అందులో ఇలా రాశాడు-

''నన్ను ప్రేమిస్తున్నట్లయితే సాయంత్రం ఆరుగంటలకు నెహ్రూ పార్కు దగ్గరకు ఎర్రచీర కట్టుకునిరా. ప్రేమించకపోతే తెల్లచీర కట్టుకునిరా''

ఆరుగంటలకు పదినిమిషాల ముందుగానే ఈశ్వరరావు నెహ్రూపార్కు దగ్గరకు వెళ్ళాడు. ఆరుగంటల పదినిమిషాలకు వీరలక్ష్మి తమ్ముడు వచ్చి ఈశ్వరరావుకు ఒక వుత్తరం ఇచ్చి పరిగెత్తుకుని వెళ్లిపోయాడు.

ఆత్రంగా ఆ ఉత్తరాన్ని చదివి తెల్లమొహం వేశాడు ఈశ్వరరావు.



అందులో ఇలా వుంది-

''అసలు నాకెన్ని చీరలున్నాయో, ఏయే రంగులున్నాయో నీకేం తెలుసు? నువ్వు రాసిన తెల్లచీర, ఎర్రచీరలు నాకులేవు. నాకు పసుపు, నీలం, ఆకుపచ్చ వగైరా డజను చీరలున్నాయి. వీటిల్లో ఏ రంగుచీరలు కావాలో సెలక్టు చేసుకో''

-ప్రతాప రవిశంకర్

## పాఠంచెప్పేబొమ్మ

నాలుగో క్లాసు చదువుతున్న ఒక్కగానొక్క కొడుకు కిట్టూను తెగ గారం చేసింది సుజాత. వాడు ఏదంటే అది కొనాల్సిందే. ఎక్కడికంటే అక్కడికి తీసుకెళ్ళాల్సిందే. అక్కడికీ భర్త తరచూ కోప్పడుతూనే వుంటాడు ''వాడిని మరీ గారంచేసి నెత్తికెక్కించుకుంటున్నావు... ముందు నీమాటే కాదు, నామాట కూడా వినడం మానేస్తాడు వాడు'' అంటూ.

''ఆ... పోనిద్దురూ... చిన్నపిల్లవాడుగదా! పెద్దయితే అన్నీ వాడే నేర్చుకుంటాడు'' అని నర్దేస్తూ వుంటుంది సుజాత.

కిట్టూకి ముఖ్యంగా బొమ్మల పిచ్చెక్కువ. ఎప్పుడు చూసినా ఏ బొమ్మరైలుకో 'కీ' ఇస్తూనో ప్లాస్టిక్ చిప్స్‌తో బిల్డింగ్ కడుతూనో కనిపిస్తాడు. 'హోమ్‌వర్క్' అంటే మాత్రం ఏడుపు తారాస్థాయిని చేరుకుంటుంది. స్కూల్లో టీచర్లనుంచి ఎప్పుడూ ఏదో కంప్లయింట్ వస్తూనే వుంటుంది. ఆ కంప్లయింట్లతోనే మూడేళ్ళు ఎలాగో నెట్టుకొచ్చాడు చదువుని.

ఓసారి వాడి స్నేహితుడు గోపీకి వాళ్ళ నాన్న ఓ బొమ్మ స్టెన్‌గన్ కొనితెచ్చాడు. అది నిజం గన్‌లాగే చప్పుడు చేస్తూ చూడ్డానికి చాలా అద్భుతంగా కనిపించింది కిట్టూకి. అలాంటి బొమ్మ తనకీ కావాలన్న వాడి పేచీ వారంరోజులుగా కొనసాగింది. ఊరు మొత్తం గాలించినా కిట్టూ నాన్నకి ఏ షాపులోనూ అలాంటిది దొరకలేదు. చివరికి అనుకోకుండా ఢిల్లీ క్యాంప్ తగిలింది. ఒకరోజు ప్రత్యేకంగా ఆ గన్ వెతకడంకోసం పెట్టుకుని మొత్తంమీద అలాంటి స్టెన్‌గన్‌నే సాధించగలిగాడు.

నిద్దట్లో కూడా స్టెన్‌గన్ అంటూ కలవరిస్తూ తిండికూడా మానేసినకిట్టూ ఢిల్లీనుంచి వాళ్ళ నాన్న తెచ్చిన గన్ చూసి కోలుకొన్నాడు.

ఇంతలో వాడి పుట్టినరోజు వచ్చింది. బట్టలు కొందామని బజారుకి తీసుకెళ్ళింది వాళ్ళమ్మ.

"నాకు బట్టలొద్దు... కొత్తబొమ్మ ఏదన్నా కావాలి. ఆరోజు మా ఫ్రెండ్స్ అందరికీ స్పెషల్‌గా చూపించాలిగా" అని పేచీ మొదలెట్టాడు వాడు.

"ఎన్ని బొమ్మలురా? ఇంటినిండా వున్నవి చాలవూ...?" అంటున్న ఆవిడ దండకం పూర్తి కాకుండానే రోడ్డుమీదే చతికిలపడ్డాడు కిట్టూ "బొమ్మ కొంటేగానీ కదలను" అంటూ.

ఇక తప్పదని ఓ బొమ్మల కొట్టుకు తీసుకువెళ్ళింది సుజాత.

ఏ బొమ్మ చూసినా "ఇది పాతదే... నాదగ్గరుంది... వద్దు" అంటూ మొదలెట్టాడు.

"చూడండీ! ఈమధ్య వచ్చిన కొత్తరకం బొమ్మేదయినా వుంటే చూపించండి" అంటూ పిల్లాడిమీద విసుగుని కొట్టువాడిమీద చూపించింది సుజాత.

వళ్ళుమండింది కొట్టువాడికి.

"ఉండండి! మేడమీదున్నాయి పట్టుకొస్తాను" అంటూ పైకి వెళ్ళి ఓ పెద్ద వ్యాన్‌లా కనిపించే బొమ్మ తెచ్చాడు. దానిమీద అంద



మైన స్టిక్కర్లు అంటించి చూడ్డానికి బాగానే వుంది.

"ఈ బొమ్మ 'కీ' ఇస్తే నడుస్తుందా? ఇందులో విశేషమేమిటి? ఖరీదెంత?" అని అడిగింది సుజాత.

"రెండువందలు" అన్నాడు కొట్టువాడు గట్టిగా.

"రెండువందలా?"

"దీనికి 'కీ' వుంది. రెక్కలున్నాయి. అయినా అది నడవదు, ఎగరదు" అన్నాడు షాపు అతను సీరియస్‌గా.

"అదేమిటయ్యా!" అంది సుజాత తెల్లబోతూ.

కొట్టూ దూరంగా మరో అరలో బొమ్మలు చూస్తూండటం చూసి సుజాతతో నెమ్మదిగా చెప్పాడు కొట్టువాడు.

"చూడండమ్మా! ఈ బొమ్మ పిల్లలకి మంచి సహనాన్ని పట్టుదలని నేర్పుతుంది. అనుకున్నది సాధించాలన్న ఆలోచనని నేర్పుతుంది. కావాలంటే మీ అబ్బాయికిచ్చి చూడండి. దాన్ని నడిపే ప్రయత్నంలో మళ్ళీ మిమ్మల్ని కొన్నాళ్ళదాకా కొత్తబొమ్మ కొనమని అడగడు. మీకు గనక వందరూపాయలకిచ్చేస్తాను" అన్నాడు కొట్టువాడు ఆ పాడయిపోయిన తుక్కుబొమ్మని ప్యాక్‌చేస్తూ.

-రాధాశివమోహన్

## కొండగుర్తులు

"పొద్దుటినుంచీ ఒకటే గాలిస్తున్నాను. ఈ నెంబరున్న ఇల్లెక్కడో చెప్పగలరా?" అడిగాడా ఆగంతకుడు.

దస్తగిరి పట్టలాని నవ్వుతో "ఈ కాలనీలో ఇంటినెంబరట్టుకుని గాలిస్తే ఇక దొరికినట్టే! రెండో నెంబరు పక్కనే నూటరెండో నెంబరు ఇల్లు దర్శనమిస్తది" అన్నాడు.

"అయ్యో! మరెలా? పోనీ, ఏవైనా 'కొండగుర్తులు' చెప్తారా? మీ నోటిచలవ వలన ఇల్లు దొరికితే, మీ నోట్లో చక్కెర పోస్తాను"

"ఆ పని సెయ్యమోకండి! ఇప్పటిదాకా నేను సుబ్బరంగా తిని, తిరుగుతున్నాను. సరే, ఇంతకీ ఎవరిల్లు కావాలి?"

"పాలిట్రిక్స్ రావుగారి ఇల్లు"

"ఓస్, అదా! కొండగుర్తులు సెబుతాగానీ జాగర్తగా రాసుకోండి!"

అన్వేషణామూర్తి నోట్‌పుస్తకంతో అటెన్షన్‌లో నిలబడ్డాడు.

"ఈ దారిన వెడితే విరిగిపోయిన జెండా కొయ్య అగుపడుద్ది. ఏడాదికోతూరి గెడకర్రని పై నగానికి కట్టి, జెండా ఎగరేస్తారు. ఆ తర్వాత జెండాగుడ్డ పిల్లగాళ్ళకు గోచీగుడ్డగా మారిపోద్ది"

దస్తగిరి చెప్పినవన్నీ రాసుకోకుండా, 'విరిగిన జెండా కొయ్య' అనిమాత్రం రాసుకున్నాడు.

"మరికొంచెం ముందుకు వెళితే ఓ చెయ్యి విరిగిపోయిన గాంధీజీ బొమ్మ, ఓ కాలు విరిగిపోయిన మాజీ ప్రధాని బొమ్మలు ప్రత్యక్షమవుతాయి"

"చెయ్యిలెస్ గాంధీ, కాలు లెస్ ప్రధాని" అని గుర్తులు రాసుకున్నాడు శ్రోత.

"ముక్కుకు సూటిగా వెళ్తే 'బాపూజీ బ్రాందీ షాపు' దర్శనమిస్తది"

ఈ సమాచారం 'బా.బ్రా.షాప్'గా నమోదు అయింది.

"నాలుగు రోడ్లు దాటాక కుడివేపుకి తిరిగితే 'శ్రీ సాయి పందిమాంసం కొట్టు' ఉంటది"

నోట్‌చేసుకున్నాడు ఆగంతకుడు.

"అక్కడో డ్రైనేజీ కాలవ రెండుదిశలుగా పారుతూ ఉంటుంది. గంగానది అయినా ఎండాకాలంలో పారుదల తగ్గుద్దేమోగానీ, ఈ సైడు కాలవమాత్రం ఏడాదిపొడుగూతా అలాగే ఉరకలేస్తూ ఉంటది. దాన్ని దాటాలి. ఆపైన ఎడమవైపు తిరిగితే బొమ్మజెముడు పొదలు, జిల్లేడు, తుమ్మచెట్లు, దట్టంగా పెరిగిన మైదానం ఉన్నది. కాస్త జాగ్రర్తగా పరికిస్తే అక్కడ తుప్పలమాటున ఓ వెలసిపోయిన బోర్డు కనబడుద్ది. దానిమీద 'ప్రభుత్వ ఉద్యానవనము' అని రాసుంటది. ఆ ఎదురిల్లేనయ్యా నువ్వు అడిగిన పాలిట్రిక్స్ రావుగారి ఇల్లు!"





దస్తగిరి ఆనందభాష్పాలతో, కృతజ్ఞతాము కుళిత హృదయుడై ''థాంక్స్'' చెప్పి బయల్దేరాడు. విరిగిన జెండాల్నీ, చెయ్యి, కాలు విరిగిన బొమ్మల్నీ బాపూజీ బ్రాందీషాపునీ, పందిమాంసం కొట్టునీ అన్నిటినీ కరెక్టుగానే పోల్చుకుంటూ, దాటుతూ వచ్చాడు.

దుర్గంధభూయిష్టమైన మురుక్కాలవను కూడా దాటాక ఇక మిగిలింది 'ప్రభుత్వంవారి బృందావన గార్డెన్స్!'

డ్రైనేజీ దాటి ఓ కిలోమీటరు వెళ్ళాడు. కానీ సదరు పూలతోట ఆనవాళ్ళు కూడా గోచరించ లేదు. మురుక్కాలవకు ఉపనది అయిన ఇంకో



కాలువను కూడా దాటాడు. ఆ గౌతమీనదిని దాటిన పుణ్యంకొద్దీ చెప్పులు తెగిపోయాయి.

అక్కడో చెప్పులు కుట్టేవాడు ఉన్నాడు. ''ఏంబాబూ! మీ చెప్పులు తెగిపోయినాయి! ఇలాగిచ్చేసెయ్యండి! గవర్మెంటోళ్ళు పుణ్యమా అని ఇలాటి డ్రైనేజీ కాలవలు పారినన్నాళ్ళూ మా వ్యాపారానికేమీ ఢోకాలేదు''

అతను కుట్టిచ్చిన చెప్పును సరిచూసుకుంటూ అడిగాడు అన్వేషణార్థి - ''ఇక్కడెక్కడో ఓ పార్కూ, దానెదురుగా పాలిట్రిక్స్ రావుగారి ల్లూ ఉండాలి, నీకు తెలుసా?''

''ఆ ఇల్లు ఎదురు పార్కు గురించేనా మీరు అడుగుతున్నారు?''

''కాదు! పార్కు ఎదురుగా ఇల్లు గురించి ఎంక్వైరీ చేస్తున్నా'' తిరిగీ తిరిగీ అలిసిపోయి కాస్త చిరాకుతో అన్నాడు.

''అదేలెండి! ముందు నా పెడ్డుపైన చూడండి. ఇదిగో, ఈ బోర్డు అదే!''

''నిజమే! బి.సి.నాటి శాసనప్రతిలోలాగా ఆ బోర్డుమీద 'ప్రభుత్వ ఉద్యానవనము' అనే అక్షరాలున్నాయి.

''మళ్ళీ వచ్చినదారమ్మటే వెళ్తే కిలోమీటరు వెనకనే కొత్త బంగళా, దాని గుమ్మంలో కొత్తగుమ్మడి కాయ నిగనిగ మెరుస్తూ కట్టి ఉంటుంది. పచ్చని మామిడాకుల్తో కొత్త సినీ హీరోయిన్లా ఉన్న ఆ భవంతి ముందరిగేటుకు ఇక్కడ కుక్కలున్నవి జాగర్త!' అనే బోర్డు ఉంటది. ఆ రాజభవనమే పాలిట్రిక్స్‌గారి ఇల్లు'' అని ఓపికకు మారుపేరు అయిన ఆ పాదరక్షా సృష్టికర్త వైనవైనాలుగా చెప్పాడు.

అలాగే వెనక్కి వచ్చిన అన్వేషణామూర్తికి ఆ కొత్తబంగళాను చూడగానే అర్థమైంది.

'సదరు పార్కు అనబడే ప్రదేశం, పాలిట్రిక్స్ రావుగారిచేత ఆక్రమించబడినదీ!' అని!

''అమ్మయ్యా! ఏమైతేనేమి, ఎలాగైతేనేమి, అడ్రను దొరికింది'' అని నిట్టూర్చేరు అన్వేషణా మూర్తిగారు.

-పి.కుసుమకుమారి

చతుర
సంపుటి: 16
సంచిక: 11
డిసెంబర్ 1993

ఎక్కడ ఆత్మహత్య జరగబోతున్నా అక్కడ ప్రత్యక్ష మవుతారు అతడి మనుషులు.

సదరు వ్యక్తిని ఆ అఘాయిత్యంనుంచి తప్పించి, అతడి ఆయుష్షును కొనేసి, అతణ్ణి తమ అధీనంలోనికి తీసుకుంటారు.

అదో వింతవ్యాపారం. జీవితంపట్ల ఆసక్తి కోల్పోయిన వారి ఆయుష్షు కొనేసి పోషించే వారి కేంద్రం ఎవరికీ అర్థంకాని ఓ అద్భుత ప్రపంచం.

వయోబేధం లేకుండా స్త్రీపురుషులెందరో ఆత్మహత్యా ప్రయత్నాలనుండి విముక్తులై, ఆ ఆశ్రమానికి చేరుతున్నారు.

ఎందుకు? కంటికి కనిపించని ఆయుష్షును అమ్ముకోడం, కొనడం ఎలాసాధ్యం?

మానవజీవితాల్లోని సున్నిత కోణాలని స్పృశిస్తూ పి.వి.శేషారత్నం రాసిన 'అమృతహస్తం' ఈ నెల 'చతుర' సమగ్రనవల.

# అమృతహస్తం

— పి.వి.శేషారత్నం

చిక్కని నీలి సముద్రం...

ఉరుకులు పరుగులతో వచ్చి ఒడ్డుకి కొట్టుకుని ఏం సాధించాయో తెలియనట్లు నిరాశా నిస్పృహలతో వెనక్కి తిరిగి పోతున్నట్లున్న ఉవ్వెత్తు కెరటాలు.

మధ్య తరగతి కుటుంబీకుడిలా కడగళ్లలో సుడులు తిరుగుతూ సతమతమవుతున్నట్టున్న తెల్లని నురుగు.

సుఖాల తీరం అంచులు కూడా కనబడనట్టు సముద్రపు ఆవలి తీరం అంతులేని చిక్కని జలరాసుల ఆవల ఎక్కడో...

అమృత మనసులోనూ అదే సాగర మథనం...

ఎదురుగా ఉన్న అనంత సాగరపు జలరాసుల మధ్య ఆమె చూపు ఎక్కడో చిక్కడిపోయింది.

విశ్రమించని కెరటాల్లా ఆమె మనసు ఆలోచనలతో ఎగిరెగిరి పడుతోంది.

సమస్య ఎటువైపునుంచి ఆలోచించినా చిక్కుముడి దగ్గరే ఆగిపోతోంది.

అమృత మనోనేత్రాల ముందు ఎన్నో దృశ్యాలు సినిమా రీళ్లలా చకచకా కదిలిపోతున్నాయి.

ఇపుడేం చేయాలి?

ఆమెకు ఏ దారీ కానరావడంలేదు.

ఒక్కటే పరిష్కారం!

అవును!

తన మనసులోని మథనం ఆగిపోయేందుకు అదొక్కటే మార్గం అంతే!

ఇక ఏ సమస్యా ఉండదు.

విసురుగా తల వెనక్కి విదిల్చింది.

జోరుగా వీస్తున్న చలిగాలికి ముంగురులు చివురుటాకుల్లా కంపించి పోతున్నాయి.

ఆ ఊపుకు ఆమె పైట సర్రున విడివడి స్వేచ్ఛా విహంగంలా ఎగిరిపోయేందుకు విశ్వ ప్రయత్నం చేస్తోంది.

అమృత లేచి చుట్టూ చూసింది.

అప్పటికే చీకటి వల్చగా అలముకుంది.

ఎదురుగా కెరటాల హోరు, చలిగాలి తప్ప సముద్రపు నీలిరంగు నల్లగా ఎప్పుడయిందో తెలియనేలేదు.

బీచ్‌లో ఒక్క మనిషి కాదు, కనీసం పిట్ట కూడా లేదు.

పిడతకింది పప్పు అమ్ముకునే వాళ్లుకూడా వెళ్లిపోయారు.

అదే మరొకప్పుడయితే ఆ పరిసరాలు, ఆ వాతావరణం చూసి అమృత గుండెలు జారిపోయేవే.

కానీ ఇప్పుడున్న స్థితిలో ఆమెకు భయం వెయ్యలేదు. అసలు భయం వేసేందుకు ఆమె మనసు, మెదడు పని చేస్తుంటేగా.

అంతలో...

ఏదో నిశ్చయానికి వచ్చినట్టుగా చకచకా ఒడ్డు వెంబడి నడక సాగించింది.

ఈసారి కెరటాలు ఆమె పాదాలను ముద్దు పెట్టుకుంటున్నాయి.

నడక వేగం పెరిగింది.

ఏదో అడుగుల సవ్వడి

అమృత ఆగి చెవులు రిక్కించింది

ఆ చీకట్లో ఆమెకేం కనిపించడం లేదు

దూరంగా ఎక్కడో ఓ వెలుగు తునక.

మళ్లీ నడిచింది అమృత.

ఈసారి కెరటాలు ఎగిసి ఆమె నడుమును అందుకునేందుకు ప్రయత్నిస్తున్నాయి.

కళ్లు గట్టిగా మూసుకుంది అమృత.

ఆ క్షణంలో ఆమె వెన్నులో ఓ జలదరింపు... అది భయమో... తెగింపో... జీవితంపట్ల విరక్తో? మమకారమో? చెప్పలేం!

మరింత లోపలికి నడిచింది మొండిగా.

చొరవగా ఆమె గుండెల్ని తర్వాత ముఖాన్ని చుంబించింది సాగరం.

ఉక్కిరిబిక్కిరయింది అమృత.

మరొక్క నిమిషం చాలు సాగరమాత ఆమెను తన గర్భంలో దాచుకునేందుకు. ఎగిరొచ్చే కెరటం తనని నిండుగా కౌగలించుకుని లాక్కెళ్తుందని ఎదురుచూస్తున్న అమృత జబ్బపై... వెచ్చగా ఓ మానవ స్పర్శ.

ఉలిక్కిపడింది అమృత!

చావబోయేముందు ఏమిటీ భ్రమ.




కానీ అది భ్రమ కాదనీ...
నిజంగా ఓ మానవ హస్తమే తనను బలంగా ఇవతలికి లాగుతోందనీ...
గ్రహించిన అమృత అసహనంగా గింజుకుంది.

కానీ ఆ ఆకారం మరింత బలంగా అమృతను ఒడిసిపట్టింది.

ఈసారి అమృత నరనరానా భయం విద్యుత్తులా ప్రవహించింది.

కారణం అది పురుష స్పర్శ అని ఆమె దేహం గుర్తించేసింది.

శాయశక్తులా గింజుకుంటున్న అమృత చేతికి అతని గడ్డం గరుకుగా తగిలింది.

ఇపుడు భయం స్థానంలో అమృతలో ఆవేశం.

తన ప్రయత్నాన్ని భగ్నం చేస్తున్న వ్యక్తి పట్ల ఆపుకోలేని క్రోధం.

ఆ పెనుగులాటలో ఆమెతోపాటు అతనూ ఆ తడి ఇసకలో కూరుకుపోయాడు.

మళ్లీ ఓ కెరటం వేగంగా వచ్చి ఆవేశంగా ఆ ఇద్దర్నీ కప్పేసింది.

అమృత ఉక్కిరి బిక్కిరయిపోయింది.

అదే అదనుగా అతను లేచి రెట్టించిన బలంతో ఆమెను మరింత వెనక్కి లాగాడు.

తన స్త్రీత్వానికి ప్రమాదమేర్పడబోతోందని అర్థం చేసుకున్న అమృత అతన్ని బలవంతాన విదిలించుకుని ముందుకు పరిగెత్తబోయింది.

కానీ నిలువెల్లా తడిసిన ఆమెకు చీర అందుకు సహకరించలేదు.

అయినా ఆమె ఆ ప్రయత్నం ఆపలేదు.

ఆమె మొండిబలంతో తన చేతినుండి జారి పోతోందనిపించడంతో అతని కదలికలో ఓ మెరుపు.

అంతే...

అదిరిపడేలా ఆమె లేత బుగ్గమీద అయిదు వేళ్లూ ముద్రపడేలా ఓ బలమైన దెబ్బవేశాడతను.

ఆమె నివ్వెరపాటుతో నిర్ఘాంత పోయింది.

సముద్రం కూడా ఓ క్షణం ఆగిపోయిందా అన్నట్టు అనంత నిశ్శబ్దం.

గాలి కూడా హడలిపోయిందా దెబ్బకి.

తరువాత జరగబోయే దానిని భరించలేనన్నట్టు భయంతో ఆమె మెదడు మూగబోయింది.

నిశ్శబ్దంగా తల వాల్చేసిందామె.

ఆ వ్యవధి చాలు అతనికి.

చీకట్లో అతని పెదవుల మీద మెరిసిన నవ్వు చూసేందుకు అక్కడెవరూ లేరా సమయంలో.

చుక్కల వెలుతురు తప్ప మరేకాంతీలేదక్కడ.

ఇసకలో వాలిపోయిన అమృతను బలవంతాన లేవనెత్తి భుజాన వేసుకున్నాడతను.

క్షణం కూడా ఆగకుండా ఇసకలో బరువుగా అడుగులు వేస్తూ బీచ్ దాటి రోడ్డెక్కాడతను.

బలిష్టుడైన పట్టువదలని విక్రమార్కుడిలాంటి అతని భుజంపైన వేలాడిపోతోంది అమృత.
ఇంతలో...

దూరంగా పోలీస్ విజిల్...

కారు వద్దకు చేరేందుకు మరో పది మీటర్లుంది.

నడకను పరుగుగా మార్చేందుకు భుజాన్న ఉన్న అమృత బరువు సహకరించడంలేదతనికి.

అయినా పంటి బిగువున చకచకా అడుగుల వేగం పెంచాడు.

దూరంగా సైకిల్‌పై వస్తున్న ఎర్రటోపీ వేగం పెంచింది.

బీచ్ రోడ్డుపై ఓ ఆడదాన్ని మోసుకుపోతున్న ఓ మగాడు! అంతే అతనికి కనుపించేది!

విజిల్ మరోసారి మరింత గట్టిగా మోగింది.

అదిరిపోయేలా ఉందది! మానభంగమో, హత్యో??? అనుకుంటోంది ఎర్రటోపీ!

అతను కారు బాక్ డోర్ తెరిచి ఆమెను లోపల పడేసి తను స్టీరింగ్ ముందుకు దూకి కారును పరిగెత్తించడం, పోలీస్ మరోసారి




# మురిపించే గడియారం

జర్మనీ అడవుల్లోని నల్లటేకు చెక్కనుంచి తయారైన ఈ అద్భుతమైన ఫ్రేంలోని గడియారం పక్షిలా కూస్తూ గంటలను తెలియజేస్తుంది. దీని స్వంతదార్లయిన రాబిన్, రాబర్ట్ దంపతులు, ప్రపంచం మొత్తం మీద ఇదే అతి పెద్ద గడియారం ఫ్రేం అని వాదిస్తున్నారు. విక్టోరియాలోని వారి స్వంత మ్యూజియంలో దీన్ని ప్రదర్శనకు పెట్టారా దంపతులు. దీని విలువ ఇండియన్ కరెన్సీలో లక్షా ఇరవై వేలని తెలుస్తోంది. 150 సెంటీమీటర్ల పొడవు, 66 సెంటీమీటర్ల వెడల్పుగల ఈ గడియారం ఫ్రేంలో అతి సూక్ష్మమైన, నాజూకైన నగిషీ పనికి దుమ్ము పట్టకుండా ఎప్పటికప్పుడు తళతళ లాడేలా శుభ్రం చేస్తుంటుంది రాబిన్. 'సదా కొత్తగా, అందంగా కనిపించే ఈ గడియారం నా స్వంతమవడం నాకెంతో గర్వకారణం' అని మురిసిపోతూ వుంటుంది రాబిన్.

విజిల్ వేయటం ఒక్కసారే జరిగింది.

కానీ, నెంబర్ నోట్ చేసుకునే అవకాశం కూడా లేనంత మెరుపు వేగంతో కారు ముందుకు దూకింది.

అతను గాఢంగా నిట్టూర్చాడు, సైకిల్ ఎప్పుడూ కారును అందుకోలేదు. నిజమే. కానీ కేవలం ఓ వెంట్రుకవాసి తేడా అంతే!

లేకపోతే ఈ రాత్రి పెద్ద న్యూసెన్స్‌లో గడిచేది. కారు డ్రైవ్ చేస్తున్న అతన్ని సేద దీరుస్తున్నట్టు చల్లనిగాలి బలంగా స్పృశిస్తోంది.



అమృతకు జరుగుతున్నదేమిటో అర్థం కావడంలేదు.

అసలు తనెక్కడుంది?

గాలిలో...

తన శరీరం...

దూదిపింజెకన్నా తేలికగా అయి ఎలా ఎగరగలుగుతోంది?

అదసలు తన శరీరమేనా?

అవును తనదే?

మరి గాలిలో ఎగరడమేమిటి?

అసలు తను బతికుందా చచ్చిపోయిందా?

చచ్చిపోయే ఉండాలే!

అయితే తను దయ్యమయిందా?

లేకపోతే ఇలా గాలిలో ఎగరడమేమిటి?

ఒక్కసారి పల్టీకొట్టింది ఆమె శరీరం.

ఆధారం దొరక్క తలక్రిందులై ఉక్కిరిబిక్కిరయిపోతూ గాలిలో చేతులు విసురుతోంది.

హమ్మయ్య దొరికింది.

అరె ఏమిటిది?

వెచ్చగా హాయిగా...

రిలీఫ్‌గా...

ఆధారాన్ని తడిమి గబుక్కున వదిలేసింది అమృత.

కారణం, అదో పురుష హస్తం.

చాలాసేపటి తర్వాత మళ్లీ స్పృహలోకొచ్చింది అమృత.

ఎదురుగా...

మసక మసకగా...

ఒక ముఖం...

తన ముఖంకేసి ఆదుర్దాగాచూస్తూందది!

క్రమంగా ఆ రూపం స్పష్టమైంది.

పచ్చని ముఖంలో అంతులేని వర్చస్సు.

అందమైన నొక్కుల జుట్టు...

ఆ కళ్లు దయావర్షం కురిపిస్తున్నాయి.

అమృత లేవాలని ప్రయత్నించినప్పుడు గమనించింది తన చేతిలో అతని బలమైన హస్తం చిక్కుకుపోయి ఉందని.

తత్తరపాటులో ఆ చెయ్యి వదిలి లేచి కూర్చుంది.

తనెక్కడుంది?

చుట్టూ చూసింది.

ఇదేదో కుటీరంలా వుంది.

గోడలు, నేల చక్కగా అలికి ఉన్నాయి.

మంచి ముగ్గులు తీర్చిదిద్ది కనిపిస్తున్నాయి.

వెదురుబద్దల కిటికీలోంచి బాలభానుడు తొంగి చూస్తున్నాడు.

ఆమెనే దీక్షగా చూస్తూ ఆ కదలికను గమనించిన అతని ఎర్రని పెదవులమీద ఓ మనోహర దరహాసం వెల్లివిరిసింది.

నిష్కల్మషంగా ఉందా నవ్వు! దాని వెనుక అతని చక్కని పలువరున తళుక్కుమంది. బిత్తరపోయి చూస్తోంది అమృత!

అంతలో ఆమెకు రాత్రి జరిగింది స్ఫురణకు వచ్చింది. అంతే!

కోపంతో ముక్కుపుటాలెగిరిపడ్డాయి.

"నన్నెందుకిక్కడకి తీసుకొచ్చారు? అసలు మీరెవరు? నా ప్రయత్నం భగ్నం చేసే అధికారం మీకెక్కడిది?"

అతనేం మాట్లాడలేదు.

అమృత కోపం రెట్టింపయింది.

మనిషి బలహీనత అదే... మన మాటలకి ఎదుటివాడు తిరగబడితే నోర్మూసుకుంటాడు. సమాధానమివ్వకపోతే రెచ్చిపోతాడు.

అమృతలో బద్దలయింది అగ్నిపర్వతం. తన జీవితం గుర్తొచ్చింది.
కోపంతో కేకలువేసింది.
రంకెలేసింది.
చివరికా కోపం నిస్సహాయతగా మారి...
ఆ నిస్సహాయతలోంచి సెల్ఫ్‌పిటీ...
ఆక్రోశం...
ఆవేదన...
దుఃఖం...
లావాలా కరిగి ప్రవహించింది.
అతను కదలలేదు. నోరు మెదపలేదు. అర గంటకు అంతా సద్దుమణిగింది.

ప్రగాఢ నిశ్శబ్దం.
అప్పుడు గొంతు విప్పాడతను.

"నా పేరు మృత్యుంజయ"

మార్దవంతో కూడిన గంభీర స్వరం అతనిది.

తలెత్తింది అమృత.
ఆ కళ్లు మంకెనపువ్వుల్లా ఉన్నాయి.

"నన్నెందుకు బతికించారు?"
ఈసారి ఆ కంఠంలో కోపంలేదు.
అంతులేని వ్యధ మాత్రం తొంగిచూస్తోంది.

"మీ పేరేంటి?"
తాపీగా అడిగాడు మృత్యుంజయ.

"నా ప్రశ్నకు సమాధానం అదికాదు'
ఉక్రోషం ధ్వనించిందామె స్వరంలో.

"మీ ప్రశ్నకు సమాధానం మీ పేరే?"
విస్తుపోయిందామె.

"అమృత.. కదూ?"

"నా పేరు మీకెలా తెలుసు?'

అతడు మౌనంగా ఆమె హాండ్‌బాగ్ చూపించాడు.

"అది మీ భుజానికి తగిలించేవుంది భద్రంగా"
అమృత మాట్లాడలేదు.

"అమృతగారూ! మీరెందుకు చనిపోవాలనుకున్నారూ అని నేను అడగను. అదొక బలహీన క్షణం. మీకు కలిగిన కష్టం ఆ క్షణంలో భూతంలా మిమ్మల్ని మింగేసేంత ఎదిగి భయపెట్టి వుంటుంది. ఆ క్షణం దాటింది. మీరు బయటపడ్డారు"

"కాదు మీరు పడేశారు"

"ఏదైనా ఒక్కటే. సరే! మీకింకా ఆత్మహత్య చేసుకోవాలనే వుందా? ఒక్క మాటలో చెప్పండి"

ఆలోచనలో పడింది అమృత.
నిజానికిప్పుడు ఆమెకి చావాలని లేదు.
అలాగని తన సమస్య పరిష్కారమయిందనీ కాదు.
కానీ...
రిలీఫ్‌గా ఊపిరి విడిచాడు మృత్యుంజయ.

"అంటే మీకు ఎలా బతకాలో తెలియకపోయినా చావాలని మాత్రం లేదు. నాకు తెలుసు అదొక బలహీనక్షణం. అంతే...

అతని మాటలు తనలోతను అనుకుంటున్నట్టున్నాయి.

"మీరెక్కడికెళ్లాలో చెప్తే మిమ్మల్ని భద్రంగా డ్రాప్ చేస్తాను"

పక్కలో బాంబు పేలినట్టయింది అమృతకు.
తనెక్కడికి వెళ్లాలి? ఎవరున్నారు?
ఎవరూలేరని ఇక్కడెలా వుంటుంది?
ఆమె ఆలోచన గ్రహించిన వాడిలా అన్నాడు మృత్యుంజయ.

"నాది బిజినెస్ మైండ్ మనమో ఒప్పందానికొద్దాం"

"ఏమిటది?'

"మీరివ్వగలిగిందీ, మీ దగ్గరున్నదీ నాకు అమ్మేస్తే మీకో దారి చూపించగలను"

అనుమానంతో అమృత భ్రుకుటి ముడివడింది.
"ఏమిటీ మీరనేది?"

"మానవుడి నగటు వయస్సు ఒకప్పుడు నూరేళ్లు. ఇప్పుడు డెబ్భై అయిదు. మీ వయ




ను పాతికకు మించదు. అంటే డెబ్బై అయిదు లోంచి పాతిక తీసేస్తే ఏభై సంవత్సరాలు. ఆ ఆయుష్షు నాకు అమ్మగలగాలి''

అమృతకు ఇంతసేపటికి మొదటిసారిగా అనుమానం వచ్చింది, అతను పిచ్చివాడేమో నని.

ఆయుష్షు అమ్మడమేమిటి?
అది మన చేతిలో ఉంటుందా?

అలాగయితే నిన్ననే తను చనిపోయి వుండేదిగదా! ఆమె ఆలోచనను అర్థం చేసుకు న్నట్లు మృత్యుంజయ నవ్వాడు.

''మనిషి ఎంత స్వార్థపరుడో చూశారా? నిన్న రాత్రే చచ్చిపోయి వుంటే ఇపుడు మీరిలా వుండేవారే కాదు. నిజానికి మిమ్మల్ని నేను అడగాల్సిన అవసరం కూడాలేదు. మీ జీవితం మీద నాకు హక్కుంది. మీ దృష్టిలో, లోకం దృష్టిలో అమృత నిన్ననే చచ్చిపోయింది. కానీ చెప్పానుగా నేను బిజినెస్‌మేన్‌ని అని. ఊరికే నాకేదీ అవసరంలేదు. మీ ఆయుష్షు అమ్మడా నికిష్టపడకపోతే మీరీక్షణమే వెళ్లిపోవచ్చు''

''నా ఆయుష్షు మీరేం చేసుకుంటారు? అసలు నేనెలా అమ్ముతాను''

''అమ్మగలరు... మిగిలిన యాభై సంవత్స రాలు నా పర్మిషన్ లేకుండా మీరు ఆత్మహత్య చేసుకునేందుకు వీలులేదు.

''అదేమిటి?''

''అదంతే... మీ ఆయుష్షుమీద నాకు మాత్రమే అధికారంవుంది''

సాలోచనగా అంది అమృత...
''మరి నా ప్రతిఫలం?''

నిజానికి ఈమాట ఆమె అడగ్గూడదు. కానీ ఇదేదో బొమ్మలాటలావుంది. ఆమె మనసు అనుకోకుండా తేలికయిపోయింది.

''మీకు ఉద్యోగం ఇస్తాను. మీ బతుకుతెరు వుకి లోటుండదు''

''ఏం వుద్యోగం''

''అది తర్వాత చెప్తాను. ముందు మన ఒప్పందం కుదిరితే!''

''నాకు ఉద్యోగం అవసరమని ఎందుకను కుంటున్నారు?''

''మీకు, నేను సైకాలజిస్టులా కనిపిస్తు న్నానా'' నవ్వు కదలాడిందతని ముఖంలో.

'పిచ్చివాడిలా కనిపిస్తున్నావు' అనలేదు అమృత.

''ప్రతీ మనిషికీ ఉద్యోగం... అంటే... ఏదో ఒక పని అవసరమే''

''పనిలేని మనిషి బుర్ర దయ్యాల కార్ఖానా, అన్నాడొక కవి. అదీగాక మీకు హేండ్‌బేగ్‌లో మీ సర్టిఫికెట్లు పెట్టుకుని తిరగడం చూసి మీకు ఉద్యోగం అవసరమనిపించింది''

మృత్యుంజయ పరిశోధనా దృష్టికి స్పంది స్తూ అభినందన పూర్వకంగా చూసింది అమృత.

అతనామెవంక చూడకుండానే అన్నాడు...

''ఈ డీల్ మీరు ఒప్పుకున్నట్టే అనుకుంటు న్నాను. ఈ క్షణంనుంచీ మీరు ఉద్యోగంలో చేరుతున్నారు''

తెల్లబోయింది అమృత.

ఉద్యోగాలేవో ఇతని జేబులో పెట్టుకు తిరు గుతున్నట్టు చెబుతున్నాడే.

''ఇంతకీ నా ఉద్యోగం ఏ ఆఫీసులో వేయించగలరు!''

''నా ఆఫీసులో. అంటే ఇక్కడే''

తనకి పిచ్చెక్కుతుందేమో అనిపించిందా మెకి.

చూడబోతే ఈ మనిషి తనే ఓ నిరుద్యోగిలా వున్నాడు. తనకు ఉద్యోగం ఇస్తాడా? తమాషా చేస్తున్నట్టుంది.

అమృత నోరు విప్పి ఏదో అడగబోయేంతలో ఒక పదేళ్లపాప లోపలికి తొంగిచూసింది.

''అంకుల్ అంతా రెడీ మీరొస్తారా, అంతా ఎదురు చూస్తున్నారు''

''పద సుప్రియా! అమృతా మీరూ రండి. మనం ప్రార్థనా మందిరానికెళ్దాం.

★ ★ ★

ఎవరీ మృత్యుంజయ?

తను నిన్న అక్కడ, ఆ సమయంలో ఆత్మ హత్య చేసుకోబోతోందని ఇతనికెలా తెలి సింది?

లేక కాకతాళీయంగా ఆ సమయానికి,

అక్కడ ఉన్నాడా? సవాలక్ష ప్రశ్నలు అమృత ను ముసురుకుంటున్నాయి.

కుటీరం నుండి బయటికి వచ్చారు. బయటికొచ్చిన అమృత మనసు ఆనందంతో నిండిపోయింది.

అందమైన ఆ పరిసరాలు అద్భుతం!



ఎటు చూసినా పచ్చదనం

బారులు తీరిన సైనికుల్లా రకరకాల క్రోటన్స్, కళ్లు చెదిరే రంగుల్లో గులాబీలు.

విచ్చుకున్న మందారాలు.

స్నిగ్ధ నందివర్ధనాలు.

లేతభానుని బంగారు కిరణాలుపడి మంచు బిందువులు ఆకులపై ముత్యాల్లా మెరుస్తూ ప్రకృతిమాత ఆభరణాల్లా ఉన్నాయి.

రాత్రంతా కురిసిన మంచులో స్నానం చేసిన పచ్చనిగడ్డి చల్లగా పాదాలను చక్కిలిగింతలు పెడుతోంది.

చెట్లమీద పిట్టలు బద్ధకంగా రెక్కలు విదల్చుకుంటూ ముచ్చటగా కిలకిలారావాలు చేస్తుంటే గానసభ జరుగుతున్నట్టుంది.

పరిసరాలతో తననుతాను మరిచిన అమృత చెవులకు మధురమైనగానం సోకింది.

అసతోమా సద్గమయా...

తమసోమా జ్యోతిర్గమయ...

మృత్యోర్మా అమృతంగమయా...

లయబద్ధంగా సాగుతున్న ఆ గానం వినవస్తున్న దీక్షగా చూసిందామె.



"దాదాపు పాతికమంది చిన్నాపెద్దా, ఆడా మగా అంతా తెల్లని దుస్తులలో

కళ్ళు మూసుకుని తన్మయంగా పాడుతున్నారు.

ఎదురుగా ఎత్తైన మంటపంపై...

శివలింగాన్ని కౌగలించుకున్న మార్కండేయుని విగ్రహం.

అతన్ని పాశంతో లాగుతున్న యమధర్మ రాజు

అత్యద్భుత శిల్పం అది.

ఆ చెక్కిన శిల్పి ఎవరోగాని అత్యంత సహజంగా ఉన్న మనోహరశిల్పం అది.

అప్రయత్నంగా చేతులు జోడించింది అమృత.

ఆమె పెదవులు ప్రార్థనలో పాలుపంచుకుంటున్నాయి.

ఆమె నేత్రాలు నిమీలితమయ్యాయి.

అలా ఎంతసేపుందో తెలియదు. ఆమె మనసెక్కడికో ఎగిరిపోయింది.

"అమ్మా!"

అతి చల్లని పిలుపు అది!

ఆ మార్దవానికి అప్రయత్నంగా కళ్ళు తెరిచింది.

ఎదురుగా తెల్లని బట్టలు, నెరిసిన జుట్టు, బడుగుదేహంతో ఓ వృద్ధుడు.

చుట్టూ చూసేసరికి ఎవరూలేరు.

"అంతా వెళ్లి దాదాపు పది నిమిషాలయింది. నువ్వలాగే నించుండిపోయావు. ఎంత అదృష్టవంతురాలవు తల్లీ! ఇంతటి ధ్యానం సంయమనం అలవడడం చాలా కష్టం"

అమృతకి నవ్వొచ్చింది.

తనకి ధ్యానం సంయమనశక్తా? ఈ పరిసరాలు, ప్రశాంత వాతావరణం, లయబద్ధంగా సాగుతున్న ప్రార్థన తనని మరోలోకంలోకి తీసుకెళ్లాయి అంతే.

"మీరిక్కడ?" ప్రశ్నార్థకంగా ఆగిపోయింది అమృత.

"నేనిక్కడ ఏమీ కానమ్మా! నా తృప్తికోసం ఈ టైముకి వచ్చి పోతుంటాను. అందులోనూ ఆదివారాలు సాధ్యమైనంతగా ఇక్కడే గడుపుతుంటాను. నిన్నెప్పుడూ చూసినట్టు లేకపోతేనూ పలకరించాను. డిస్టర్బ్ చేస్తే ఏమీ అనుకోకమ్మా!"

"అయ్యో, ఫరవాలేదండీ! ఇదేమన్నా ఆశ్రమమా? దేవాలయమా? ఇది ఊళ్లోని ప్రదేశమేనా?"

"ఆశ్రమాలకన్నా దేవాలయాలకన్నా పవిత్రమైన ప్రదేశం తల్లీ! ఊరికి ఇరవై కిలోమీటర్ల దూరంలో వుంది. అంతా ఆ మహానుభావుడి చలవ. ఎందరికో ఆశ్రయం కల్పిస్తోంది. ఏ తల్లి కన్నబిడ్డో. ప్రపంచంలో అంతులేని దయ, కారుణ్యం, ప్రేమ ఆ కళ్లలో ప్రతిఫలిస్తుంటాయి. బాధితులపట్ల అమిత వాత్సల్యం అతనికి. ఒక్కడు ఇంత కార్యభారాన్ని ఎలా మోయగలుగుతున్నాడో ఆ పరమేశ్వరుడికే ఎరుక"

ఆయన చెబుతున్నది బహుశా మృత్యుంజయ గురించే అయి ఉండాలని ఊహించింది అమృత.

"మీరు చెప్పేది..."

"మృత్యుంజయ గురించేనమ్మా"

ఆమెలో కుతూహలం...

"ఆయన మీకెలా పరిచయం?"

"ఆర్నెల్ల క్రితం నా ఆయుష్షు అతనికి అమ్మేసానమ్మా!"

పక్కలో బాంబు పడినట్టు ఉలికిపడింది అమృత.

ఇంతలో సుప్రియ వచ్చిందక్కడికి.

"ఆంటీ! అంకుల్ మిమ్మల్ని ఆఫీసురూంకి తీసుకు రమ్మన్నారు" సుప్రియ అమృత చెయ్యిపట్టుకుంది.

★ ★ ★

ఆ సాయంత్రం చీకటి మునురుకుంటూండగా చాపమీద పడుకున్న అమృతకెంతకీ నిద్ర రావడంలేదు.

జరిగింది వాస్తవమైనా, జరుగుతున్నది కలో, వాస్తవమో అర్థంకాక అయోమయంగా అనిపిస్తోంది.




తను మరో విష వలయంలో చిక్కుకోలేదు కదా!

మృత్యుంజయ చేస్తున్న వ్యాపారమేమిటి? అతనికి డబ్బెలా వస్తోంది?

ఈ ఆయుష్షులు కొనడమేమిటి?

బిజినెస్ అంటున్నాడు, నిదానంగా తనని ఏ వేశ్యావాటికకో అమ్మేయడుకదా!

ఆ క్షణంలో మనసులో స్ఫురించిన ఆ ఆలోచనకి ఆమె ఒళ్లు జలదరించింది.

"అవయవాల వ్యాపారం అంటే కిడ్నీలు అమ్మేయడం కూడా కావచ్చు. ఈమధ్య పేపర్లలో తరచు చదివిన వార్తలవే. యువతీ యువకులను మోసగించి ఉద్యోగాలిస్తామని దూరతీరాలకు తరలించి కిడ్నీలు తీసి అమ్మేయడం.

ఉదయంనుంచీ ప్రశాంతంగా అనిపించిన వాతావరణం పరిసరాలు ఇప్పుడామెకు సాలెగూటిలా అనిపించి చెమటలు పట్టాయి.

ఈ అందమైన ప్రకృతి
ప్రశాంతంగా ఉన్న మనుషులు
ప్రార్థనలు
ఇవన్నీ చూసి బుట్టలోపడిపోయింది తను.

గబుక్కున లేచి కూర్చుంది అమృత.

ఆమెకు చెరోపక్క చాపల మీద ప్రశాంతంగా నిద్రపోతున్న ఆడవాళ్లిద్దరు.

ఇందాక తోడునీడగా అనిపించినవాళ్లే కాపలావాళ్లలా కనిపిస్తున్నారిప్పుడు.

"అమృతా! నిద్రపట్టలేదా?" ఉలిక్కిపడింది అమృత.

వీళ్లు తప్పకుండా తనకి కాపలాగా నియమించబడ్డవాళ్లే. అనుమానం లేదు.

గాఢనిద్ర నటిస్తున్నారన్నమాట.

తన కదలికలు గమనించకపోతే తను లేచిన క్షణానే వాళ్లకు మెలకువ ఎలా వస్తుంది?

"దాహం వేస్తోందా?"

"ఆ... ఆ.. అవును.. దాహం"

"అవిగో ఆ మూల కుండలో నీళ్లున్నాయి. తాగి పడుకో. ఉదయాన్నే లేవాలిగదా!" అని అటువైపు ఒత్తిగిలి పడుకుందామె.

మంచినీళ్లు తాగి వస్తూంటే అమృత బుర్రలో ఒక ఆలోచన. దీపం ఊదేసింది.

"అదేంటి?" రెండో ఆమె గొంతు.

"లైటుంటే నిద్రపట్టదు నాకు"

"సరే"

తడుముకుంటూ వచ్చి చాపమీద నడుంవాల్చింది అమృత.

మళ్లీ తలలో తేనెటీగల తుట్టె కదిలింది. తను సాయంత్రం ఆశ్రమాన్ని చుట్టి వచ్చింది.

అక్కడ ప్రతి ఒక్కరూ ఏదో ఒక పని చేస్తున్నారు.

ఒకరిద్దరు మాత్రం చెట్ల కింద స్తబ్దంగా కూర్చుని ఏదో ఆలోచించుకుంటున్నారు.

తనను చూసి అంతా తమ పనులు చేసుకుంటూనే స్నేహపూర్వకంగా నవ్వారు తప్ప ప్రత్యేకంగా పలకరించలేదు. తన వివరాలేం అడగలేదు.

సుప్రియ తోటి పిల్లలు నలుగురైదుగురు కలిసి ఒక వృద్ధుని దగ్గర చదువుకుంటున్నారు.

తనకేమీ తోచక అలా నడుచుకుంటూ చాలాదూరం వెళ్లిపోయింది. మనసునిండా అంతులేని ప్రశాంతత ఆవరించింది.

మళ్లీ వెనుదిరిగి వచ్చేసరికి కనుచీకటి ముసురుకుంటోంది.

ఇంతలో
ఏవో మాటలు వినిపిస్తే ఆగిపోయింది తను.

ఒక యువతి యువకుడు

అతను మృత్యుంజయ

ఆమె ఏడుస్తోంది. అతడు చేయి తలపై వేసి నిమురుతూ ఓదారుస్తున్నాడు.

"బాధపడకు ప్రవీణా! అంతా మనచేతిలో ఉందనుకుంటాం. కానీ జరిగేది జరక్కమానదు. అలా అని మన ప్రయత్నం మానకూడదు"

"అలా కాదు బాస్! చేజేతులా ఒక కేసు జారిపోయింది. ఆమె ఇంత త్వరగా రియాక్టవుతుందనుకోలేదు"

వెక్కిళ్ళమధ్య అందా యువతి-



మృత్యుంజయ గాఢంగా నిట్టూర్చాడు-

"ఒక యాభై సంవత్సరాలు మన చేజారిపోయాయిబాస్. నాకేదైనా శిక్ష విధించండి. మీరిచ్చిన అసైన్‌మెంట్‌లో ఫెయిలయ్యాను"

"ఒక ఆయుష్షు మిస్సయ్యాం- పోనీ ప్రవీణా! కేసంతా ఫైల్‌చేసి క్లోజ్ చేసెయ్- అన్నట్టు నీకు మరో అసైన్‌మెంటు అప్పగిస్తున్నాను"

ప్రవీణ తలెత్తింది-

"ఏంటి బాస్?"

మృత్యుంజయ చెప్పాడు-

"అమృత అని కొత్త కేస్- నీకు పూర్తిగా అప్పగిస్తున్నాను- కాస్త మొండిఘటంలానే వుంది. జాగ్రత్తగా డీల్ చెయ్యాలి"

"అలాగే బాస్"

తను చెవులు రిక్కించింది తన పేరు వినబడగానే- కాని ఆ తర్వాత తన గురించి అతనేం చెప్పాడో వినబడలేదు.

కాని ఇపుడాలోచిస్తే అర్ధమవుతోంది. తనని వీలైనంత మభ్యపెట్టి తన మూత్రపిండాలు... అవును- తప్పకుండా అంతే.

గబుక్కున లేచి కూర్చుంది అమృత-

ఆ చీకట్లో కళ్ళు తెరిచిన వెంటనే ముందు ఏం కనబడలేదు. క్రమంగా చీకటికి అలవాటు పడ్డాయి కళ్ళు.

వీలైనంత త్వరగా... ఈ క్షణంలోనే తను వెళ్ళిపోవాలి. ఇపుడు తప్పించుకోకపోతే తను ఉచ్చులో బిగుసుకుపోతే తనని కదలనీయరు.

శబ్దం చెయ్యకుండా లేచి ముందుకు నడిచింది.

తలుపు ఎటువైపు ఉందో గుర్తుచేసుకుంది.

అదృష్టవశాత్తూ కాపలా ఆడవాళ్లిద్దరూ గాఢ నిద్రలో మునిగి ఉన్నారు.

తలుపు తెరుచుకుని బయటపడింది-

చల్లగాలి ఆమెను ఒక్కసారి ఉక్కిరిబిక్కిరి చేసింది. చుట్టూ చూసింది.

గేటు దగ్గరెవరూ లేరు. నిశ్శబ్దంగా వెలుగుతున్న దీపం- ఆశ్రమమంతా నిశ్శబ్దంగా ఉంది.

అమృత గేటు తీసుకుని నాలుగడుగులు వేసింది చకచకా.

అంతే!

సర్పద్రష్టలా ఆగిపోయింది.

ఆమె కళ్లు పత్తికాయల్లా విచ్చుకున్నాయి.

ఎదురుగా ఓ కారు! ఆ కారు నానుకుని నించునివున్నాడు మృత్యుంజయ.



"మీరెక్కడికెళ్ళాలో చెప్తే డ్రాప్ చేస్తాను"

మృత్యుంజయ కంఠంలో అంతులేని నిస్త్రాణ ధ్వనిస్తోంది.

అమృతకు మొండిధైర్యం వచ్చింది.

"మీరు డ్రాప్ చెయ్యనవసరం లేదు. నేనే నా రెండు కాళ్ళతో నడిచి వెళ్ళగలను"

"మిమ్మల్ని రక్షించింది ఇంత రాత్రివూట మిమ్మల్ని ఒంటరిగా పంపి ఏ కాముకుల అఘాయిత్యానికో బలిచ్చేందుకు కాదు"

తనని భయపెట్టేందుకు ప్రయత్నిస్తున్నాడు.

తను లొంగకూడదు. గాఢంగా నిశ్చయించుకుంది అమృత.

'తను తిరుగుబాటు చెయ్యాలి'

"లేకపోతే ఇక్కడైనా బలికావల్సిందేగా" వ్యంగ్యం ఆమె కంఠంలో.

"అంటే"... బిత్తరపోయాడతను.

"మీ నాటకాలు నేను గ్రహించలేనంత అమాయకురాలిని కాదు. నన్ను రక్షించినట్లే నటించి మిమ్మల్ని బాగా నమ్మేలా చేసి, తర్వాత..."

"తర్వాత..."

"తర్వాత..." ఎలా చెప్పాలో బోధపడలేదు అమృతకు. అతనికలాంటి ఉద్దేశం లేకపోతే తను నేర్పినట్టవుతుంది.

"ఊ చెప్పండి... తర్వాత మీతో వ్యాపారం చేస్తాననుకున్నారు కదూ!"

"లేకపోతే నాకు కాపలా ఎందుకు పెట్టినట్టు?"

"కాపలానా..." అయోమయంగా అన్నాడు మృత్యుంజయ.

"మీరొంటరిగా కొత్త ప్రదేశంలో పడుకునేందుకు భయపడతారని..."

"ఆపండి చాలు... ఇంత అర్ధరాత్రి ఈ గేటు బయట మీరెందుకు కాపలాకాస్తున్నట్టో?"

"నేను అత్యవసరమైన పనిమీద బయటకు వెళ్తున్నాను అమృతా"

"కాదు... నేను పారిపోతానని ఊహించి..."

మృత్యుంజయకు నీరసం, నిస్సత్తువ ఆవహించాయి.

"అమృతా! ఒక్క పదినిమిషాలు ఆఫీసు రూంలో కూర్చుందాం వస్తారా?"

అతడు చేతులు జోడించిన తీరు చూసి ఒక్కక్షణం అమృత కించపడింది.

"మీకింతవరకూ ఏమీ చెప్పకపోవడం నాపొరబాటు. మీరేకాదు మీ పరిస్థితుల్లో ఉన్న ఏ ఆడపిల్లయినా ఇలాగే ఊహిస్తుంది. కాని మిమ్మల్ని నాలుగురోజులీ పరిసరాలకి అలవాటుచేసి మీ మనస్సు బాగా కుదుటబడ్డాక మీకంతా వివరించి మీకు అసైన్‌మెంట్ ఇద్దామనుకున్నాను"

అతని కంఠంలో ఏం వినిపించిందో అమృత మంత్రముగ్ధలా అతన్ననుసరించింది.

మృత్యుంజయ ఆఫీసు రూం తెరిచి లైటు వేశాడు.

పైకి కుటీరంలా ఉన్న ఆ ఇంట్లో అంత అద్భుతమైన ఆఫీసు గదిని చూసి అమృత ఆశ్చర్యపోయింది.

చుట్టూ అద్దాలతో చేసిన ఉడెన్ రాక్స్.

వాటినిండా ఫైల్స్...

పుస్తకాలు...

ఒక్కో ఫైలుపై ఒక్కో పేరు...

మధ్యలో టేబిల్‌చుట్టూ కుర్చీలు...

పైన సీలింగ్ ఫేన్...

రివాల్వింగ్ చెయిర్‌లో కూర్చున్నాడు మృత్యుంజయ.

"కూర్చోండి" కుర్చీ చూపించాడు అమృతకు.

అతని కంఠం గంభీరంగా వుంది.

"అమృతా... నేను..."

ఫోన్ మ్రోగింది.

ఒక్క ఉదుటున ఫోన్ అందుకున్నాడు మృత్యుంజయ.

అతను ఫోన్లో మాట్లాడుతున్నదంతా విచిత్రంగా వింటోంది అమృత.

"పుట్టింది ఆడపిల్లా. మైగాడ్! విశ్వం ను వ్వెక్కడికీ కదలకు. నేను వెంటనే బయలుదేరుతున్నాను"

అతడు కుర్చీలోంచి లేచి అమృతకేసి చూశాడు.

"అమృతా! నేను అత్యవసరంగా బయటకు వెళ్ళాల్సి ఉంది. ఇప్పటికే చాలా ఆలస్యమైంది"

మృత్యుంజయకు కంగారుతో చెమటలు పడుతున్నాయి.

"ఎవరైనా తెలిసినవాళ్లకు సీరియస్సా."

"తెలిసిన... అవును- మీలాంటివాళ్లే... ఆయుష్షు కావాలి... చెయ్యిజారిపోతుంది ఆలస్యమైతే"

ఒక మాటకి మరోదానికి పొంతనలేనట్టు మాట్లాడుతున్నాడు.

క్షణంలో సగంసేపు ఆలోచించింది అమృత.

ఆమెకాక్షణంలో అతనిమీద ఎందుకో జాలి కలిగింది.

అతడు మోసగాడే కావచ్చు.

కాని ఇపుడు నిజంగానే ఆదుర్దాలో ఉన్నాడు.

అతని చేతులు వణుకుతున్నాయి టెన్షన్‌లో.

"నేనూ మీతో రావచ్చా?"

అడిగింది అమృత.

"ఇంత రాత్రి? మీరు..." అనబోయి విరమించుకున్నాడు మృత్యుంజయ.

అమృతకు లేనిపోని అనుమానాలు కలగడం మంచిది కాదు.

"కమాన్ క్విక్! ఈ రాత్రికి మీరు రెస్ట్ తీసుకుంటే రేపట్నుంచే మీకు పని అప్పచెబ్దామనుకున్నాను. నరే ఇదీ ఒకందుకు మంచిదే-హర్రీయప్"

వేగంగా పరిగెడుతున్నట్టే నడుస్తున్నాడతను.

అమృతకు ఆ నాలుగడుగులకే ఆయాసం వచ్చింది.

కారు డోర్ తీసి కూర్చుంది అమృత.

క్షణంలో ఆఘమేఘాలమీద పరిగెత్తింది కారు.

పావుగంట తర్వాత ఓ నర్సింగ్ హోం ముందాగింది.

రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది.

నర్సింగ్ హోం గేటు ముందు ఎదురుచూస్తున్న ఓ వ్యక్తి కారుని చూడగానే ముందుకొచ్చాడు.

"బాస్"

మృత్యుంజయతోపాటు కార్లోంచి దిగుతున్న అమృతను చూసి ఒక్కక్షణం ఆశ్చర్యపోయాడతను.

"విశ్వం! పేషంటు దగ్గర ఎవరున్నారు"

"ఎవరో దూరపు బంధువు కావచ్చు సర్. ఆమె నిద్రపోతందిట. ఈ నర్సింగ్ హోంలోనే నాకు తెలిసిన నర్సు ఒకామె ఉంది. తనకు నిద్రపట్టడంలేదని నిద్రమాత్రలు తెప్పించమని నర్సుకి డబ్బులిచ్చారట ప్రమీలగారు"

"ఆమె తెప్పిచ్చిందా?"

"ప్రమీలగారి ప్రతివిషయం నాకు చెప్పమని ఆమెని కోరానుకదా! అందుకని ఆమె వెంటనే నాకు చెప్పింది.

నేను బికాంప్లెక్స్ మాత్రలిచ్చి అవే ఇమ్మని చెప్పాను. వాటినే నిద్రమాత్రలనుకుని తీసుకుందట. నర్సు గమనిస్తోందని తెలియక నర్సు వెళ్ళగానే తలుపులు దగ్గరకు వేసుకుని ఉయ్యాల్లో పసిబిడ్డని ముద్దులు పెట్టుకుని కొంతసేపు అలాగే ఒళ్లో ఉంచుకుందట. తర్వాత ఆ మాత్రలు మొత్తం వేసుకుని ఏడుస్తూ పడుకుందట"

'మరి ఆ దూరపు బంధువు..."

"ఆమెకేం పట్టింది సర్. మొక్కుబడికి వచ్చింది. బయటెక్కడో బెంచ్‌మీద నిద్రపోతోందిట"

"ప్రమీలగారి భర్తని పరిచయం చేసుకున్నానన్నావు అతనేమంటాడు?"

"ప్రకాష్ చాలా పట్టుదలగా ఉన్నాడు. ఇప్పటికే ముగ్గురాడపిల్లలు, మళ్లీ ఆడపిల్లపుడితే వాళ్ళమ్మగారు చాలా గొడవ చెయ్యొచ్చు అంటాడు. అతను తల్లిచాటు మనిషిలా వున్నాడు. ఇంట్లో ఆడపిల్లలు కూడా దిక్కుమాలిన వాళ్లలా ఉన్నారు సర్- ఆ ముసలామెకి దయాదాక్షిణ్యాలున్నట్టులేదు"

అతని గొంతులో ఆవేశం ధ్వనిస్తోంది.

"నరే ప్రకాష్‌గారి అడ్రస్ చెప్పు- ఇప్పుడెలాగూ అయిదయిపోయింది. మరో గంటలో తెల్లారిపోతుంది. ప్రమీలగారు వేసుకున్నవి బలం మాత్రలు కనుక ఏం ప్రమాదం లేదు. నిద్రమాత్రలనే భ్రమతో వేసుకున్నది కనుక గాఢ నిద్రపట్టివుంటుంది. ప్రకాష్ విషయం నేను చూసుకుంటాను. అవసరమైతే నాకు ఫోన్ చెయ్యి"

విశ్వం వీధిలైటు వెలుతురులో అడ్రను రాసి ఇచ్చాడు. అది జేబులో పెట్టుకుని మృత్యుంజయ కారెక్కాడు.

అమృతకిదంతా ఆశ్చర్యంగా వుంది- అడిగేసింది.

"ఏమిటిదంతా... ఆమె మీ బంధువన్నారు. మరి చూసేందుకు లోపలికే వెళ్ళలేదు. ఆమె భర్త అడ్రను మీకు తెలియకపోవడమేమిటి?"

"బంధువే అమృతా... మీలాంటి బంధువు"




"అంటే?"

"ఆమె ఆత్మహత్యా చేసుకునే అవకాశాలు చాలా ఉన్నాయని మా సర్వేవల్ల తెలిసింది. ప్రమీల ప్రకాష్‌లది ప్రేమ వివాహం. కాని వరుసగా ఆడపిల్లలే పుడుతుండటంతో అతను ఆ ప్రేమను చంపేసుకున్నాడు. దానికితోడు అతని తల్లికి మొదట్నుంచీ వీడి పెళ్ళి ఇష్టంలేదు. ఇపుడే ఆడ పిల్లల సాకుతో కొడుకు మనసు విరిచేసింది. ఈసారికూడా ఆడపిల్ల పుడితే కొడుక్కి మరో పెళ్ళి చేస్తానని బెదిరిస్తోంది గత ఆర్నెల్లుగా- ప్రమీల బాగా డీలా పడిపోయింది. ఆమె ఆరోగ్యమూ దిగజారిపోయింది. అందుకే ఈ డెలివరీలో చావును కోరుకునేదిట. ప్రసవం దగ్గరయేకొద్దీ పిచ్చిదానిలా ఆలోచిస్తూండేదిట"

"ఆమె పుట్టింటివారేమయ్యారు" అమృతలో ఆవేశం.

మృత్యుంజయ గాఢంగా నిట్టూర్చాడు.

"మనదేశంలో దురదృష్టమదే అమృతా! ఒకసారి పెళ్లయ్యాక ఆడపిల్ల వరాయిదయిపోతుంది. ఆమె కష్టసుఖాలతో వాళ్లకు సంబంధం లేదనుకుంటారు. అత్తింటి జీవితం బాగుందా సరే. లేకపోతే ఆడపిల్ల అడకత్తెరలో పోకచెక్కలా నలిగిపోతుంది. ఆమె కష్టాల్లో పాలుపంచుకుని ఓదార్చే స్నేహహస్తంకోసం ఆక్రోశిస్తుంది. ప్రమీల అలాంటి దురదృష్టవంతురాలు. కనీసం మగపిల్లవాడు పుడితే ఆమెలో ఆశాదీపం వెలిగేది. కాని ఇపుడామెకు అన్నిదారులూ మూసుకుపోయి ఆత్మహత్యే శరణ్యమనుకుంది"

"ఇంత తెలిసినవారు ఆమె భర్తను హెచ్చరించవచ్చుగా" అనబోయి ఆగిపోయింది అమృత.

భారతదేశంలోని నగటు మగవాడెవడూ తన బలహీనతను వేరేవాళ్ళు ఎత్తి చూపితే సహించలేడు. తన భార్య ఆత్మహత్యా చేసుకోబోతోందని మీకెలా తెలును అంటాడు. న్యూసెన్స్ చేస్తాడు. భార్యను మరింత హింసించి నరకం చూపిస్తాడు.

"అయితే మీరిప్పుడేం చెయ్యబోతున్నారు"

మీరే ఒక రచయిత్రి అయితే మీరేం సొల్యూషన్ చెప్తారు. ఈ కథనెలా ముగిస్తారు?"

అమృత కళ్లముందొక పెద్ద మెరుపు మెరిసినట్టయింది.

తను రచయిత్రి అని, ఇతనికెలా తెలును.

"మీ గురించి ప్రతి చిన్న వివరం నాకు తెలును అమృతా! కోపగించుకోకండి. రచయిత్రిగా టీనేజ్‌లవ్ బర్డ్స్‌ని సృష్టించి యువతరాన్ని ఊహాలోకాల్లో విహరింపచెయ్యగల మీరు ఈ సమస్యకు ఏం పరిష్కారం చెప్తారు"

మృత్యుంజయ చూపు సూటిగా వుంది.

కారు బీచ్ దగ్గిరాగింది.

ప్రభాతపుష్పం తొలిరేకులు విప్పుకుంటోంది.

సూర్యోదయానికి సూచనగా తూర్పున అరుణరేఖలు. సముద్రంలోంచి ఆ ఎరుపు విరజిమ్మబడుతోందా అన్నట్టుంది.

రాత్రంతా శ్రమ పడుతున్నా అలుపెరుగనట్టే ఉన్నాయి కెరటాలు.

చల్లగాలికి ఎగురుతున్న ముంగురులు అమృత ముఖాన్ని కప్పేస్తూ దోబూచులాడుతున్నట్టున్నాయి.

ఆమె తీవ్రమైన ఆలోచనలో పడ్డట్టు భృకుటి ముడివడి వుంది.

మృత్యుంజయ ఇసుకలో కూర్చున్నాడు.

ఆమెను డిస్టర్బ్ చెయ్యాలనిపించలేదతనికి.

హఠాత్తుగా అంది అమృత.

"మృత్యుంజయగారూ! వాళ్ళ సమస్య ఆ పుట్టిన బిడ్డేగా. ఆ పిల్లను ఎవరైనా పెంచుకుంటే..."

మృత్యుంజయ ముఖంలో చిన్న మెరుపు.

"మీరు సరిగా చెప్పలేకపోయినా మీ భావం అర్థమయింది. మరి ప్రమీలగారు మళ్ళీ అఘాయిత్యం తలపెట్టకుండా ఉండాలంటే- ???"

"డాక్టర్‌చేత ప్రకాష్‌కి- అతని తల్లికి చివాట్లు పెట్టించాలి.

తీవ్రంగా ఉంది అమృత గొంతు

"యూమీన్ బ్రెయిన్ వాష్?"



''యస్! ప్రమీల గురించి ఇంక దిగులులేదు మీకు. ఆ బలహీనక్షణం మీ సమయస్ఫూర్తివల్ల దాటిపోయింది. మిగిలిన పిల్లల భవిష్యత్తు గురించిన భయం కలిగిస్తే చాలు''

బలహీన క్షణం అంటున్నపుడు ఆమె గొంతు వణకడం గమనించాడతడు.

మృత్యుంజయకు తృప్తిగా వుందిప్పుడు.

''అయితే పదండి ముందు ప్రకాష్ దగ్గరకు''

'లేడికి లేచిందే పరుగు'

ఇద్దరూ నవ్వుకున్నారు.

★ ★ ★

అమృత- మృత్యుంజయ బీచ్ ఒడ్డున అలా చర్చించుకుంటున్న ఆ సమయంలోనే.

నర్సింగ్‌హోంలో అపరిమితమైన హడావుడి.

డాక్టర్ చిత్ర నర్సు ఫోన్ అందుకుని ఉరుకులు పరుగులుమీద వచ్చింది.

''ఎనిమిదో నెంబర్ బెడ్ మీద పేషంటుకి ఇంజక్షన్ ఇద్దామని లేపితే ఎంతకీ లేవడంలేదు. దిండు పక్కన ఏదో లెటర్ ఉంది మేడమ్''

నైట్ నర్సు వెళ్ళిపోగానే ఈ నర్సు వచ్చింది.

చార్ట్‌లో రాసిన ప్రకారం ఇంజక్షన్ చేసేందుకు వెళ్ళి ప్రమీలను చూసి భయపడి డాక్టర్‌కి ఫోన్ చేసింది.

ప్రమీలకు సాయంగా పడుకున్న బంధువు ఏడవడం మొదలెట్టింది. డాక్టర్ ఒక్క కసురు కసిరి ప్రకాష్‌కు కబురుచెప్పి తీసుకురమ్మని పంపించేసింది.

అపుడే మృత్యుంజయ, అమృత, ప్రకాష్ నర్సింగ్ హోంలో అడుగుపెట్టేసరికి ఆమె ఎదురై ఏడుస్తూ జరిగిన అఘాయిత్యం చెప్పింది.

అమృత, మృత్యుంజయ నిర్ఘాంతపోయారు.

జరిగిందేమిటో వాళ్లకర్థం కాలేదు.

గంటక్రితం.




వాళ్ళు ప్రకాష్ ఇంటికెళ్ళేసరికి అతను లేచి కాఫీ తాగుతున్నాడు.

మృత్యుంజయ అమృతలను చూసి అడిగాడు-

''ఎవరికోసం-?''

''ప్రకాష్ అంటే మీరేనా?''

''అవును''

''మీతో మాట్లాడాలి''

''లోపలికి రండి. మిమ్మల్ని నేనెప్పుడూ చూడలేదు''

అనుమానంగా అన్నాడు ప్రకాష్.

''నిజమే, మనకి పరిచయంలేదు. మీవల్ల ఒక ఉపకారం కోరి వచ్చాం''

''ఏమిటది, నేనేం చెయ్యగలను?''

''మా అంకుల్‌కి పిల్లల్లేరు. ఆయనకి ఆడపిల్లలంటే మక్కువ ఎక్కువ. మీరన్యథా భావించకుంటే, మీకు పాప పుట్టిందని, ఇప్పటికే మీకు ముగ్గురమ్మాయిలున్నారని విన్నాం. మాకీ పుట్టిన పాపను పెంపకం ఇస్తే మీ రుణం ఉంచుకోం''

''పిల్లను అమ్ముకోవడమా, నో'' ప్రకాష్‌కెలాగో వుంది.

అప్పటికే అతని తల్లి అక్కడికి వచ్చేసింది.

''అలాగే బాబూ! ఎవరిదగ్గర పెరిగితేనేం. పిల్ల బంగారు బొమ్మ''

నువ్వేనా ఆ రాక్షసివి. ప్రమీల అత్తవి. కసిగా అనుకుంది అమృత.

ప్రకాష్ అడిగేందుకు మొహమాటపడుతున్న విషయాన్ని సూటిగా చెప్పేశాడు మృత్యుంజయ.

''అంకుల్! ఇరవై వేలదాకా ఇస్తారు, మీకిష్టమైతే లెటర్ రాసి పిలిపిస్తాను. ఆయన కలకత్తాలో ఉంటారు. ముందు మేం పాపని చూసి...''

''ఒరే ప్రకాష్! హాస్పటల్‌కి తీసుకెళ్ళి వాళ్ళకి పిల్లను చూపించు, లే'' అతని తల్లి అంది.

లక్ష్మీదేవి పుట్టిందన్నమాట. గొణుక్కుందావిడ సంతోషంగా.

''నీపెళ్లాం గోల చెయ్యకుండా బ్రహ్మాస్త్రం ఉందిగా, నచ్చజెప్పు. ఆవిడ రహస్యంగా చెబుతున్నమాటలు పైకే వినిపిస్తున్నాయి''

పెద్దపిల్ల కాబోలు పదేళ్లున్నాయి. తండ్రి దగ్గరకొచ్చింది.

"నాన్నా వీళ్ళు మన బంధువులా?"

ఆ పిల్లను చూచి ముచ్చటేసింది అమృతకి.

"అవును బంధువులమే, పాపా నీ పేరేంటి?"

"తన్మయి"

ఎంత చక్కని పేరు. పిల్లకూడా చందమామలా ఉంది.

"మీ చెల్లెళ్లేరి పాపా?"

"పెద్ద చెల్లికి జ్వరం- అమ్మమీద బెంగ, చిన్న చెల్లి నిద్రలేవలేదు. అదిగో అక్కడే పడుకున్నారు"

వాళ్ళని చూసి కడుపు తరుక్కుపోయింది అమృతకి, మృత్యుంజయకి.

బట్టలు మార్చుకుని వచ్చాడు ప్రకాష్.

"పదండి"

"వస్తాం పాపా"

"మళ్ళీ వస్తారు కదూ" అమాయికంగా అడిగిందాపిల్ల.

"తప్పకుండా" ఆ పిల్ల బుగ్గ చిదిమింది అమృత.

"మీకెవరు చెప్పారు మా వివరాలు?" కరులో కూర్చున్నాక అడిగాడు ప్రకాష్.

"మావయ్యా, అత్తయ్యా పిల్లలకోసం పడే తపన చూడలేక మేం ఇదేపనిమీద తిరుగుతుంటాం. ఎదిగిన పిల్లలయితే అలవాటపడం కష్టం కనుక, హాస్పటల్స్‌లోనూ, నర్సింగ్ హోంలలో అపుడే పుట్టిన బిడ్డను ఇచ్చేవారెవరైనా ఉంటారేమోనని వాకబు చేస్తూంటాం. ఒక ఆయా మీ వివరాలు చెప్పింది. మీ పాప గురించి మీరేం వర్రీ కానవసరం లేదు"

"ఇపుడు సమస్య అదికాదు. నా భార్య..."

నసిగాడు ప్రకాష్-

"ఆమెను మేం ప్రాధేయపడ్తాం ప్రకాష్‌గారూ! కన్నతల్లికి బిడ్డలు భారం కాదనుకోండి" వేరగా చూసింది అమృత.

తడబడ్డాడు ప్రకాష్.

"నిజమే... మాకు పిల్లలు బరువుకాదు" బింకంగా అన్నాడు ప్రకాష్.

"కాని మా వేడికోలు మన్నించి..."

"చూద్దాం, ముందు పాపను చూడండి"

ప్రకాష్‌కి తంతే బూరెల గంపలో పడ్డట్టుంది. ఒకవైపు తల్లిపోరు పడలేకపోతున్నాడు, మరోపక్క ప్రమీల వరసగా ఆడపిల్లల్ని కంటూంటే ఒళ్ళు మండిపోతోంది.

ఈ ప్రమీలనేనా తను ప్రేమించి పెళ్లాడింది అనిపిస్తోంది.

తీరా నర్సింగ్‌హోంలోకి అడుగుపెట్టేసరికి అందిన కబురుకి అవాక్కయిపోయాడు ప్రకాష్.

అలసటగా, నేప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ వచ్చింది డాక్టర్ చిత్ర.

ప్రమీల రాసిన లెటర్ ప్రకాష్ మొహాన విసిరికొట్టింది.

నాలుగేళ్ళుగా ఆమెనెరుగనుగాని ఇంత కోపంగా ఎపుడూ చూడలేదు ప్రకాష్. ఎంతో సౌమ్యంగా ఉండే ఆమె ముఖం కోపంతో ఎర్రబడివుంది.

"మైగాడ్!" నిద్రమాత్రలతోబాటు పొరబాటున బి కాంప్లెక్స్ కూడా మింగింది కాబట్టి బ్రతికింది"

అప్పటిదాకా నల్లబడినట్టున్న మృత్యుంజయ ముఖంలో కాస్త వెలుగు.

ప్రకాష్ లెటర్ చదువుతున్నాడు.

కాసేపు మాట్లాడలేదు.

తర్వాత తల టేబిల్‌మీద పెట్టి బావురుమన్నాడు. అతన్ని ఎవరూ ఓదార్చలేదు.

"అసలు మీరు మనుషులేనా? ఆడపిల్లలు పుట్టేందుకు కారణం మీరేనన్న సంగతి మీకసలు తెలుసా? ఇంత చదువుకున్నవాళ్లు మీరూ ఇలా ప్రవర్తిస్తే దేశం ఏం బాగుపడుతుంది. మీకొకవేళ తెలియకపోతే విడమర్చి చెబుతున్నాను వినండి. ఆడవాళ్ళ జీన్స్‌లో XX క్రోమోజోములే ఉంటాయి.

మగవాడిలో XY ఉంటాయి. XX తో కలిస్తే ఆడపిల్ల, XYతో కలిస్తే మగపిల్లవాడు పుడతారు. అయినా మీకు క్రితం సారే చెప్పాను.

ఆవిడ ఆరోగ్యం బాగులేదు, ఆపరేషన్ చేయించుకోమని. ఆడపిల్ల అయితే మనిషి కాదా మగపిల్లవాడే వంశోద్ధారకుడా? వాడే ఉద్ధరిస్తాడా? ఈ సైన్సు కాలంలో కూడా ఏమిటీ మూఢ నమ్మకాలు. ఛ... ఛ... ప్రమీల చనిపోయివుంటే ఈ నర్సింగ్ హెూంకెంత బేడ్‌నేమ్ చుట్టుకునేది. ఓ గాడ్! నేను పోలీస్ రిపోర్టు..."

ఆయాసంగా ఆగింది డాక్టర్.

ప్రకాష్ కళ్ళు మంకెన పువ్వుల్లా ఉన్నాయి.

"ప్లీజ్ డాక్టర్. నన్ను క్షమించండి. ప్రమీల..."

"చచ్చి బతికింది. పోయి చూడండి. కానీ ఆమెను డిస్టర్బ్ మాత్రం చెయ్యకండి"

అంతులేని నిర్వేదంతో, పీక్కుపోయిన ముఖంతో, మృత్యువుతో పోరాడి ,అలసిపోయిన ప్రమీలను చూసి ప్రకాష్ కదిలిపోయాడు.

"ఎంతపని చేశావు ప్రమీలా

ఈ పిల్లలతో నాకు దిక్కెవరుండేవారు?

నన్ను ఎవరు సేదదీరుస్తారనుకున్నావు?

నీకు జీవితంమీదే విరక్తి కలిగించిన మహాపాపిని.

నన్ను క్షమించు ప్రమీలా.

తెల్లగా పాలిపోయిన ఆమె చేతిలో మొహం దాచుకున్నాడు.

మౌనంగా ఉన్న ప్రమీల ముఖంలో చిన్న వెలుగు.

ఏదో గుర్తొచ్చినట్టు వెనుదిరిగాడు.

మృత్యుంజయకేసి చూసి రెండు చేతులూ జోడించాడు ప్రకాష్.

"నన్ను క్షమించండి సర్! ఈ పాప నా ఆశాదీపం. నా కళ్ళు తెరిపించిన ఆణిముత్యం"

మృత్యుంజయ అతని భుజాన్ని ఓదార్పుగా తట్టి వెనుదిరిగాడు.

అమృత అతన్ని అనుసరించింది.

"కాగల కార్యం గంధర్వులు తీర్చడం అంటే ఇదే కాబోలు" అమృత మాటలు అతని చెవిని సోకాయోలేదో...

"మరో ముప్పై అయిదేళ్ళ ఆయుష్షు కొన్నాను"

నిర్ఘాంతపోయింది అమృత.

★ ★ ★

వారంరోజులు గడిచిపోయాయి.

నెమ్మదిగా అతడు చేస్తున్న పనేమిటో అర్థం చేసుకోగలిగింది అమృత. మృత్యుంజయకి చాలా నెట్‌వర్క్ ఉంది. కాని ఇదంతా అతను చెయ్యాల్సిన అవసరం ఏమిటి? ఇంత మందికి ఉద్యోగాలిచ్చి పోషించేందుకు అతనికి డబ్బెలా వస్తోంది? అసలు అతను చేస్తున్న బిజినెస్ ఏమిటి? అనేది మాత్రం అర్థంకావటంలేదు అమృతకు.

ప్రమీల కేసు ముగిసిన మర్నాడే మృత్యుంజయకు ఫోన్ వచ్చింది.

అపుడు అమృత అక్కడే వుంది.

అతని ముఖం వివర్ణం కావడం చూసి అడిగిందామె.

"మళ్ళీ ఎవరికైనా..."

"కాదు... అవును. నేను వెంటనే వెళ్లాలి"

"నేను..."

"వద్దు అమృతా! నేను వచ్చాక మీకంతా వివరిస్తాను. మీకో పెద్ద అసైన్‌మెంట్ ఇవ్వబోతున్నాను. ఈలోగా ఆశ్రమంలోనే ఉండండి. ఈ ఆఫీసు గదిలోని ఫైల్స్ చదవండి. మీకంతా బోధపడుతుంది. మీరు చెయ్యవలసినది మాత్రం నేను వచ్చాక చెప్తాను"

మళ్ళీ మృత్యుంజయే అన్నాడు-

"ఇక్కడ మీకేం భయంలేదు. విశ్వం, ప్రద్యుమ్న, ప్రవీణ, సుషమ అంతా చూసుకుంటారు. అవసరం అయితే హెల్ప్ చేయండి. కుదరకపోయినా ఫరవాలేదు. ఆశ్రమాన్ని చూసుకోండి చాలు. అంతా స్నేహపాత్రులే. అన్నట్టు సుబ్రహ్మణ్యం మాస్టార్ వస్తే... ఆదివారం వస్తారు... మరో నలుగురి పిల్లల్ని ట్యూషన్‌కి అప్పజెప్తున్నట్టు చెప్పండి. కుర్రాళ్లని విశ్వం అప్పచెప్తాడు.

"సరే"

మృత్యుంజయ బ్రీఫ్‌కేస్‌లో ఒక జత బట్టలు పెట్టుకుని ఏవో కాగితాలు సర్దుకుని భోజనమైనా చెయ్యకుండా వెళ్లిపోయాడు.




# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1 సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**డిసెంబర్ చతుర నవల అమృతహస్తం**

సమీక్షకుని పేరు : ..............................................

చిరునామా : ..............................................

..............................................

..............................................

..............................................

ఒక్కసారి ఆశ్రమమంతా బావురుమని పోయినట్టనిపించింది అమృతకు.

ఒక వెయ్యిమంది వెళ్లిపోయి ఖాళీ అయిపోయినట్టుంది.

అమృతకు చిత్రంగా అనిపించింది.

ఇరవై గంటలక్రితం అతన్నొక దుర్మార్గుడుగా, ద్రోహిగా అనుకుని ఆ సంకెళ్ళనుంచి బలవంతాన తెంచుకుని పారిపోవాలనుకుంది.

కాని ఇపుడు.

ఇష్టంగా, తనకుతానే సంకెళ్లు తగిలించుకుంది.

మృత్యుంజయ కనుమరుగయ్యేసరికి విలవిల్లాడుతోంది.

ఆశ్రమ వాసుల్లోగాని, అతని అనుచరుల్లోగాని మృత్యుంజయ లేనప్పుడు కూడా క్రమశిక్షణ విషయంలో రవంత మార్పు కూడా లేకపోవటం గమనించి ఆశ్చర్యపోయింది అమృత.



విశ్వం ఆరోజు కంగారుగా ఉన్నాడు.

ప్రద్యుమ్న ప్రవీణ పైకి అంతగా కనిపించడం లేదుగానీ వారూ అలాగే వున్నారు.

''ఏంటి సంగతి?''

అమృత యధాలాపంగా అడిగింది.

''ఈరోజు ఎమ్‌సెట్ రిజల్ట్స్ వచ్చాయి''

''అయితే?''

వాళ్లేం మాట్లాడలేదు కాసేపు.

''సుషమ రాలేదా ప్రవీణా?'' విశ్వం అడిగాడు.

''తను ఉదయంనుండే అసైన్‌మెంట్‌లోకి దిగిపోయింది''

''బాలరాజు, రామం, బాబ్జీ, సుధాకర్ ప్రాణ మిత్రులు. బాగా సెన్సిటివ్‌కూడా అని చెప్పింది. ఈరోజంతా వాళ్లను వదలదు'' ప్రద్యుమ్న అన్నాడు.

''వాళ్ళు చాలా తెలివైనవాళ్ళు కదా తప్పకుండా రాంక్ వచ్చివుంటుంది. మరేం ఫరవాలేదు''

విశ్వం మాట పూర్తికాకుండానే ఫోన్ మ్రోగింది.

అమృత తీసింది.

''విశ్వంగారూ... సుషమ''

ఒక్క ఉదుటున ఫోన్ దగ్గరకొచ్చాడు.

''విశ్వం- కారు తీసుకుని రమ్మని ప్రవీణను, వెంటనే పంపించు. చాలా అర్జంటు. నాకేసులు ఎక్కడికో బయలుదేరారు. నేను ఆల్బర్ట్ స్కూలు దగ్గరున్నాను''

అటునుంచి సుషమ మాటలు పూర్తికాగానే అలర్ట్ అయ్యాడు విశ్వం.

''ప్రవీణా''

''ఇదిగో వెళ్తున్నాను''

ప్రద్యుమ్న కూడా ''నేను ఆంజనేయ కోవెల వైపు వెళ్ళాలి, పనుంది'' అంటూ వెళ్ళిపోయాడు.

విశ్వం 'అమృతా మీరిక్కడే ఉంటారు కదూ! నేనూ వెళ్తున్నాను'' అన్నాడు.

వాళ్ళను చూస్తుంటే అలుపెరగని సైనికులు గుర్తొస్తున్నారు అమృతకు.

ఆ సాయంత్రం సుషమ మార్కండేయస్వామి మంటపం పక్కనున్న చెట్టు చుట్టూవున్న గట్టుమీద కూర్చుని చుట్టూఉన్న పిల్లలకి చెప్తోంది.

ఆ దృశ్యం అమృతకు అపురూపంగా ఉంది.

ఒక కుర్రాడు ఆమెను ఆనుకుని కూర్చున్నాడు.

మరొకడు కాళ్ళ దగ్గర ఉన్నాడు.

ఇంకోబాబు లేతబుగ్గలతో ముద్దొస్తున్నాడు

ఆడపిల్లలా.

అంతా పదిహేను పదహారేళ్లవాళ్లే.

సుషమ కళ్లు వాత్సల్యాన్ని కురిపిస్తు న్నాయి.

అమృత కాస్త ముందుకెళ్లింది వాళ్లకు కని పించకుండా.

"అక్కా! అయితే మేం తప్పు చేశా మంటావా?"

"మా నాన్నగారు నిజంగా కోప్పడ రంటావా?"

"నాకు మాత్రం ఇంటికెళ్ళాలంటే భయంగా ఉందక్కా!"

మరోబాబు ఏడ్చేశాడు.

"ఇంకెప్పుడూ ఇలా చెప్పకుండా రానక్కా! నన్ను మా ఇంటికి దిగబెట్టెయ్యి. మా అమ్మ బెంగపెట్టుకుని వుంటుంది"

వెక్కుతున్నాడు ఆ కుర్రాడు.

"జీవితానికి చదువు ముఖ్యమేగాని చదువే జీవితం కాకూడదని నేను మీకు చెప్తూనే ఉన్నా కూడ మీరిలా చచ్చిపోవాలని నిర్ణయించుకుని నలుగురూ కలిసి పారిపోయి ఇటువంటి ప్రయత్నం చేశారంటే మృత్యుంజయ అంకుల్ ఎంత బాధపడతారో ఆలోచించారా? ఇది తెలిసి ఆయనకి కూడా జీవితంమీద విరక్తి కలిగి మీలాగే చేస్తే??"

"వద్దక్కా అంకుల్‌ని మేం క్షమాపణ కోరతాం. మరెప్పుడూ ఇలా చెయ్యం. ఇప్పుడు మా మొహం అంకుల్‌కి చూపించలేం. ఆయన చెప్పినమాట వినలేదని మామీద కోపం వచ్చి వుంటుంది. అందుకే మాక్కనిపించడంలేదు" పొడుగ్గా ఉన్న కుర్రాడన్నాడు.

సుషమ నవ్వింది.

"లేదులే బాలూ! అంకుల్ ఊరెళ్లారు. పదండి ఇప్పటికే మీ వాళ్లంతా బెంబేలెత్తిపోతుంటారు. అది చూస్తే మీరెంత పొరబాటు చేయబోయారో మీకే తెలుస్తుంది"

సుధాకర్ అన్న కుర్రాడు ధైర్యంగా అన్నాడు.

"పదక్కా నాకిప్పుడు భయం వెయ్యడంలేదు. మా నాన్నకి నేనే నచ్చచెప్పగలను"

"రైట్ అలాగుండాలి"

వాళ్ళంతా గేటువైపు వెళ్ళిపోయారు.

అమృతకేదో లోకంలో తేలిపోతున్నట్టుంది.

ఇది చిన్నారిలోకం.

తల్లిదండ్రులు చదువే వాళ్ళ ప్రాణంగా పెంచుతున్నారు. అహోరాత్రాలు ట్యూషన్‌లు, కోచింగ్ సెంటర్‌లు.

ఈ పోటీల్లో నెగ్గేందుకు వాళ్ళ ప్రాణాలొడ్డేస్తున్నారు. కాని చిట్టిప్రాణాలు తట్టుకోలేకపోతున్నాయి.

ఎంత కష్టపడినా కాస్తలో ఛాన్స్ మిస్సయి ఎటూ మొగ్గలేక విలవిల్లాడిపోతున్నారు.

బలహీనమనస్కులు ఇంట్లోంచి పారిపోవడం.

మరీ బలహీనులు చచ్చిపోవడం.

చివరికీ పోటీపరీక్షల పర్యవసానం చిన్నారుల చావులా?

పోటీ ఉండాలి నిజమే.

కానీ ఎమ్‌సెట్‌లో నెగ్గకపోతే ఇంజనీరింగ్, డాక్టరే చదవకపోతే జీవితమే లేదనుకుంటే ఎలా?

తల్లిదండ్రులదే ఈ లోపం.

బిడ్డలమీద అలవికాని ఆశలు పెట్టుకుని నా కొడుకు డాక్టర్, ఇంజినీర్ అని చెప్పుకోడం కోసం పిల్లల ప్రాణాలను జూదంలో ఒడ్డితే ఫలితం ఇలాగే వుంటుంది.

మృత్యుంజయది ఎంత ముందుచూపు?

పరీక్షల ఫలితాలు వెలువడ్డ మర్నాడే పేపర్లలో పిల్లల ఆత్మహత్యల వార్తలు ఈమధ్యకాలంలో మరీ ఎక్కువయిపోయాయి.

మృత్యుంజయ అందుకే ముందునుండే పకడ్బందీ చేశాడన్నమాట తన అనుచరుల్ని.

అమృతకు ఇంతవరకూ తను గడిపిన జీవితమంతా వ్యర్థంగా అనిపించింది.

ఏమిటి తను సాధించింది?

టీనేజ్‌లో పిల్లల అనుభూతుల్ని రెచ్చగొట్టే కథలు.

వాళ్ళని ఊహల ఉయ్యాలల్లో విహరింపచే




సింది.

వాళ్ళని వాస్తవప్రపంచంనుంచి అద్భుత ప్రపంచంలోకి తీసుకెళ్లింది.

కాని వాళ్ల భవిష్యత్తుకు అదెంతవరకూ ఉపకరిస్తుంది అనే ఆలోచన తనకెందుకు రాలేదు. వాళ్ల జీవితాలతో ఆడుకునే హక్కు తనకెవరిచ్చారు?

మరి తన అభిమానులు. తనని ఆకాశానికె త్తేశారు తప్ప ఎందుకు తన ధ్యేయం స్ఫురింప చెయ్యలేదు?

వందలాది ఉత్తరాలు. అన్నీ తన రచనల ను పొగిడేవే చివరకు తనను ఆరాధించి ఆరాధనతో ప్రేమలోకి దింపిన రాహుల్ కూడా.

రాహుల్ గుర్తొచ్చేసరికి అమృత మనసు చేదుమాత్ర తిన్నట్టయిపోయింది.

ఎంత ద్రోహం చేశాడు?

తన ఆఫీసులో పనిచేస్తే తనకెంతో గౌరవం అని పర్సనల్ సెక్రటరీగా వేసుకున్నాడు తనని.

పార్కులు.
బీచ్‌లు.
క్లబ్బులు.
సినిమాలు.

పాఠకులతోబాటు తనూ ఊహలలోకాల్లో తేలిపోయిందన్నమాట.

ప్రేమలోకంలో విహరించింది.

కాని అంతెత్తునుంచి కింద అగాధంలోకి కూరుకుపోతుందనుకోలేదు తను.

తనలాగే తన రచనలు చదివిన పసిప్రా యపు లేతమొగ్గలు ఎంత విలవిల్లాడి వుంటాయి.

అది ఆకర్షణ తప్ప ప్రేమకాదు అని వాళ్లకె వరు తెలియచెప్తారు.

సక్రమమార్గాన నడిపించవలసిన తనే వాళ్ళను అగాధంలోకి తోసేస్తోందని వాళ్లకెలా తోస్తుంది. తన కథలు చదివి ఎన్ని జంటలు ప్రేమ అనే ఆకర్షణలోపడి ఆకర్షణ తీరాక శలభాల్లా తనలాగే మసి అయిపోతూ అందు లోనూ ఆడపిల్లలు.

అమృతకు ఒళ్లు జలదరించింది.

రాహుల్ విదేశయానం.

అతని తండ్రి ఆఫీను ఛార్జి తీసుకోవడం.

తనని తొలగించడం.

అంతా ముందే అనుకుని ఆడిన నాటకమే నన్నమాట.

ఇంతలో పులిమీద పుట్రలా తన రచనలను విమర్శిస్తూ ఉత్తరాల పరంపర!

ఎవరో అజ్ఞాతవ్యక్తి రాసేవాడు.

అప్పట్లో అతన్ని ఎన్ని శాపనార్థాలు పె ట్టింది.

కాని అతను లేక ఆమె వ్రాసినదంతా పచ్చినిజం అని ఇప్పుడనిపిస్తోంది.

అభం శుభం తెలియని పసివాళ్ళను ప్రేమ పేరిట మోసంచేసే రచనలు చెయ్యవ ద్దని వేడికోలు.

రచనల మాయాజాలంలో చిక్కుకుని ఎందరి జీవితాలు బుగ్గిపాలవుతున్నాయో అని హెచ్చరికలు.

సమాజాన్ని తప్పుదోవ తొక్కించవద్దని మనవి. ఊహలనుంచి వాస్తవంలోకి దిగి సమా జశ్రేయస్సు నిర్మించమని ఆజ్ఞ.

చివరి ఉత్తరం.

రాహుల్ ద్వారా తను భగ్నపడినరోజున వచ్చింది. రచయిత్రిగారికి తుదినమస్కారం.

నేనూ, నా ఉత్తరాలూ మీకు పిచ్చిగా కని పించిఉంటాయి.

అందుకే మీలో మార్పురాలేదు.

మీ ధోరణీ మారలేదు.

ఫలితం అనుభవిస్తున్నది ముక్కుపచ్చలా రని వాళ్లు. మీ కథలోలాగే ఇంటినించి పారి పోయి లాడ్జింగ్‌లో పట్టుబడిన వాళ్ళ వయస్సు పధ్నాలుగేళ్లే తెలుసా? మోసపోయి జీవితాన్ని అంతంచేసుకున్న వాళ్ళ వయసెంతో తెలుసా? పదహారు.

వ్యభిచారగృహాల వలలో చిక్కిన వాళ్లెంత మందో మీరు ఊహించలేరు.

మీకిదే నా లాస్ట్ లెటర్.

నేను మిమ్మల్నేమీ చెయ్యలేకపోవచ్చు.

కాని భగవంతుడనేవాడుంటే...

తప్పకుండా ఉండేఉంటాడు.

మీ జీవితాన్ని అదేబాటలో నడిపించిన రోజున ఆ పసిహృదయాల్లాగే మీ హృదయమూ వెయ్యి చెక్కలయి మీకు దిక్కుతోచని రోజున మీ తప్పు మీకు తెలుస్తుంది.

'అజ్ఞాతి'

తన మనసు అల్లకల్లోలమయిపోయింది.

ఆ అజ్ఞాతవ్యక్తి శాపం తగిలిందేమో!



తన జీవితం గాలిపటమయింది.

ఆ అవమానం తట్టుకోలేని తను ఆరోజు.

బీచ్ దగ్గర అంతులేని వ్యధతో అలమటిస్తూ.

అందమైన బాల్యం తనకెలాగూ లేకపోయింది.

అమ్మా నాన్న లేని తను చీదరింపుల మధ్య పెరిగింది.

అందుకే అంత ఆశ జీవితమంటే.

రంగుల కలగా.

ఊహల ఉయ్యాలగా.

రంగులరాట్నంగా ఉండాలని ఊహల్లో బతికి వాటికి వాస్తవరూపం ఇచ్చేది.

తనకు దొరకని ప్రేమ తన రచనల్లోని ప్రేమికుల మధ్య కనుపించేది.

కాని ఫలితం.

అది సమాజంమీద ఇంత ప్రభావం చూపిస్తుంటే.



మానవత్వం మంటకలిపిన తను ఎందుకు బతకాలి? అనుకుంటూ.

నేరుగా సముద్రంలోకి నడిచింది.

కాని...

మృత్యుంజయ తనకి అడ్డుపడ్డాడు.

తనిప్పుడు చావాలన్నా చావలేదు.

అసలు చావాలనే ఇచ్ఛపోయింది.

తనకి తెలియని లోకం.

అందులో ఇన్ని బాధలలో బతుకులీడుస్తున్న మనుషులా?

అమృతలో తీవ్ర మధనం.

ఏదో చెయ్యాలి?

ఏం చెయ్యాలి?

తనకేం కావాలి?

కాగితం- కలం?

అవును.

తెల్లని కాగితాలపై తన నల్లని అక్షరాలతో వేలాది పాఠకులను భ్రమల్లో ముంచింది.

తను అనుకున్నట్టు ఆడించింది.

కాని ఇప్పుడు చూస్తున్న ఈ బతుకులు తనని నాట్యమాడిస్తున్నాయి.

గబగబా ఆఫీసురూంలోకి నడిచింది అమృత.

తనకు కావలసిన వస్తువుల కోసం కళ్లు వెతికాయి.

"నమస్తే మేడమ్!"

నాలుగు గొంతులు ఒక్కసారే అన్నాయి.

అమృత ఉలిక్కిపడింది.

అప్పటికీ లోకంలోకి వచ్చింది.

ఆఫీసురూంలో కుర్చీల్లో నలుగురు యువకులు కూర్చునివున్నారు.

దాదాపు అంతా ముప్పైలోపువాళ్లే.

ఎవరు మీరు? ఏంకావాలి? కంగారు ధ్వనించింది అమృత కంఠంలో.

"మృత్యుంజయగారికి ఆయుష్షులమ్ముకున్నవాళ్లం"

"ఏడాది క్రితం"

ఆమెకి అర్థమయింది.

"వారి బిజినెస్ పార్ట్నర్లం ప్రస్తుతం" మరో యువకుడన్నాడు.

"మృత్యుంజయగారు ఊళ్ళోలేరు"

"తెలుసు మేడం. వెళ్ళేముందు ఫోన్ చేశారు"

"మరి?"

"ఇదిగో ఇది బిజినెస్‌లో ఈ నెలలో వారి షేర్ తాలూకు లాభం. మీ దగ్గర ఇమ్మన్నారు.

"నలుగురూ నాలుగు కట్టలు టేబిల్‌మీద పెట్టారు"

అమృత కంగారుపడింది.

"నాకెందుకు? నేనిప్పుడు శాశ్వతంగా ఉండేదాన్ని కాదు- వారెలాగూ రెండ్రోజుల్లో వచ్చేస్తారు"

"కాని ఈరోజు ఐదవతారీఖు. ఎట్టి పరిస్థితుల్లోను ఈరోజున డబ్బు కట్టేయడం మాకలవాటు"

"కాని"

"విశ్వంగారు కూడా మీకిమ్మనే చెప్పారు. మేడం మీ పేరు అమృతగారేకదూ"

"అవును"

"హమ్మయ్య మా బాధ్యత తీరిపోయింది"

నలుగురూ ఊపిరి పీల్చుకున్నారు.

సరస్వతమ్మగారు నాలుగుగ్లాసుల నిమ్మరసం తీసుకువచ్చి టేబిల్‌మీద పెట్టింది.

అలవాటయినట్టే వాళ్లు తీసుకుని గ్లాసులు ఖాళీచేసి అక్కడ పెట్టారు.

అమృత వాళ్ళనే పరిశీలిస్తోంది.

ఫేషనబుల్‌గా లేకపోయినా చక్కగా డ్రెస్ అప్ అయిఉన్నారు నలుగురూ.

ఆ ముఖాల్లో కార్యదీక్ష.

ఉత్సాహం.

వీళ్లేం టానిక్ తాగుతున్నారో అనుకున్న అమృతకు నవ్వొచ్చింది.

"నవ్వుతున్నారేంటి మేడం. ప్రోత్సాహమనే అమృతం తాగాం"

తన మనసు చదివేసినట్టు అతనలా చెప్తూంటే విస్తుపోయింది అమృత.

"ఎదుటివారి ఊహలను, మనసులను చదవగల శక్తి మాకిచ్చింది మృత్యుంజయగారే. అదే ఆయన మా బిజినెస్‌లో పెట్టిన షేర్‌కే





పిటల్.

అంటే?

ఒక యువకుడందుకున్నాడు.

"నా పేరు హరి. ఇతను ఉమాపతి. అతగాడు సుధీర్. వాడు సుబ్బారావు మేమంతా ముదిరిపోయిన నిరుద్యోగులం ఇప్పుడు కాదులెండి. ఏడాదిక్రితం.

నలుగురికీ దాదాపు ఏదో ఒక ఫీల్డులో గోల్డ్‌మెడల్స్ ఉన్నాయి. కాని మెడల్స్ మెడకి వేలాడేసుకుని తిరిగినా ఉద్యోగం కాదు సరి కదా పైసా ముష్టికూడా రాలలేదు మా మొహాలకు.

మాది ఆర్థికంగా మాత్రమే వెనుకబడిన కులమయినందున ఎక్కడా మా వంతు ఉద్యోగాలు అటు ప్రభుత్వరంగంలో, ఇటు ప్రైవేటు రంగంలోనూ కూడా దొరకలేదు.

మేమేదో తవ్వి తలకెత్తేస్తామని డొక్కలు మాడ్చుకుని ఉన్నదంతా ఊడ్చి మా చదువులకు ధారపోసిన మావాళ్లకి కూడా మామీద కోపం వచ్చి ఛీకొట్టేసేంత కాలం నిరుద్యోగులుగానే బతకాలి.

కాని బతుకుమీద అసహ్యం కలిగి.

అంధకారంలో కొట్టుమిట్టాడుతూ.

ఆ అంధకారంలోనే కలిసిపోదామని నిశ్చయించుకున్నాం మేమంతా ఒకసారి.

మేం ఒక ఊరివాళ్లంకాదు.

ఒక యూనివర్సిటీవాళ్ళం కాదు.

ఒక కులంవాళ్ళం కాదు.

కాని చేతకానితనం, ఆకలికులం, నిస్సహాయత, నిరుద్యోగం మమ్మల్ని ఓ పార్క్‌లో మిత్రుల్ని చేశాయి.

ప్రతీ సాయంత్రం ఆ పార్కులోని చెట్టూ చేమా, గడ్డీగాదం, సిమెంట్ బెంచీలు మా అనుభవాలు, నిట్టూర్పులు పంచుకునేవి.

అలాగే వినుగెత్తి వేసారిపోయి నిస్సహాయతతో చావాలనుకుని మేం తీసుకున్న నిర్ణయం కూడా కేవలం సిమెంటు బెంచీలే వింటున్నాయనుకున్నాం.

కాని... మేం దూకాలని నిర్ణయించుకున్న ఆరంతస్థుల భవనంపైకి మాతోబాటే మా వెనకే ఎక్కి వచ్చిన ప్రద్యుమ్న విశ్వంగార్లను గమనించేలోగా.

వాళ్లే మమ్మల్ని మోసుకొచ్చి మృత్యుంజయ గారి ముందుపడేశారు.

వారిచ్చిన హామీమేరకు మా ఆయుష్షుల మ్మేశాం.

మృత్యుంజయగారు ఏ ఆఫీసుల్లోనో ఉద్యోగాలు చూపించివుంటే ఆ జీతంరాళ్లకు పరిమితి ఉండేది.

కాని వారిచ్చిన పెట్టుబడి వారి మేధ.

ఇంత చదువుకున్నా మాకలాంటి ఆలోచనలు రాలేదంటే అది మా తప్పే డిగ్నిటీ ఆఫ్ లేబర్ వదిలేస్తే ఈ ప్రపంచంలో ఎన్నిరకాల బిజినెస్‌లు.

మేం చదివిన చదువుకీ దానికీ పొంతన లేకపోయినా మాకు కొత్త జీవితాలనిచ్చే బాటలు చూపించారు.

నాకు వాక్పటిమ ఉన్నది కాబట్టి నాచేత అడ్వర్‌టైజింగ్ ఏజన్సీ ఓపెన్ చేయించారు. ఉమాపతి అకౌంట్స్ చూడటంలో నిపుణుడు. ఇద్దరం కలిసి అది రన్ చేస్తున్నా పార్టనర్స్‌గా రెండు మూడు నెలలు రోజుకి ఇరవైగంటలదాకా పట్టుదలగా కష్టపడ్డాం. ఇప్పుడు నాలుగురాళ్ళు కళ్లజూస్తున్నాం.

హరి ఊపిరి తీసుకునేందుకు ఆగాడు.

"సుధీర్, సుబ్బారావు పార్టనర్స్‌గా ఫ్రూట్ జ్యూస్ పార్లర్ ఓపెన్ చేశారు. చుట్టువక్కల గ్రామాలనుంచి ఫ్రెష్ ఫ్రూట్స్ సేకరించి నిల్వ చేసి వాళ్లు మిగిలిన వాళ్లకంటే కాస్త తక్కువరేటుకి మంచి జ్యూస్ వెరైటీ టేస్టులలో సప్లైచేస్తుంటే వాళ్ల బిజినెస్ బాగా పూడుకుంది.

"దానికి పెట్టుబడి మృత్యుంజయగారే పెట్టారు అవునా?" అమృత అడిగింది.

సుధీర్ నోరు విప్పాడు.

"లేదు మేడమ్! ప్రతిపైసా పెట్టుబడీ మాదే కావాలనే పట్టుదలతో ఒక రెండునెలల పాటు డిగ్నిటీ ఆఫ్ లేబర్ మర్చిపోయి మా డిగ్రీలు మర్చిపోయి రైల్వేస్టేషన్లలో బస్‌స్టాండులలో లగేజి మోశాం. ఎండలో తిరిగి కూల్‌డ్రింక్స్ ప్రతీ షాపుకూ సప్లై చేసేవాళ్లం.



మా పెట్టుబడి సేకరించుకుని బిజినెస్‌లో దిగాం. మెటీరియల్ సేకరణకు ఐదారునెల లు మృత్యుంజయగారు తను కారు ఇచ్చేవా రు.

అమృతకు ఆశ్చర్యం వేసింది.

ఎప్పుడో ఏడాదిక్రితం ఏదో ఒకక్షణంలో ఉచి తనలహా ఇచ్చాడని వీళ్లింత సిన్సియర్‌గా ప్రతినెలా డబ్బులు మీ వాటా అంటూ ఇస్తుంటే మృత్యుంజయ తీసుకోవడం ఏంసబ బు?

వాళ్లేమనుకున్నా సరేనని అడిగేసింది అమృత.

సుబ్బారావు కాస్త తడబడ్డాడు.

"నిజమే మేడమ్! కాని ఆయనపట్ల కృత జ్ఞత చూపించడం మా బాధ్యత కాదంటారా?"

అతని మాటలో నిజాయితీ ధ్వనించటంలే దు. మిగిలిన ముగ్గురూ మాత్రం ఒక్కటే మాటమీద ఉన్నారు.

"మా ప్రాణాలే ఆయనవి అమృతగారూ! మొత్తం మేం సంపాదించినదంతా ఇచ్చేయ మన్నా ఇచ్చేస్తాం. మా పోషణభారం ఆయన దే. కాని మృత్యుంజయగారు నెలకు మూడువే లు మాత్రం కోరారు.

అమృతకి మతిపోయింది.

"ఇదన్నమాట మృత్యుంజయ బిజినెస్. ఇలాంటి కుర్రాళ్లను కృతజ్ఞతాభావంతో కట్టిప డేసి తను కారులో తిరుగుతూ పెత్తనం చెలా యించడమేకాక మంచిపేరు కూడా కొట్టేస్తున్నా డు.

"మేడమ్ మరి మాకు సెలవ్ మృత్యుంజ యగారు రాగానే వారే ఫోన్ చేస్తారులెండి"

"అంటే ఆయన అప్పుడప్పుడూ ఇలా ఊరు వెళ్లడం అలవాటేనా!"

"అవును మేడమ్. ఆయనకి ఇదొక్కటే ఊరు కాదుగా. ఎన్నో బ్రాంచిలున్నాయని విన్నాం"

వాళ్లు వెళ్ళిపోగానే అమృతకు తను అక్కడి కి వచ్చినపని గుర్తొచ్చింది.

కాని ఇక్కడ రాసే మూడ్‌పోయింది తనకు.

పెన్ను పేపర్లు డ్రాయరు సొరుగులో పె ట్టేందుకు తీసింది అమృత.

అందులో ముత్యాల్లాంటి దస్తూరీతో ఇలా వుంది.

"అమృతా!

దయచేసి నేనొచ్చేవరకు ఏమీ రాసే ప్రయ త్నం చెయ్యకండి.

మృత్యుంజయ"

అమృత కళ్లు పెద్దవయ్యాయి.

తను ఏదో రాసేందుకు ఇక్కడికి వస్తుందని మృత్యుంజయ ఊహించాడా?

లేక కాకతాళీయంగా రాశాడా?

అసలు తను రచయిత్రి అని అతనికెలా తెలిసింది?

తన హేండ్‌బేగ్‌లో అటువంటి గుర్తులేమీ లేవే?

ఆమె ఆలోచన ఒక్కసారిగా మారింది.

ఇక్కడ ఏదో తనకు పరిచయం ఉన్నట్టని పిస్తోందేమి?

ఏది?

ఈ దస్తూరీ.

అవును. ఇదే దస్తూరీ.

ఎక్కడ చదివింది తను? ఆమె మెదడు పొరల్లో జ్ఞాపకాలపుటలు వెనక్కి తిరిగాయి.

ఎందరో అభిమానులు తనకి లెటర్స్ వ్రాసే వారు.

అంటే ఇతడు తన అభిమానా?

ఒక సాధారణ పాఠకుడిలా ఉత్తరాలు వ్రాసే వ్యక్తిత్వంలా అనిపించడంలేదు మృత్యుంజ యది.

మరి ఎక్కడ చూసింది?

ఆ...

అదే...

"అజ్ఞాతి"

అజ్ఞాతి పేరుమీద తనకు వచ్చిన లెటర్స్?

మృత్యుంజయ రాశాడా?

అవును అవి అన్ని ఇతని భావాలే?

"యౌవనప్రాంగణంలోకి అడుగుపెడుతున్న




పసివాళ్ళను తప్పుదారి తొక్కించకండి''

అమృతకు ఆఖరి ఉత్తరం గుర్తుకొచ్చింది.

అనుమానం లేదు.

అందులోని ప్రతివాక్యమూ ఇతని భావాలకు అద్దం పట్టేదే?

ఇతరుల ప్రాణాలు కాపాడమన్న ఇతనికి తన ప్రాణం తృణప్రాయమన్నమాట.

ఆ ఉత్తరమే తనను ఆత్మహత్యకు ప్రేరేపించింది.

తన చావుకు కారణం కాబోయిన వ్యక్తి పంచకు చేరిందా తను.

కోపంతో అమృత గుప్పిళ్లు బిగుసుకున్నాయి.

టేబిల్‌మీద నోట్లకట్టల్ని చెల్లాచెదురు చేసేసింది. పేపర్ వెయిట్ గిరవాటేసింది. విసురుగా

వెంటనే ఇక్కడ్నుంచి వెళ్లిపోవాలి.

మృత్యుంజయ వచ్చేలోగా వెళ్లిపోవాలి. పేపర్‌వెయిట్ దేనికో తగిలి భళ్లున పగిలిన శబ్దంగాని, కిందపడిన శబ్దంగాని రాకపోయేనరికి తలెత్తింది అమృత.

ఎదురుగా!!

నుదుటినుంచి స్రవిస్తున్న రక్తాన్ని అరచేతితో అదుముతూ మరో చేతితో పేపర్‌వెయిట్ పట్టుకున్న విశ్వం కనిపించేసరికి నిశ్చేష్టురాలయింది అమృత.

అతనూ అదేస్థితిలో ఉన్నాడు.

రూంలో చెల్లాచెదురైన రూపాయలు.

మరోవైపు ఒంటరిగా ఉగ్రకాళిలా నిల్చున్న అమృత.

ఎవరిమీద ఆ కోపం?

నుదుటినుంచి కారిపోతున్న రక్తాన్ని గురించిన స్పృహలేదు విశ్వానికి.

ముందుగా తేరుకున్నది అమృతే.

తటాలున ముందుకు వచ్చింది.

అక్కడ నేప్‌కిన్ వంటిదేమీ కనిపించలేదు.

సర్రున తన చీరకొంగు చింపేసింది.

ఆమె కట్టుకడుతున్నంతసేపూ విశ్వం అదే స్థితిలో ఉన్నాడు.

''సారీ విశ్వంగారూ!''

''ఏమయింది అమృతగారూ!''

అప్పటికి గొంతు పెగిలింది విశ్వానికి.

''నావల్ల మీకు...''

ఆమె గొంతులో నిండుగా పశ్చాత్తాపం.

''అదికాదు నేనడిగేది! మిమ్మల్నెవరైనా అవమానించారా?''

అమృతకేం మాట్లాడాలో ఒక్కక్షణం తోచలేదు.

విశ్వం మృత్యుంజయకి కుడిభుజం.

అతనంటే పరిపూర్ణమైన భక్తి విశ్వాసాలున్నవాడు.

ఆ విషయం తనిక్కడికి వచ్చినప్పటినుంచీ గమనించిన విషయం.

మృత్యుంజయతో మాట్లాడుతున్నంతసేపు అతని కళ్ళలో ఆరాధన కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది.

మరోమాటలో అతని బహిర్ప్రాణం విశ్వం.

తను మృత్యుంజయ గురించి ఏం చెప్పినా అతను నమ్మడు. తను వెళ్లిపోతానని చెప్పినా కంగారు పడతాడు.

అసలు తనిప్పుడు వెళ్లడం భావ్యంకాదు.

విశ్వానికి నయంకావాలి.

ఈలోగా మృత్యుంజయ వచ్చేస్తే.

అతని ముఖం చూసి సహించగలదా?

అతనాడుతున్న నాటకం బయట పెట్టగలదా?

ఆమె ఎంతకీ మాట్లాడకపోయేసరికి విశ్వం అడిగాడు, ''నాదే పొరబాటు. బాస్ చెప్పిన అసైన్‌మెంట్‌కి అర్జంటుగా వెళ్లవలసివచ్చి హరివాళ్లను డబ్బు మీకు హేండోవర్ చెయ్యమన్నాను. వాళ్లేమైనా మిమ్మల్ని ఇబ్బంది పెడ్తే నన్ను క్షమించమని మనస్ఫూర్తిగా కోరుతున్నాను''

రెండు చేతులూ జోడించాడు విశ్వం.

అమృతకు పలమారింది.

''అబ్బే అదేంలేదు. నేను. ఏదో ఆలోచనలో పడి...''

ఆమె ఏదో దాస్తోందని తెలుస్తోంది.

విశ్వం మరి రెట్టించలేదు.

"మీకు నావల్ల అనవసరంగా దెబ్బతగిలింది"

కించపడుతున్నట్టుంది ఆమె గొంతు.

అతని రెండు చేతులూ ఆమె చేతిలో ఉండిపోయాయి.

ఖాళీ షర్బత్‌గ్లాసులు తీసుకునేందుకు వచ్చిన సరస్వతమ్మగారు తలవంచుకుని వెళ్లిపోయారు.

ఆమె అడుగుల చప్పుడుకి ఈ లోకంలోకి వచ్చిన అమృత అపరాధభావంలో ఇరుక్కుపోయింది.

ముందుగా విశ్వం తేరుకున్నాడు.

"థాంక్ గాడ్! దెబ్బ అమ్మమ్మగారి కంటపడలేదు"



అసతోమా సద్గమయా
తమసోమా జ్యోతిర్గమయా
మృత్యోర్మా అమృతంగమయా

కళ్లు మూసుకున్నదన్నమాటేగాని అమృతకు మనసేమీ బాగులేదు.

రాత్రంతా కలతనిద్రగానే ఉంది.

మరింక నిద్రపట్టదని తెలిసి తలారా స్నానం చేసి ఆ తెల్లవారుజామున మంటపంవైపు బయలుదేరింది.

విశ్వం కాటేజ్‌వైపు వెళ్లాలనుకుని ఎందుకో మానేసింది. బహుశా బాధతో అతనికీ నిద్రపట్టి ఉండదు.

తెల్లారకుండానే డిస్టర్బ్ చెయ్యడం ఎందుకనిపించింది అమృతకు.

అందుకే అలా నెమ్మదిగా నడుచుకుంటూ మార్కండేయస్వామి మండపంవైపు వెళ్ళింది.

అప్పటికి ఆ కనుచీకట్లో ఎవరో తెల్లని పూలతో స్వామిని అలంకరిస్తున్నారు.

చూస్తే సరస్వతమ్మగారు.

"రామ్మా అమృతా! నీకూ నిద్రపట్టలేదా?"

"అంటే మీకూ పట్టలేదన్నమాట"

ఆవిడ ఆప్యాయంగా పలకరించడం చూసి తేరుకుంది అమృత.

"లేదమ్మా! రాత్రంతా విశ్వం ఒకటే మూలుగు. ఎక్కడ తగుల్చుకున్నాడో అంత పెద్ద దెబ్బ. ప్రద్యుమ్న రాగానే అర్ధరాత్రి డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాడు"

"ఇపుడెలా వుంది మామ్మగారూ!"

అమృత అడిగింది ఆదుర్దాగా.

"అక్కడే ఇంజక్షన్‌చేసి పడుకోబెట్టేశారట. కంగారుపడవద్దని ప్రవీణకు ఫోన్‌చేసి చెప్పాడట ప్రద్యుమ్న.

అమృతకు మనసంతా పాడయిపోయింది.

తన ఆవేశం ఎంత అనర్థం తెచ్చింది.

దోషి ఒకరైతే శిక్ష వేరొకరికి?

"మృత్యుంజయ ఉంటే అంతరాత్రి బయటకు పంపించాల్సిన అవసరం లేకపోను"

"అంటే?" మృత్యుంజయ పేరు వినేసరికి చేదుగా అనిపించింది అమృతకు.

"అతను డాక్టర్‌కదమ్మా! ఆశ్రమంలో కూడా ఎవరికేం కావలసి వచ్చినా తనే చూసుకుంటాడు. ఓసారి సుప్రియకి ఎంత జబ్బు చేసిందని? బిడ్డ ఎంతసేవ చేశాడో?"

ఇక్కడ అందరికీ మృత్యుంజయ రవంత చేసినా కొండంతగానే కనిపిస్తుంది కాబోలు.

కాని ఈవిడ మృత్యుంజయని డాక్టర్ అంటోందేమిటి?

డాక్టరయితే ఎక్కడైనా ప్రాక్టీసు పెట్టుకుని దర్జాగా బతకక ఈ ఆశ్రమం ఇవన్నీ ఎందుకు? ముసలాళ్లకు కాంపౌండర్ కూడా




డాక్టర్‌లాగే కనిపిస్తాడు. అయినా ఈ కాలం డ్రెస్సింగ్ చెయ్యడం అంటే దాదాపు అందరికీ తెలుసు. పల్లెటూళ్లలో కాస్త పెద్ద డాక్టర్ దగ్గర పనిచేసివచ్చిన కాంపౌండర్ తన అనుభవంతో డాక్టర్‌గా చెలామణి అయిపోతుంటాడు.

ఆవిడతో మరి తర్కించలేదు అమృత.

అయినా అతనెవరైతే తనకెందుకు?

ఇంకా ప్రార్థనకు గంటపైముంది.

ఆవిడ కుండతో నీళ్లుతెచ్చి శివునికి అభిషేకం చేసి తలపై చల్లుకుంది.

"ఈ బిడ్డల చేతుల్లో నా తనువు ప్రశాంతంగా వెళ్లిపోనీ మృత్యుంజయా!"

పాపం సరస్వతమ్మగారికెవరూ లేరు కాబోలు.

ఆశ్రమంలో వాళ్లనే బిడ్డలుగా చూసుకుంటుంది. ఆవిడ కొసరి కొసరి తినిపించే విధానం చూస్తే స్వంతబిడ్డలకు తినిపిస్తున్నట్టే ఉంటుంది.

ప్రవీణ తెల్లని దుస్తులతో వచ్చింది.

ఆ చీరలో ఆమె వనకన్య శకుంతలలా వుంది.

"గుడ్‌మార్నింగ్ అమృతా!"

"గుడ్‌మార్నింగ్"

"అమ్మమ్మగారూ! నా హడావిడిలో రోజూ చెప్పాలనుకుని మర్చిపోతూనే వున్నాను. వారం క్రితం బెజవాడ స్టేషన్‌లో మీ చిన్నవాడు కనిపించాడు. నన్ను చూసీ పోల్చనట్టే వెళ్లిపోయాడు. కానీ నేను ఓరకంట గమనిస్తూనే వున్నాను. వేసవి సెలవులకి ఎక్కడికో వెళ్తున్నట్టున్నారు. మీ కోడలే అనుకుంటాను. ఒంటి నిండా నగలతో ధగధగలాడిపోతోంది. బహుశా పెళ్లికెళ్లి వస్తున్నారేమో!"

ప్రవీణ ఎవరితో మాట్లాడుతోందో ముందు ఒక్కక్షణం అర్థంకాలేదు అమృతకు.

సరస్వతమ్మగారు ముభావంగా వెళ్లిపోతుండడం చూసి ఆవిడనే అని అర్థమయింది, అక్కడ మరెవరూ కూడా లేరు కనుక.

"అమ్మమ్మగారికి కొడుకులున్నారా?"

అమృత ఆశ్చర్యంగా అడిగింది.

పెదవి విరుస్తూ అంది ప్రవీణ...

"గంపెడు సంతానం. నలుగురు కొడుకులూ ఇద్దరు కూతుళ్లు. సరస్వతమ్మగారి భర్త బేంకులో ఏదో ఆఫీసరుగా చేసి రిటైరయారు. ఉన్నదంతా వాళ్ల చదువులకి పెళ్లిళ్లకి ఖర్చు చేసి బోడి బొమ్మల్లా మిగిలారు. నలుగురు కొడుకులూ మంచి ఉద్యోగాల్లోనే ఉన్నా వాళ్ల మీద తల్లిదండ్రులు పెట్టుకున్న ఆశల్ని అడియాసలు చేశారు. బంతులాట ఆడినట్టే తలో నెలా, రెండు నెలలూ పంచుకుని అభిమానం చూపిస్తే తమ దగ్గరెక్కడ సెటిలయిపోతారోనని భయపడి పోయేవారు. ఆయన సత్తెకాలం మనిషి. తనకీ భార్యకీ ఇలాంటి అవస్థ కలుగుతుందని రవంత కూడా ఊహించలేదు.

కూతుళ్లు కూడా కొడుకులకేం తీసిపోలేదు. పరాయింటి పిల్లలం నిస్సహాయులం అని బుడిబుడి దీర్ఘాలు తీసేవారుట. ఒక మొక్కను నాటి అది వేళ్లూనేలోగా పీకి మరోచోట వేస్తుంటే ఎంతకని భరిస్తుందా మొక్క. పిల్లల అనాదరణకు విసుగెత్తి పోయారిద్దరూ. ఆయనకొచ్చే పెన్షన్ కోసమని తండ్రిని మేముంచుకుంటాం. తల్లిని వేరే వాళ్ల దగ్గరుండమని పోటీలు పడ్డారు. ఆవిడ కాస్త అనారోగ్యం మనిషి. భార్యనీ వృద్ధాప్యంలో విడిచి ఉండడం భావ్యం కాదనిపించింది ఆయనకి. ఆవిడ జవసత్వాలన్నీ పిల్లల చాకిరీకి ధారపోసింది. బతుకంటే ఎంత ఆశ ఉన్నా వేసారిపోయిన ఇద్దరూ ఒకేసారి చచ్చిపోవాలనుకుని గన్నేరు పప్పు నూరుకుని తిన్నారు. దురదృష్టవశాత్తూ ఆయన చనిపోయారు. వీళ్ల పక్కింట్లో ఉండే విశ్వం సమయానికి ఆవిడలో కాస్త ఊపిరుందని చూసి హాస్పిటల్‌లో చేర్చి కాపాడాడు.

టెలిగ్రాంలిచ్చినా ఏదో మొక్కుబడికి వచ్చి వాళ్లు చేసిన పని తమకి అప్రతిష్ఠ తెచ్చిందని ఆవిడని మరింత వే..ంచి రేపు మళ్లీ తమ ఇంట్లో అఘాయిత్యం చేస్తే కష్టం అని ఎవరిదో వన వాళ్లు వెళ్లిపోయారు.

ప్రవీణ ఆగింది ఒక్క నిముషం.

"పిటీ! వాళ్లకొచ్చే పెన్షన్‌తో హాయిగా బతకవచ్చుకదా! ఎందుకలాంటి పని చేశారు?" అమృత అడిగింది.

"వాళ్ల కొడుకులు ఏవో అవసరాలు సాకులు చెప్పి కొంత పెన్షన్‌ని ఎపుడో అమ్మించేశారు. మేమున్నాం మీరేం ఆలోచించవద్దు అంటే ఏ తండ్రి మాత్రం కొడుకులను నమ్మకుండా ఉంటాడు చెప్పండి"

నిట్టూర్చింది అమృత.

లోకంలో ఎన్ని రకాల బాధితులో
ఎంతమంది స్వార్థపరులో.

"ఏమీ పెట్టకపోయినా ఎపుడైనా చూసి పోతుంటారా?"

"ఊహూ! మారుమూల పల్లెలో మునలాళ్ల వాటాగా ఉన్న చిన్న పెంకుటింటి భాగంకోసం సరస్వతమ్మగారిచేత సంతకాలు పెట్టించుకోడానికి వచ్చాడు పెద్ద కొడుకోసారి వెతుక్కుంటూ. కానీ అమ్మమ్మగారికి మనసప్పటికే విరిగిపోయింది. ఆవిడ వ్యతిరేకించేసరికి వెళ్లిపోయి కూడబలుక్కున్నట్టు ఒక్కొక్క కొడుకూ వచ్చి వాళ్ల దగ్గరుండమని ప్రాధేయపడడం మొదలు పెట్టారు. కానీ ఆమె లొంగలేదు. వాళ్ల ఎదురుగానే ఆ వూరి స్కూలుకి ఆ ఇంటిని దానపత్రం రాసేసరికి మరి ఎపుడూ ఎవరూ రాలేదు సరికదా ఆశ్రమంలోని మాలాంటివాళ్లకి ఎపుడైనా కనిపించినా పలుకరించరు.

"ఆమె గురించి ఏం చెప్పి తీసుకు వెళ్లమంటామోనని భయం. లోకంలో ఇలాంటి సంతానం కూడా ఉంటారా అనిపిస్తుంది నాకు"

ఎంతో మితభాషిలా ఉండి ఎపుడూ అమిత వాత్సల్యం కురిపిస్తూ నవ్వుతూ ఉండే సరస్వతమ్మగారి వెనుక ఇంత వ్యధా? అనిపించింది అమృతకు.

"అమృతగారూ! భర్త చనిపోయి తను బతికున్నందుకు ఇక్కడకొచ్చిన కొత్తలో ఆమె ఎంతో రోదిస్తుండేది. కానీ తనకంటే బాధితుల, ఆర్తుల, రకరకాల కన్నీటి గాథలను విని పెద్దగీతముందు చిన్నగీతలా ఆమె తన బాధ మర్చిపోయి ఇక్కడున్న వారినందరినీ కన్నబిడ్డల్లా చూసుకుంటుంది. కన్నబిడ్డలవల్ల ఆమెకి, తీరని వాంఛ ఇలా తీర్చుకుంటుందేమో మరి"

అప్పటికి తెల్లవారి పోయింది. ఒక్కొక్కరుగా అంతా చేరి పోయారు.

ప్రవీణ చెప్పిన విషయాలే కళ్లముందు తిరుగుతోంటే అలాగే ఉండిపోయింది అమృత.

"అమ్మా!"

మళ్లీ చల్లని పిలుపు.

అమృతకు సేదదీరినట్టుంది.

కళ్లు తెరిచేసరికి ఎదురుగా సుబ్రహ్మణ్యంగారు.

"పావుగంటనుంచీ అలాగే వున్నావు"

అమృత సిగ్గుపడింది.
తను పరిసరాలు మర్చిపోతుంటే ఎలా?
"ఇక్కడ నీకు బాగుందా తల్లీ"
తలూపింది అమృత.

కన్నతండ్రిలాంటి ఆప్తునితో మాట్లాడుతున్నట్టుంటుంది.

ఎపుడూ ఆయన స్వంత విషయాలు తను అడగలేదు.
ఆయనా అంతే.

ఏదో సాహిత్యం గురించి చర్చిస్తారంతే.

"ఈరోజు మా ఇంటికి రాకూడదా అమృతా!"

ఈ అనుకోని ఆహ్వానానికి ఏమనాలో అర్థం కాలేదు అమృతకు.

"మృత్యుంజయ ఏమీ అనుకోడమ్మా. మహా దొడ్డమనను"

సశ్రున కోనం వచ్చింది అమృతకు.

"అతనెవడు తనని వారించేందుకు" పైకి అనలేదు ఆమె.

"నీకిష్టంలేకపోతే పోనీమ్మా మరోసారి..."

"అదేంకాదు... వస్తాను... నాకిక్కడ పనేం లేదులెండి" అమృత అలా అన్నదేగాని అక్కడ ఎవరికి చెప్పి వెళ్లాలో అర్థం కాలేదు. విశ్వం, ప్రద్యుమ్న లేరు.

ప్రవీణ బయటికి వెళ్లిపోయి వుంటుంది.

సరస్వతమ్మగారికి చెప్తే సరిపోతుంది.

"ఈరోజు నీ భోజనం మా ఇంట్లోనే. రాత్రికి వచ్చేద్దువుగాని తల్లీ నేనీలోగా కుర్రాళ్లకు




ట్యూషన్ చెప్తూంటాను. అయాక ఆఫీసురూం దగ్గరకొస్తాను''

అమృత సమాధానం కోసం ఎదురు చూడ కుండా చెట్టు దగ్గరున్న చప్టావైపుకు వెళ్లిపో యాడాయన.

అక్కడ సుప్రియ మరో నలుగురు పిల్లలు పుస్తకాలతో రడీగా ఉన్నారు.

★ ★ ★

తాళం తీసి లోపలికి అడుగుపెట్టాడతను.

గట్టిగా పెద్ద తుమ్ము వచ్చింది.

లోపలంతా దుమ్ము ధూళి

మనుషులు నివసించి చాలా రోజులయిన ట్టుంది ఇల్లు.

మూడు గదులు వరుసగా ఉన్నాయి.

ముందుగదిలో టేబిల్ ఒకవారగా ఉంది. కుర్చీ కూడా దుమ్ముకొట్టిపోయి వుంది.

మధ్యలో సోఫాలున్నంతమేర కార్పెట్, లోప లగదిలో ఒక బెడ్, దుప్పటి మాసిపోయివుంది. గదికి మూడు పక్కలా అద్దాల బీరువాలనిండా మేగజైన్స్ దిన, వార, మాసపత్రికలు కటింగ్ లు.

కొన్ని బైండ్ పుస్తకాలు ఒక బీరువాలో. మూడో గది కిచెన్‌గా ఉపయోగపడుతోంది కాబోలు కాసిన్ని వంటపాత్రలు...

స్టవ్ అంతా పొంగిపోయిన పాలచారికలు. మిగిలిపోయిన వంట పదార్థాలతో గుప్పున వాసన.

అతడు ముక్కు మూసుకుని మధ్యగదిలో కొచ్చేసాడు. బహుశా వంట చేస్తూ అలాగే ఆపేసి వెళ్లిపోయి ఉంటుంది అమృత.

అతని కళ్లు నాలుగు మూలలా చకచకా వెతికాయి. గబగబా అద్దాల రాక్స్ అన్నీ చూశా డు.

అతనికి కావలసింది కనిపించలేదు. వీధి వైపునుంచి ఎవరైనా వస్తారేమోనని చూస్తూనే అన్వేషణ కొనసాగిస్తున్నాడు.

చివరికి పావుగంటకు అతని అన్వేషణ ఫలించింది.

బెడ్ అడుగున బైండ్ పుస్తకంలో దొరికాయి ఆ ఉత్తరాలు.

వాటిని మడతలుపెట్టి తనకూడా తెచ్చిన బ్రీఫ్‌కేసులో పెట్టాడు.

వెంటనే బయటకు వచ్చి తలుపుకు తాళం వేస్తూంటే వినిపించింది.

''ఎవరు బాబూ మీరు?''

బహుశా ఇంటి ఓనర్ కాబోలు.

నెరిసిన జుట్టు 'వడలిపోయిన' శరీరం. తెల్లచీర.

అరవై ఏళ్లకు తక్కువుండవు ఆవిడకు.

అతనేం తడబడలేదు.

''అమృతకు...''

''అమృత బంధువా మీరు'' అతని మాట పూర్తి కాకుండానే అడ్డుకుంది ఆవిడ.

''పదిహేను రోజులుపైగా అయింది ఆ తలుపుతీసి. ఎక్కడికెళ్లింది బాబూ ఆ పిల్ల. ఇన్నాళ్లు ఇల్లు వదిలి ఎప్పుడూ వెళ్లలేదు. మా మనవరాలు ఒకటే బెంగపెట్టుకుంది''

''అమృత త్వరలో వచ్చేస్తుంది మామ్మగా రూ! అర్జంటుగా ఆఫీసు పనిమీద కేంప్‌కె ళ్లింది''

నోటికొచ్చిన అబద్ధంచెప్పేశాడు.

''తనకి కేంప్‌లుండే ఉద్యోగం కాదని చె ప్పిందే. మనిషి సాయంకోసం ఈ ఇల్లు అద్దెకి చ్చాం. ఎపుడో మావారి తాతలనాటి ఇల్లు. అదిగో అక్కడ ఔట్‌హౌస్‌లాంటి గదిలో ఉంటాం నేనూ మనవరాలూను''

''ఏవో ఆఫీసు పేపర్లు అర్జంటుగా కావాలని నన్ను పంపించింది అమృత. మరి నేను వెళ్తాను''

''ఏంటోబాబూ అమ్మాయిని త్వరగా వచ్చే యమను. ఏం తోచడంలేదు. అదీగాక అనకూ డదుకానీ మాకీ అద్దెమీదే కాలక్షేపం. ఫస్టు తారీకుకల్లా అద్దె ఇచ్చేసేది ఆ పిల్ల''

''త్వరలో వచ్చేస్తుంది. నేను చెప్తాలెండి మామ్మగారూ''

''అన్నట్టు అడగడం మర్చిపోయాను, మీ పేరు?''

'రాహుల్' అనబోయి, గబుక్కున ఆగి మరుక్షణం అనేశాడు ''మృత్యుంజయరావు''

అని.

''అలాగా''

''వెళ్లొస్తాను మామ్మగారూ''

''మంచిది''

అతను తాపీగా బ్రీఫ్‌కేస్‌తో వీధి చివరివరకూ నడుచుకుంటూ వెళ్లి మారుతీకారులో కూర్చుని..

''పోనీ'' అన్నాడు డ్రైవర్‌తో.

కారు దూసుకెళ్లిపోయింది వేగంగా.

అతను తృప్తిగా నవ్వుకున్నాడు.

అమృత తననేవిధంగానూ బెదిరించే అవకాశం లేదు. తండ్రి హెచ్చరించబట్టి తనకీ ఆలోచన వచ్చింది.

''అమృతతో వట్టి షికార్లేనా? ఉత్తరాలేమైనా వెలగబెట్టావా? అదసలే రచయిత్రి అంటున్నావు. నిన్నే కేసులోనైనా ఇరికించగలదు''

అపుడు గుర్తొచ్చింది తన ప్రేమ లేఖల సంగతి.

తను విదేశయానం నాటకాన్ని పూర్తిచేయొచ్చు అవి చేజిక్కితే. అసలే కోపంగా ఉంది. తన మోసం తెలిసి మర్యాదగా ప్రేమలేఖలు ఇస్తుందా? అందుకే నాలుగు రోజులుగా ఈ ఇంటి చుట్టూ రాత్రుళ్లు తిరిగి మారు తాళం చేయించాడు.

ఇంతకీ అమృత పదిహేను రోజులుగా రాలేదంటుందేమిటి ముసల్ది.

కొంపదీసి ఆత్మహత్య చేసుకోలేదు కదా!

అలా అయితే పీడా విరగడౌతుంది.

కానీ... అలా కాకపోతే.

ఎక్కడకు వెళ్లి వుంటుంది.

దిక్కూ దివాణం లేనిదనే తను బుట్టలో వేసాడు. చుట్టాలు, స్నేహితులు లేనిది ఎక్కడకు వెళ్లిందో. ఉత్తరాలు దొరికాయి కనుక తనకు అజ్ఞాతవాసం తప్పింది. ఈసారి అమృత కనిపించినా తననేమీ చెయ్యలేదు.

అతని పెదాలమీద వ్యంగ్యంతో కూడిన నవ్వు.

★ ★ ★

''మామ్మగారూ!''

గేటు దగ్గరగా వేసి వెనుదిరిగిపోతున్న ఆవిడ వెనక్కి తిరిగింది.

కళ్లకు గాగుల్స్.

దాదాపు ముప్పై ఏళ్ల యువకుడు.

తెల్లని బట్టల్లో ముత్యంలా వున్నాడు.

''ఎవరు కావాలి మీకు''

''రావ్ అండ్ కంపెనీలో పనిచేసే అమృత అనే ఆవిడ ఉండేది ఇక్కడేనా?''

''కంపెనీ పేరు తెలియదుగాని అమృత ఉండేది ఇక్కడే''

''ఇంతకీ మీరెవరు?''

ఒక్కక్షణం ఆగాడతను.

అతనాగడం చూసి ఆవిడకెందుకో అనుమానం వచ్చింది.

''నేను ఆవిడ ఆఫీసులో కొలీగ్‌ని, మీ దగ్గర ఇంటి తాళం డూప్లికేట్ ఉంటే కొన్ని పుస్తకాలు కావాలి''

''తాళం నా దగ్గరెందుకుంటుంది? అయితే మీలాగే ఇంకో అతను తాళం తెచ్చుకునే వచ్చాడుగా ఏవో కాగితాలు కావాలని?

తాళం తెచ్చుకుని వచ్చాడా?

ఉలిక్కిపడ్డాడతను.

అతని ఉలికిపాటుతో ఆవిడ అనుమానం మరింత బలపడింది.

''ఏం మాట్లాడరు? ఇంతకీ మీరెవరు?''

ఆవిడ ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే అతనడిగాడు...

''ఇందాక వచ్చినతను పేరు చెప్పాడా! కాగితాలు తీసుకెళ్లాడా?''

''ఆ దొరికాయని చెప్పాడు. అతని పేరు మృత్యుంజయ అని ఏదో చెప్పాడు. అమృత క్షేమంగా ఉందా? ఇలా మీరంతా ఎందుకు వస్తున్నారు?''

మృత్యుంజయ అన్న పేరు విని బాంబు పేలినట్టయింది అతనికి.

''మీ పేరేమిటంటే చెప్పరేం?'' కంగారులో రెట్టించిందావిడ.

''నా పేరు మృత్యుంజయ''

ఈసారి నిర్ఘాంతపోవడం ఆవిడ వంతయింది.




ఆవిడ కంగారునుంచి తేరుకునేలోగానే అతను బయటపడి వీధి చివరివరకూ నడచి మారుతీ కారెక్కాడు.

ఎవరతను? అమృత ఇంటి తలుపు తెరిచి ఏం తీసికెళ్లినట్టు?

తను అమృత బట్టలు పుస్తకాలు తీసికెళ్దామని వస్తే ఇదేమిటి?

ఇంటావిడ ఇంకా అలాగే నోరు తెరుచుకునుంది.

★ ★ ★

అమృత, సుబ్రహ్మణ్యంగారు ఆటో దిగి లోపలికి నడిచారు.

అదొక చిన్న పెంకుటిల్లు.

చిన్న పొదరిల్లులా ఉంది.

చుట్టూ ఎక్కువ స్థలం లేదుకానీ ఉన్నంతలోనే రెండు కొబ్బరి చెట్లు...

ఒక జామచెట్టు...

కర్ర గేటుకిరువైపులా బోగన్‌విల్లా, ముళ్ల కంచె మీద పాకిన పాదులు.

"యశోదా! మనింటి కెవరొచ్చారో చూడు"

సుబ్రహ్మణ్యంగారు పైతుండులో ముఖానికి పట్టిన చెమటను తుడుచుకున్నాడు.

భర్త గొంతు విని మంచినీళ్ల గ్లాసుతో బయటికొచ్చింది, ఒక మధ్య వయసు దాటి వృద్ధాప్యంలో అడుగుపెడుతున్న ముత్తైదువ.

పచ్చని ముఖంమీద కాసంత కుంకుమ. నేత చీర.. ఎర్రని మట్టిగాజులు...

ఆవిడను చూస్తే పార్వతీదేవిలా అనిపించింది అమృతకు. "నమస్కారమండీ!" కానీ ఆవిడ అమృతను చూసి అలాగే ఉండిపోయింది.

ఎవరమ్మా వచ్చింది, అంటూ లోపల్నించి వచ్చిన పద్దెనిమిదేళ్ల యువతి కూడా అమృతను చూసి ఆగిపోయింది.

సుబ్రహ్మణ్యంగారు భార్య భుజం తట్టారు.

"మన ప్రీతికాదు యశోదా! అమృత అని ఆశ్రమంలోని అమ్మాయి చెప్పాగా... ట్యూషన్స్ అయాక కాసేపు మాట్లాడి వస్తూంటాను రోజూ"

యశోదగారు ఏదో లోకంలో ఉన్నట్టు నడుస్తూ వచ్చి అమృతను అక్కున చేర్చుకుంది.

"ప్రీతీ! ప్రీతీ"

పదేపదే ఆవిడ పెదాలు ఉచ్ఛరిస్తున్నాయి.

ఆమె చేతులు అమృత చెంపలు నిమిరాయి.

"రమా! అక్కయ్యను లోపలికి తీసుకెళ్లి మన ఇల్లు చూపించకూడదూ!"

సుబ్రహ్మణ్యంగారి మాట విని ఆ యువతి చటుక్కున ముందుకొచ్చి అమృత చెయ్యి పట్టుకుంది.

తన పోలికలున్న కూతురు వీళ్లకున్నట్టుంది అనుకుంది, అమృతవాళ్ల అబ్బురపాటు చూసి,

అమృతను రమ లోపలికి తీసికెళ్లగానే యశోదగారు అక్కడున్న బెంచీ మీద చతికిలబడిపోయింది.

ఆవిడ కళ్లవెంట నీళ్లు కారిపోతున్నాయి.

"ఊరుకో యశోదా! నువ్విలా షాక్ తినకూడదనే నేను రోజూ నీకు చెప్తూ వచ్చాను"

"అచ్చం మన ప్రీతిలాగే ఉందండి"

"మొదటిసారి ప్రార్థనా స్థలంలో చూసి నీలాగే నేనూ స్థబ్దమైపోయాను. అలాగే పది నిమిషాలు చూస్తూ ఉండిపోయాను. మన చిట్టి తల్లే తిరిగి వచ్చిందని సంబరపడిపోయాను. అందుకే నెమ్మదిగా స్నేహం కలుపుకున్నాను. అమృత మాట్లాడుతుంటే మన ప్రీతి మాట్లాడుతున్నట్టే అనిపిస్తోంది.

ఈమధ్య మరీ క్రమం తప్పకుండా ఆశ్రమానికి వెళ్తున్నది కూడా ఆ పిల్లకోసమే"

"మృత్యుంజయ మనకు రెండోసారి ప్రాణం పోసాడండీ"

"అవును యశోదా!"

"అమృతది ఈ ఊరేనా? తల్లీదండ్రీ ఉన్నారా? మృత్యుంజయ ఆశ్రమానికి వచ్చిందంటే..."

"అలాంటిదేదో ఉండివుంటుంది. కానీ నాకూ వివరాలు ఎక్కువ తెలియవు. చాలా ముభావంగా కోపంగా ఉంటుందిట ఆశ్రమంలో. పెద్దావిడ చెప్పింది"



"పద ఏదైనా స్వీట్ చెయ్యి. భోజనం ఇక్కడే అని చెప్పాను"

"ప్రీతికి పాయసం ఇష్టం"

"పిచ్చిదానా- అమృత, ప్రీతి వేరని మర్చిపోకు"

"ఇద్దరూ ఒకటే కావాలంటే పాయసం ఇష్టపడుతుంది చూడండి"

"చూద్దాం" నవ్వుకున్నారిద్దరూ.

★ ★ ★

అమృతకు రోజెలా గడిచిందో తెలియలేదు.

అమ్మా, నాన్న, అక్క, చెల్లి అంతా ఉండే కుటుంబం కలిసివుంటే స్వర్గంలా ఉంటుందన్నమాట.

తను సృష్టించిన స్వర్గాలకంటే మిన్నగా ఉంది.

భోజనం చేస్తున్నంతసేపు యశోదగారు కొసరికొసరి తినిపిస్తూనే ఉన్నారు.

అమృత పాయసం మరికాస్త వేయించుకునే సరికి గుంభనగా భర్తవైపు చూసి నవ్వింది ఆవిడ.

"అక్కా ఈ రాత్రి మా ఇంట్లో ఉండిపోకూడదూ" గోముగా అడిగింది రమ నన్నజాజుల మాల కడుతూ.

ఆ పిల్లకు అమృతను చూస్తుంటే మరింత అపురూపంగా వుంది.

అచ్చం ప్రీతి అక్కలాగే ఉండడం ఎలా సాధ్యం అని ఆలోచిస్తోంది.

అందుకే ఆమెను వదలాలనిపించలేదు.

"అమృత నా మాట వింటుంది. ఇవాళంతా ఇక్కడే" యశోదగారు అభయమిచ్చేస్తుంటే అమృత సుబ్రహ్మణ్యంగారివైపు చూసింది. ఆయన మొహం చాటుచేసుకున్నారు.

"నువ్వుండక తప్పదక్కా! శారదక్క కూడా మాలాగ నిన్ను చూసి ఆశ్చర్యపోవద్దూ!"

"ఎన్ని గంటలకొస్తుంది మీ అక్క?"

"ఎనిమిదయిపోతుంది. అంత రాత్రి అంతదూరం ఆశ్రమానికి వెళ్లడం భావ్యం కాదు" సుబ్రహ్మణ్యంగారు యశోద మాటలకు సమాధానమివ్వలేదు కాసేపు.

ఆయన ఆలోచన వేరేగాఉంది.

తను అమృతను సాయంత్రం తీసుకెళ్లి దిగబెడదాం అనుకున్నాడు.

మృత్యుంజయ ఆశ్రమానికి వచ్చిన పిల్లను అతని పర్మిషన్ లేకుండా రాత్రి ఉంచేస్తే అతనికి కోపం రావచ్చు.

అతనీరాత్రికి వచ్చేస్తే?

ఏమో తెలియదు.

కానీ భార్య పిల్లల ముఖం చూసి కాదనలేకపోతున్నాడు. ఇల్లు వదలి వెళ్లిపోయి ఏమయిపోయిందో తెలియని తన కూతురు ప్రీతిలా వున్న అమృతను భార్య అంత త్వరగా విడిచి పెట్టలేదని తెలుసు.

ఆయన లేచి పైకండువా వేసుకున్నారు భుజం మీద.

"నేనలా బయటికి వెళ్లి ఆశ్రమానికి ఫోన్ చేస్తానమ్మా. ప్రద్యుమ్నకి చెప్తాను ఈ విషయం. మృత్యుంజయ వచ్చేసి వుంటే మనం వెళ్లిపోదాం"

అమృతకా విషయం అంత ఇంట్రెస్టులేదు.

మృత్యుంజయ ఇష్టా ఇష్టాలతో తనకి పనిలేదు.

కానీ తనా విషయం వాళ్ల ఎదుట కుండబద్దలుకొట్టినట్టు చెప్పడం భావ్యం కాదు.

వీళ్లు ఏదో రకంగా అతని సాయం పొంది ఉంటారు కనుక కృతజ్ఞత ఉంటుంది. అది సహజం కూడా.

ఏదో ఒక పూట భాగ్యానికి తనంతతాను వీళ్ల మనసులు ఎందుకు నొప్పించాలి?

సుబ్రహ్మణ్యంగారటు వెళ్లగానే వచ్చింది శారద.

"ఇవాళ పెందరాళే వచ్చేశావ్" చాటంతయింది యశోదమ్మగారి ముఖం.

అమృతను చూసి ఆశ్చర్యపోలేదు శారద. ముఖం కోపంగా పెట్టుకుని లోపలికి వెళ్లిపోయింది. అమృత ఏమనుకుంటుందోనని భయపడింది యశోదగారు.

"అమృతక్కా! శారదక్క బోల్తాపడింది. నువ్వు ప్రీతివే అనుకుని ఇన్నాళ్లూ కనిపించ





నందుకు కోపం ప్రకటిస్తోందన్న మాట'' రహస్యంగా అంది రమ.

ఇదేదో డబుల్ ఏక్షన్ సినిమాలా భలేవుంది అనుకుంది అమృత. తనే హీరోయిన్ కావడం గర్వంగా వుంది.

యశోదమ్మగారు లోపలికెప్పుడెళ్లారో శారదను వెంటబెట్టుకొచ్చారు.

శారద కళ్లు ఇంకా నమ్మశక్యం కానట్టే ఉన్నాయి.

''నిజం చెప్పు, నువ్వు ప్రీతివి కాదూ'' అమృత చుబుకం పట్టుకుని అడిగిందామె.

నవ్వింది అమృత..

''మీరెవరోగానీ ఈ రోజు మా ఇంట్లో పండగ తెచ్చారు. పుట్టి బుద్ధెరిగి మా అమ్మ ఇంత సంతోషంగా ఉండడం చూడడం నాకిదే మొదలు''

అమృత చేతులు రెండూ పట్టుకుంది శారద.

''మీరిపుడే వెళ్లిపోవాలనుకుంటే కుదరదు. ఏది ఏమైనా రేపుదయమే మీరు వెళ్లేది. నాన్నగారికీ మృత్యుంజయగారికి నేనే చెప్తాను''

అమృత నవ్వి అంది,

''ఈ ఆప్యాయతానురాగాలు ఇన్నాళ్ల జీవితంలో నేనెపుడూ పొందనివి. అంచేత మీరు పొమ్మన్నా ఈ రాత్రి మీతోనే ఉంటాను. అమ్మగారి చేతి భోజనం మరోసారి చెయ్యొద్దూ!''

యశోదగారి ముఖం విప్పారింది.

ఇంక సుబ్రహ్మణ్యంగారికోసం ఎదురు చూడడం మానేసారు వాళ్లు.

★ ★ ★

ఆ రాత్రి వరండాలో పక్కలు వేసుకున్నారు శారద, రమ, అమృత.

తను వాళ్లిద్దరి మధ్య పడుకుని కబుర్లు వింటూంటే ఎంతో తృప్తిగా ఉంది అమృతకు.

అమృత తన వివరాలు వారు అడక్కపోయినా తనే చెప్పింది.

''నాకెవరూ లేరు. ఒంటరి పక్షిని. గాలిపటాన్ని. ఏదో అనాథ శరణాలయంలో పెరిగాను. వచ్చిన ఉద్యోగం చేస్తూ నచ్చినట్టు జీవితం గడుపుతున్నాను. ఇంతకుమించి చెప్పుకునేందుకు నాకేం ప్రత్యేకతలు లేవు. కానీ ఒక్కటి మాత్రం ఖచ్చితంగా చెప్పగలను.

నేను ఇలా ఉంటే బాగుండును అని ఊహించుకున్న కుటుంబం ఇపుడు నా కళ్ల ముందుంది. అంతే.

అమృత మాటలకు శారద కాసేపు ఊరుకుంది.

''నువ్వు చూస్తున్నంత స్వర్గం కాదు అమృతా ఈ కుటుంబం. ఒకరకంగా నరక ద్వారాల్లోంచి ఇపుడిపుడే స్వర్గంలోకి వస్తున్న వాళ్లం. ఆ పుణ్యం మాత్రం మృత్యుంజయగారిదే''

అమృత మాట్లాడలేదు.

కథ ఎటు తిరిగి ఎటువచ్చినా అతని దగ్గరే ఆగిపోతోంది. తప్పదు.

శారద మాట్లాడడం మొదలెట్టింది.

మా నాన్నగారు తాలూకాఫీసులో యూడిసి క్లర్కుగా రిటైరయ్యారు ఈమధ్యనే.

మేం ముగ్గురక్కచెల్లెళ్లం. నేను, ప్రీతి, రమ, ప్రద్యుమ్న మా ఇంటి మగపిల్లవాడు.

ఉలిక్కిపడింది అమృత.

ప్రద్యుమ్న అంటే??

మృత్యుంజయగారి ఆశ్రమంలో మీరు చూసే వుంటారు తెల్లగా, పొడుగ్గా, కళ్లజోడు, కాలు కాస్త కుంటుతుంటాడు.

''చూశాను''

అమృతకు అతని రూపం గుర్తొచ్చింది.

మాకు ఈ పాతకాలం ఇల్లు తప్ప ఆస్తిపాస్తులేం లేవు. మా నాన్నగారి ఉద్యోగం తప్ప జీవనాధారంలేదు.

ప్రద్యుమ్న నా తర్వాత వాడు.

వాడు యమ్ఏ గోల్డు మెడలిస్టు. చాలా ఏళ్లక్రితం ఉద్యోగాలకోసం విసిగివేసారి పోయాడు.

ఆవేశంలో ఒకసారి ప్రాణం విసుగెత్తి పాదం విరిచేసుకున్నాడు, ఆ రకంగానైనా వికలాంగుల జాబితాలో ఉద్యోగం వస్తుందని''

శారద కళ్లు తుడుచుకుంది.

''కానీ కుంటుతూనైనా కాలు నడవడానికి

పనికొస్తోంది. కనుక అది అవకరం కాదన్నారు.

ముప్పైఏళ్లొచ్చి కట్నాల కోరల్లో చిక్కి పెళ్లి కాని కన్యను నేను. బి.ఎ. చదివి టైపు నేర్చుకున్నాను.

రమ ఇంకా చదువుతోంది.

ప్రీతి నా పెద్ద చెల్లెకి ఆశలెక్కువ. అచ్చం మీలా ఎంతో అందమైన పర్సనాలిటీ.

దానికితోడు ఫాషన్లు.

ఎపుడూ స్నేహితులు.

షికార్లు...

తప్పితే పుస్తకాల పురుగులా నవలలు చదవటం. దానికి జీవితమంటే అందమైన రాజకుమారుడులాంటి వరుడు తనని కట్నంలేకుండా చేసుకుని ఆకాశమేఘాలమీద తీసుకుపోతాడని.

అది చదివే పుస్తకాలనిండా అవే ఊహలు.

దాదాపు అది ఊహల్లోనే బతికేది ఎక్కువగా.

అందుకే గొప్పింటి కుర్రాళ్లతో తెగ స్నేహాలు చేసేది. పెద్దవాళ్లనే ఎదిరించేది.

అన్నయ్య అంత రేంకు తెచ్చుకుని ఎంత గొప్ప జీవితం గడుపుతున్నాడు అని ఎద్దేవా చేసేది.

నువ్వూ నాలాగే తిరిగితే కనీసం కట్నం లేకుండా నీకు పెళ్లెప్పుడో అయిపోయేది అని హేళన చేసేది.

నాన్నగారు చేసే ఉద్యోగం దానికెంతో తలవంపులుగా ఉండేది.

అప్పట్లో మామ్మ నిన్ను పెద్ద చదువులు చదివించివుంటే నీకు నిరుద్యోగ సమస్య అప్పట్లో లేదుకనుక ఇవుడే బ్రాంచి మేనేజరువో అయుండేవాడివి. ఇదేం ఉద్యోగం అనేది.

అదేమిటో... దాన్ని మెత్తగా మందలించేవాళ్లం తప్ప గట్టిగా ఎవరూ చివాట్లు పెట్టలేకపోయేవాళ్లం.

దాని ముఖంలో పసిపాప అమాయకత్వం. లేత గులాబీల సౌకుమార్యం.

మగ పిల్లలు దాని చుట్టూ తెగ తిరిగేవారు.

మేం దాని గురించి పట్టించుకునేకంటే మా ముందు పెద్ద సమస్య ఒకటి వచ్చిపడింది

అది-

ఆర్నెల్లలో నాన్నగారి రిటైర్‌మెంటు. ప్రద్యుమ్నకు ఉద్యోగం రాలేదు. కనుచూపుమేరలో వస్తుందన్న ఆశలేదు. నా పెళ్ళి, ప్రీతి విచ్చలవిడితనం, అన్నయ్య నిరుద్యోగంకంటే భయంకరమైన సమస్య అది.

నేను చేసే చిన్న ఉద్యోగపు జీతంరాళ్ళతో ఇంతమంది ఎలా బతకడం?

అహోరాత్రులు నాన్నగారు ఈ ఆలోచనతోనే పిచ్చివారయిపోయారు. అలాంటి దురదృష్ట స్థితిలోనే ఒకరోజు అమ్మకి ఉత్తరం రాసిపెట్టి వెళ్ళిపోయారు.

యశోదా! ఇన్నాళ్ళకు మనకు ఆణిముత్యాల్లాంటి నలుగురు బిడ్డలు అని ఎంతో పొంగిపోయేవాడిని. కాని వాళ్ళ విలువ ప్రపంచానికి తెలిసే అవకాశం మన పేదరికం కప్పేసింది.

బాబు ప్రద్యూ ఎంత తెలివైనవాడు. వాడు గోల్డ్‌మెడల్ తీసుకున్నరోజున ఎంత సంబరం. పుత్రుడు కల్గినపుడు కాదు, ఆ పుత్రుడు ప్రయోజకుడైనప్పుడు తండ్రికి నిజమైన సంతోషం కలుగుతుంది, అనేది బాబు నిరూపించాడు. కాని ఆనాడు ఎంత సంబరపడిపోయామో వాడు నిరుద్యోగ సమస్యతో విసుగెత్తిపోయి తనకుతానే పాదం విరిచేసుకుని అవకరం సృష్టించుకున్నరోజున అంతకంటే ఎక్కువ ఏడ్చాం.

శారదను చూస్తుంటే గుండె తరుక్కుపోతుంది. దానీడు పిల్లలంతా ఇద్దరుబిడ్డల తల్లులు. పైకి చెప్పకపోయినా దాని గుండెలో తుల్లో నిర్వేదం నాకు తెలుసు. ప్రీతి పిచ్చితల్లి. వ్యామోహంలో దాని జీవితం ఎటు కొట్టుకుపోతుందో?

రమ బతుకుమీద తీపిఆశతో బతుకులో ఇవుడిపుడే అడుగుపెట్టిన పిల్ల. ఉన్నంతలో ఏదో కలో గంజో తాగి బతుకుతున్నాం. కాని ఆర్నెల్ల తర్వాత మీరంతా తిండికి మొహంవాచి నిస్త్రాణతో బతకడం నేనెలా చూడగలను? ఎంతో ఆలోచించి నేనీ నిర్ణయానికి వచ్చాను. అసలు నాకీ ఆలోచన వెంకటేశం చావుతో వచ్చింది.




వెంకటేశం నా కొలీగ్. దాదాపు నా వయసే. స్కూటర్ ప్రమాదంలో రెండునెలలక్రితం చని పోయాడు.

యశోదా! అతని కొడుక్కి మా ఆఫీసులోనే కంపాషనేట్ గ్రౌండ్స్‌లో ఉద్యోగమొచ్చింది.

వెంకటేశం పోయినందుకు గోలుగోలుమన్న ఆ కుటుంబం నిశ్చింతగా ఇపుడు పట్టెడన్నం తింటోంది.

అందుకే ఎంతో ఆలోచించాను. నేను పోతే తప్పకుండా మా ఆఫీసులో ప్రద్యుమ్నకి ఉద్యోగం వచ్చి తీరుతుంది. నేను సర్వీసు చేసినా కేవలం ఆర్నెల్లు మాత్రమే. వాడయితే పర్మెనెంటుగా ఈ కుటుంబానికి ఆధారమవుతాడు. నేనెలాగూ రాలిపోబోయే పండునే. అందుకే వెళ్ళిపోతున్నాను. దయచేసి ఈ ఉత్తరం ఎవరికీ చూపించకు. పిల్లలు జాగ్రత్త. ప్రద్యుమ్న మిమ్మల్నందర్నీ అపురూపంగా చూసుకుంటాడనే నమ్మకం నాకుంది. మార్నింగ్ వాక్‌కి వెళ్ళి ప్రమాదంపాలయ్యాడు అనుకుంటారు జనం.

నన్ను తప్పక ఏ వాహనమో కరుణించకపోదు. నన్ను క్షమిస్తావుకదూ! బిడ్డల క్షేమమే నా ఆనందం.

-సుబ్రహ్మణ్యం

ప్రద్యుమ్న ఏ స్నేహితుడి ఇంట్లో పడుకున్నాడో ఆరోజు ఇంట్లోలేడు.

ఇంక చూడు అమృతా మా పరిస్థితి. అమ్మ విరుచుకుపడిపోయింది. మేం ఉత్తరం చూసేసరికి ఏడయిపోయింది. ఎందుకంటే నాన్న మార్నింగ్‌వాక్‌కి వెళ్ళి ఆరున్నరకి తిరిగి వస్తుంటారు రోజూ. రాగానే పాలు అడుగుతారు. అప్పుడపుడే మా ఇల్లు మేల్కొంటుంది. నాన్న లేవకపోయేసరికి ఏడుదాకా నిద్రపోయాం అంతా ఆరోజు. లేవగానే అణుబాంబులాంటి విస్ఫోటనం.

అమ్మదగ్గర రమనుంచి- నేను ఆ చెదిరిన జుట్టు, నలిగిన చీరతోనే రోడ్డుమీద వేగంగా నడుస్తుంటే అంతా ఏమనుకుని వుంటారో నేనూహించగలను.

నాన్నగారు నడిచే ప్రదేశాలంతా ఎంత తిరిగినా ఆయన కనిపించలేదు. నాన్న స్నేహితులిళ్ళకి తిరిగాను. ప్రద్యుమ్న కూడా రోజంతా గాలిస్తూనే వున్నాడు. కాని నాన్న కనిపించలేదు సరికదా ఆయన దేహం కూడా దొరకలేదు. ఇంట్లో శ్మశాన నిశ్శబ్దం. అమ్మ పచ్చి గంగ ముట్టలేదు. ఒక్కసారి వందేళ్ళు పైబడినదానిలా అయిపోయింది. ఆరోజు రాత్రి ఎనిమిది గంటలకు మా గుమ్మంముందు కారాగింది. కాని మాలో ఎవరికీ చలనం కలగలేదు.

నాన్నగారిని గుమ్మంలో చూసి ఒక్కసారి సంచలనం, గోలగోల. అమ్మకి ఫిట్ వచ్చింది ఆనందం తట్టుకోలేక. నాన్న మౌనంగా తల నిమురుతూ ఉండిపోయారు.

"సుబ్రహ్మణ్యంగారూ! మరి నాకు సెలవా?"

అంతవరకూ మృత్యుంజయగారిని మేమెవరం గమనించలేదు.

"అమ్మా శారదా! నా కళ్లు తెరిపించిన మహానుభావుడితడేనమ్మా! చిన్నవాడైనా చేతులెత్తి నమస్కరించదగినవాడు. కాని ఆయుక్షీణం కనుక వెయ్యేళ్ళు వర్థిల్లమని ఆశీర్వదిస్తున్నాను బాబూ"

నాన్నగారి కళ్ళు వర్షిస్తున్నాయి. తర్వాత నాన్నగారు చెప్పారు. తను మృత్యుంజయ కారుకిందే పడబోయారట.

శారద ఆగింది ఒక్కక్షణం.

సుబ్రహ్మణ్యంగారు ఎపుడొచ్చారో అక్కడో వాలుకుర్చీలో పడుకున్నవాళ్లు కాస్తా చిన్నగా దగ్గారు.

అమృతకు అదంతా ఇప్పుడు కళ్ళముందు జరుగుతున్నట్టనిపించింది. తెలియకుండానే ఆమె కళ్ళూ వర్షిస్తున్నాయి.

సుబ్రహ్మణ్యంగారు చెప్పడం మొదలెట్టారు.

"అమ్మా అమృతా! అంతా మనచేతిలో ఉందని విర్రవీగడం ఎంత బుద్ధిమాలినతనమో నాకారోజే అర్థమయింది. అంతా నామార్గంలోనే ఆలోచిస్తారనుకున్నాను. కాని వేరేవిధంగా జరిగే అవకాశం ఉందని ఆలోచన రాలేదు. అదిగో! నాకా గీతా పరమార్థం బోధించినవాడు మృత్యుంజయుడు. చచ్చిపో

వాలనే నా పట్టుదల, దానివలన నే కోరుకునే ప్రతిఫలం విని కొంచెంసేపు అతను మాట్లాడ లేదు. కాని 'మాస్టారూ! నాతోరండి' అంటూ వెంటనే బయలుదేరదీసి నన్నో యింటికి తీసికెళ్ళాడు. ఆ ఇంట్లోంచి బయటికొస్తున్నా డు ఒకాయన. ఎలాగ? చంకల్లో రెండు కర్ర లతో. వాళ్ళను పరిచయం చెయ్యకుండానే కారు ముందుకు పోనిచ్చాడు.

"మాస్టారూ! మీకొచ్చిన ఆలోచన మీకు మాత్రమే వచ్చిన మొదటి ఆలోచన కాదు. ఇంచుమించు ఆయనదీ మీలాంటి కథే. ఈ ప్రపంచంలో సుబ్రహ్మణ్యాలు బోల్డుమంది.

లారీకింద పడి ప్రాణత్యాగం చేసుకుంటే కొడుక్కి ఉద్యోగం వస్తుందనుకున్న ఆయనకు విధి విధించిన శిక్ష.

ఆయన రెండుకాళ్ళూ నుగ్గునుగ్గయిపో యాయి. లారీవాడు పారిపోయాడు. చివరకు ఆయనను ప్రాణాలతో కాపాడుకోవడంకోసం ఆ యిల్లాలు ఉన్న ఇల్లు అమ్మేసింది. కొడుకు విరక్తితో పరారయిపోయాడు. చివరకాయనకు మిగిలింది రెండు ఊతకర్రలు. ఉద్యోగంకాస్తా పోయింది. ప్రస్తుతం తెలిసినవాళ్ళకి నోటరీ ల్లాంటివి రాసి బతుకీడుస్తున్నారాయన.

చెప్పండి ఇంకా మీకు చచ్చిపోవాలనుందా చెప్పండి? ఇటువంటి రిస్కులు లేకుండా సు లభంగా చచ్చిపోయే చిక్కులు బోలెడు చెప్తా ను. ఆ తర్వాత మీ కొడుక్కి ఉద్యోగం ఖాయం. కాని ఒక్కవిషయం. వేరేమార్గంలో ఆలో చించని మీ కొడుకు ఎల్లకాలం ఒకేలా ఉండగలడని ఎలా ఊహించ గలరు?



అతనికీ కోరికలుంటాయి. పెళ్ళవుతుంది. పిల్లలొస్తారు. కుటుంబం పెరుగుతుంది. అప్పుడు మీ భార్య స్థితి...? దాదాపు నలభై ఏళ్ళు మీ సహధర్మచారిణిగా మిమ్మల్ని సేవించినందుకు ఆవిడకి మీరిచ్చే బహుమతి ఇదా?

ఆయువు లేక అనారోగ్యంతో మీరు చనిపోతే కర్మఫలితం, క్రూర విధి అని సరిపెట్టుకుంటుంది. కాని మీరీరోజున చేసిన త్యాగం ఎల్లకాలం మీ బిడ్డలు గుర్తుపెట్టుకోవాలని ఏముంది? లోకంలో తల్లిదండ్రులపట్ల క్రూరంగా ప్రవర్తిస్తున్న ఎందరు బిడ్డల్ని చూడడంలేదు. కాలమహిమ. పరిస్థితుల ప్రభావం త్యాగాలకు విలువకట్టదు. స్వార్థం పెరుగుతుంది.

అపుడు మీ భార్య గతి ఏమిటి?

అమ్మా అమృతా! నా బిడ్డలు కృతఘ్నులు కాకపోవచ్చు. కాని అలా జరిగే అవకాశముంది అని జీవితంలో ఉదాహరణలను సజీవంగా చూపిస్తూ రోజంతా తిప్పాడు మృత్యుంజయ. అతని రుణం ఎలా తీర్చుకోగలను?

నాకు జ్ఞానోదయం కలిగింది ఆరోజే.

నేను చేసిన పనికి మనస్ఫూర్తిగా ఏడిచాను.

మృత్యుంజయ నా కొడుక్కి ఉద్యోగమిచ్చాడు.

అదీ నాలాంటివాళ్లను కాపాడే ఉద్యోగం.

వాడీరోజు ఎంతో సంతోషంగా ఉన్నాడు.

నాకు ట్యూషన్లు జీవనాధారం చూపించాడు. కానీ నాకారోజునుండే బ్రతకుమీద నిజమైన తీపి కలిగింది. మృత్యుంజయ కోరిన ప్రతిఫలం.

నా ఆయుష్షు.

సంతోషంగా అమ్మేసాను.

కాకపోయినా నేను ముందెప్పుడూ ఆత్మహత్యకి తావివ్వలేను.

జీవితంపట్ల అంతధైర్యం కలిగింది.

ప్రపంచలో నాకంటే ఎన్నో బాధలనుభవిస్తున్న వాళ్లున్నారు. కాని అందరూ ఎందుకు చనిపోవడం లేదు.

అదే జీవిత మాధుర్యం.

దాన్ని చవిచూసినవాడు మృత్యుంజయ.

'బాబాయిగారూ!' అప్పటిదాకా మౌనంగా వింటున్న అమృత నోరు విప్పింది.

'మరి ప్రీతి...'

గాఢంగా నిట్టూర్చాడాయన. దాని అందం, తెలివితేటలు, ఠీవి చూసి అందర్లోకి ఎంతో అదృష్టవంతురాలనుకునేవాడ్ని. కాని దాని వయసు, ఆలోచనలు అన్నీ తప్పుదోవపట్టాయి.

నేను ఇంటికి తిరిగి వచ్చిన వారంరోజులకి ప్రీతి మాయమైంది.

మరో సమ్మెటపోటు మాకు.

అది మైనర్. ఎవరైనా మోసగించి ఉండవచ్చని పోలీస్ రిపోర్టు కూడా ఇచ్చాం.

కాని ప్రయోజనం శూన్యం.

నా భార్య ఆరోగ్యం దిగజారింది.

నేను బ్రతికొచ్చినందుకు సంతోషపడేలోగా కూతురి అదృశ్యాన్ని తట్టుకోలేకపోయింది.

ఒక నెల్లాళ్ళకు ప్రీతినుంచి లెటర్ వచ్చింది.

దానిమీద ప్లేస్, తేదీ, లేదు.

అమ్మా, నాన్నా!

నా గురించి దిగులు వద్దు.

నేను కోరుకున్న అందమైన జీవితం నాకు దొరికింది. కుమార్ నేను ప్రేమించి రహస్యంగా పెళ్ళిచేసుకున్నాం. వాళ్ళమ్మా నాన్నలకు మా పెళ్ళి ఇష్టంలేదు కనుక కొన్నాళ్ళు రహస్యంగా ఉండదలిచాం.

ప్రస్తుతం ఇంకా హనిమూనే.

కుమార్ కోటీశ్వరుడు.

ఈ నెల్లాళ్ళలో నాకెన్ని నగలు, చీరలు కొన్నాడో చూస్తే మీకు కళ్ళు తిరుగుతాయి.

నేనానందంగా ఉన్నాను.

నాకు పద్దెనిమిది దాటడానికి ఇంకా నెల్లాళ్లు ఉంది. అపుడయితే మరి మా పెళ్ళి రద్దుకాదు.

అజ్ఞాతవాసం తెలిపోతుంది.

మన వూళ్ళోనే పెద్ద భవంతి కొంటాం.




మీ అల్లుడు మీ అందరికీ నమస్కారాలు చెప్పమన్నారు.

నేను వచ్చేస్తే శారదక్క పెళ్ళికూడా చేసే య్యగలను.

నాకిపుడు ఏలోటూలేదు.

అన్నయ్యకు కూడా కుమార్ బిజినెస్‌లో మంచి షేర్ ఇస్తాం.

'ప్రీతి'

ప్రస్తుతానికి ప్రీతి ఎక్కడో క్షేమంగా ఉందని తెలిసి కుదుటబడ్డాం.

కాని యశోద బెంగ తీరలేదు.

ప్రీతి స్నేహితులను అందరినీ విచా రించినా ఈ కుమార్ ఎవరో ఎవరూ చెప్పలేక పోయారు.

మళ్ళీ ప్రీతినుంచి లెటర్స్ లేవు.

రోజూ నా భార్య ప్రీతి వస్తుందని ఎదురు చూస్తూనే వుంటుంది.

సుబ్రహ్మణ్యంగారి కంఠం గాద్గదికం కా వడం తెలుస్తోంది.

"బాబాయిగారూ! ఊరుకోండి. ప్రీతి తప్పక తిరిగివస్తుంది"

'ఆ ఆశతోనే బ్రతుకుతున్నాం అమృతా! అది మోసపోయి ఉన్నా ఏ స్థితిలో ఉన్నా మా ప్రీతి మాక్కావాలి. అదంటే అందరికీ ఎంత ప్రాణం అని. ప్రద్యుమ్న అయితే వారంరోజు లు భోజనం చెయ్యలేదు. నా దగ్గరే దానికి చనువెక్కువ. నిన్ను చూస్తే అచ్చం మా ప్రీతి తిరిగి వచ్చినట్టే వుంది మాకు.

శారద అంది జీరబోయిన గొంతుతో.

దాని ఊహలన్నీ నాతో పంచుకునేది.

ఎలాంటి కలలు, ఊహలు దానికి.

కనీవిని ఎరగనివి.

కాని అది వెళ్ళిపోయాక దాని ఆచూకీ ఏమైనా తెలుస్తుందేమోనని దాని బట్టలు, పుస్తకాలు వెతుకుతుంటే తెలిసింది.

ఆ ఊహలన్నీ దానివి కావని.

శారద ఆగింది.

"అంటే?" అమృత ప్రశ్న.

"దాని దగ్గరున్న ఆముక్త అనే రచయిత్రి పుస్తకాల్లో అండర్‌లైన్ చేసినవి చదివాక అర్థం అయింది.

శారద కంఠంలో నిరసన వినిపించి ఉలిక్కి పడింది అమృత.

ఆముక్త... ఆముక్త...

ఆముక్త... అంటే...

తన కథలు నవలలు చదివే... ప్రీతి అలా తయారయిందా?

శారద కంఠం తీవ్రంగా ఉంది.

'ఆడో మగో తెలియదుగాని ఆముక్త ఎంద ర్ని తప్పు ద్రోవ పట్టించి ఉంటారో ఆమెకి తెలిసివుంటే తిరిగి కలం పట్టదు. ప్రీతి వయ సులోని పిల్లలకు అవి అద్భుత లోకాల్ని సృ ష్టించి ఆనందాన్ని కలిగించినా వాళ్ళను అధో గతికి దిగజార్చేవి కూడా అవే. పెద్దవాళ్ళను ఎన్నిరకాలుగా మోసం చేసి ట్రిక్కులతో ప్రియులను కలుసుకోవచ్చో, ఎన్ని అబద్ధాలు చెప్పొచ్చో, దొరక్కుండా ఎలా పెళ్ళిళ్ళు చేసుకో వచ్చో, ఆ పుస్తకాలు నేర్పుతాయి' అని చదివిన తర్వాత అనిపించింది. ప్రీతి అంతకుముందు ఇంట్లో మాతో చెప్పే సాకులు, ట్రిక్స్ అవేనని.

కాని ఏంలాభం. చేతులు కాలాక ఆకులు పట్టుకుని విలపిస్తే??

శారద కంఠంలో ఒకరకమైన కసి.

నాకే కనుక ఆ ఆముక్త ఎదురయితే.

రెండు చెంపలూ ఎడాపెడా వాయించి, "సారీ అమృతా ఇంక పడుకో, చాలా ఆలస్యమ యింది"

శారద కంఠంలో కాఠిన్యం మారి మృదువుగా అయింది.

కాని అమృత మాత్రం షాక్ నుంచి తేరుకో లేదు.

"ఆముక్త"

తన చెల్లెలి జీవితం మలుపు తిరిగేందుకు కారణమయిన ఆముక్త తనేనని తెలిస్తే శారద ఏం చేస్తుంది?

ముఖాన ఖాండ్రించి ఉమ్మేస్తుంది.

అమృతకు వాళ్ళంతా తనని దుమ్మెత్తిపోస్తు న్నట్టు, శాపనార్థాలు, పెడుతున్నట్టు, వారంతా

కార్చిన కన్నీరు వరదలై, ఆ వరదలో తను కొట్టుకుపోతున్నట్టు, ఉక్కిరిబిక్కిరయి పోతు న్నట్టు, ఆధారంకోసం ఆమె చేతులు గాలిలో కొట్టుకుంటున్నాయి. ఎక్కడ్నుండో ఒక భయంకరాకృతి వికటాట్టహాసం చేస్తోంది.

'రా నీకు ఊతనిస్తాను. రా... రా... రా...

ఆ చేతులకి పొడవైన గోళ్ళు...

అవి కత్తుల్లా తనను చీల్చేందుకు వస్తున్న ట్టు...

నా పేరు తెలుసా?

అజ్ఞాతి...

అజ్ఞాతి...

ఆమె మనసు పొరల్లో ఆ పేరు???

ఆ ముఖం వికృతంగా ఉంది.

కెవ్వున అరిచింది అమృత.

గొంతు పొడారిపోయి మెలకువ వచ్చేసింది అమృతకు. తెల్లారిపోతోంది.

ప్రక్కన శారద, రమ ఇంకా నిద్ర లేవలేదు.

వంటింట్లో చప్పుడవుతోంది.

సుబ్రహ్మణ్యంగారు మార్నింగ్ వాక్‌నుంచి తిరిగి వచ్చినట్టున్నారు.

"ఏమ్మా అమృతా సరిగ్గా నిద్రపట్టలేదా? రాత్రంతా కదుల్తూనే వున్నావు. కొత్తచోటు కదా! అదిగో మీ పిన్ని అపుడే కాఫీ తెచ్చేస్తోంది"

అమృతలో ఏదో అపరాధభావన, వీళ్ళ ఆప్యాయత, అనురాగం పొందే అర్హత తనకు లేదు.

తను చేసిన పాపం తెలియక తనపట్ల ఎంత అభిమానం చూపిస్తున్నారు?

ముందురోజు స్వర్గంలా అనిపించిన ఆ పరిసరాలు అమృతకు ఊపిరాడకుండా చేస్తు న్నాయి.

తను త్వరగా వెళ్ళిపోవాలి.

అవును వెళ్ళిపోవాలి.

"వెళ్ళి ముఖం కడుక్కోమ్మా అమృతా!"

యశోదగారు అమృత భుజంమీద చేయివే సేవరకు తను అలా కూర్చునే వుందని తెలి యలేదు.

తను లోపలికి వెళ్తూంటే వినిపించాయి అవిడ మాటలు- "అదేమిటి ఆ అమ్మాయి మొహం అలా వాడిపోయివుందే! నిన్న చాలా ఉత్సాహంగా ఉంది"

"రాత్రి చాలాసేపు కబుర్లతో నిద్రలేదు యశోదా! నువ్వు మాత్ర వేసుకుని నిద్రపో యావు. మేం పన్నెండు దాటేవరకు అలాగే వున్నాం"

"నువ్వు త్వరగా టిఫిన్ చేసేస్తే మేం ఆశ్రమానికి బయలుదేరతాం"

"యశోదగారి మొహంలో దిగులు"

"ముందు అమ్మాయికంటే మీకే కంగారుగా వున్నట్టుంది"

"మృత్యుంజయతో చెప్పకుండా బయటికి తీసుకురావడం ఆశ్రమ నియమాలకు విరు ద్ధం యశోదా!"

"అమృత చిన్నపిల్ల కాదుగా తప్పిపో యేందుకు. అదీగాక అతను ఊళ్ళో లేడు కూడా"

"అయినా బాధ్యత నాదే కదా!"

"సరేలెండి"

ఎంత మామూలుగా ఉండేందుకు ప్రయ త్నించినా అమృత ఉండలేకపోతోంది.

శారద, రమ అమృతను అరక్షణం వదల్లే దు.

రాత్రి ఉండిపోవాలనుకోకపోవడంవల్ల మారు చీర తెచ్చుకోలేదు అమృత.

శారద ఇస్త్రీచీర తీసి బాత్‌రూం దగ్గరపె ట్టింది.

అమృతకు మొహమాటంగా ఉంది.

తప్పనిసరిగా స్నానం చేసి ఆ చీర కట్టింది.

యశోద, సుబ్రహ్మణ్యంగార్లు అలాగే చూస్తూ ఉండిపోయారు.

"మరేం అనుకోకు అమృతా! ఇది ప్రీతి చీర. నా చీరలంత ఖరీదైనవి కాదు. ఆ చీరలో నువ్వు ప్రీతికి ప్రింటులా ఉన్నావు"

శారద కళ్ళనిండుగా చూసుకుంది.

"అమృతక్కా నువ్వు ఆదివారం తప్పక రావాలి. శారదక్క కూడా ఇంటిదగ్గరే వుంటుంది" రమ అంది.

"అలాగే చెల్లెలా" రమ చెంపలు పుణి




కింది అమృత.

శారదకు కూడా ఆఫీసు టైమవడం మూలాన టిఫినవగానే వాళ్ళతో కలసి బయలుదేరింది.

కనుచూపు మేర దాటేవరకు యశోదగారూ, రమా చేతులూపుతూనే ఉన్నారు.

రమ ఇచ్చిన సన్నజాజుల మాల చేతిలోనే ఉండిపోవడం చూసి తనే తీసుకుని తలలో పెట్టింది శారద.

శారద బస్సురాగానే వెళ్లిపోయింది.

'మనం ఆటోలో వెళ్దాం అమ్మా! ఎండెక్కిపోయింది''

''మీ యిష్టం''

ఆశ్రమం గేటుదగ్గరే ఎదురయ్యాడు ప్రద్యుమ్న.

''బాస్ వచ్చేసారు నాన్నా! రాత్రి రెండయింది''

సుబ్రహ్మణ్యంగారు కొన్త కంగారువడ్డట్టు కనిపించారు కాని అమృతమాత్రం 'అలాగా' అని ఊరుకుంది.

ప్రద్యుమ్న బయటికి వెళ్ళిపోయాడు.



అమృత ఆఫీసురూంలోకి అడుగుపెట్టేసరికి మృత్యుంజయ ఎవరో నడివయస్సుదాటిన స్త్రీతో మాట్లాడుతున్నాడు.

ఆవిడను చూస్తూనే ఉలిక్కి పడింది అమృత.

తెలుపు నలుపు కలగాపులగం అయిన జుట్టు.

బూరెలా ఉబ్బిన ముఖం.

నిప్పులాంటి సింధూరపు బొట్టు.

మిడిగుడ్లు... ఆ చూపు అలాగే వుంది.

అంత లావు మనిషిని ఈ మధ్య కాలంలో చూడలేదు.

పెద్ద బాన పొట్ట.

గర్భవతి అవడానికి ఆవిడ వయస్సు సహకరించదు.

లావు పెదాలు.

పొడుచుకొచ్చిన పళ్ళు.

ఒక్కమాటలో చెప్పాలంటే పిచ్చి భూతంలా వుంది.

ఎక్కడ చూసింది తను.

ఆ ముఖం ఎంతో పరిచయమైన ముఖం.

పగలూ రాత్రి తనను వెన్నాడే ముఖం.

అమృత మనసులో ఆ రూపం యొక్క పేరు స్ఫురించేలోగా ఒక బక్క పలచని మనిషి లోపలికి వచ్చాడు.

''వినోదినీ! డాక్టర్‌గారు బయట కారులో వెయిట్ చేస్తున్నారు. పోదాం పద''

వినోదిని లేచింది చిన్నసైజు పర్వతంలా

ఆ నడక కూడా చిత్రంగా ఉంది.

భారీకాయుడెవడో పెద్దపెద్ద అంగలు వేస్తున్నట్టుంది.

''డాక్టర్, మేం వెళ్తొస్తాం. మిమ్మల్ని డిస్టర్బ్ చేసినందుకు క్షమించండి'' ఆ బక్కపలచని వ్యక్తి నమస్కరించాడు.

''మళ్ళీం వస్తాం మృత్యుంజయగారూ!''

మృదుమధురమైన ఆమె కంఠం విని మరో సారి ఉలిక్కిపడిన అమృత మనసులో అనుమానం ధృవపడిపోయింది.

శరణాలయంలో స్కూలు టీచర్.

కాని అప్పుడింత లావు ఉండేది కాదు.

చూపు మాత్రం మారలేదు.

''రండి అమృతా కూర్చోండి''

అపుడు చూసింది అమృత మృత్యుంజయ వైపు.

మనిషి చాలా నలిగిపోయినట్టున్నాడు.

తెల్లగా పాలిపోయినట్టుంది ముఖం.

రాత్రి ప్రయాణపు అలసట తగ్గినట్టులేదు.

జబ్బుపడిన మనిషిలా వున్నాడు.

కాని పెదాలపై అదే చిరునవ్వు మనోహ రంగా. "బాగున్నారా?" సుబ్రహ్మణ్యంగారి కుటుంబం ఆప్యాయతానురాగాల నిలయం. మీకు బాగా నచ్చివుంటుంది. యశోదమ్మగారు మిమ్మల్ని వదిలి ఉండరు. ఎందుకంటే మీ రు...

మృత్యుంజయ మాటలేవీ ఆమె తలకెక్క డంలేదు.

ఆమె ఆలోచన వినోదిని టీచర్మీదే ఉంది.

"ఆవిడ మీకెలా తెలుసు?"

"ఎవరు ఇవుడు వెళ్ళినామె...?"

అమృత ప్రశ్నల్లో ఆదుర్దా-

"ఆవిడ భర్త ఆమె ఆయుష్షు నాకమ్మేశా డు"

ఆ సమాధానానికి బిత్తరపోయింది అమృత.

"అంటే ఈవిడ ఆత్మహత్య చేసుకోబోతే... రక్షించబడిందా? మనుమలను బ్రతికుండ గానే పీక్కు తినగల ఆవిడకి ఆత్మహత్య చేసుకోవలసిన అవసరం ఏమిటి?"

లోపలనుకోబోయి పైకే అంది అమృత.

"ఆవిడ మీకూ తెలుసా?"

"తెలును... శరణాలయంలో టీచర్గా చే సేది"

నిట్టూర్చాడు మృత్యుంజయ.

"ఆవిడకున్న భయంకరమైన జబ్బు, శా డిజం"

"తెలును... శరణాలయంలో నాలాంటి ఎంతోమంది చిత్రవధలనుభవించేవాళ్లం. అసలు పిల్లలను అందులోనూ అందమైన పిల్లల్ని అమాయకంగా ఉండే పిల్లల్ని చూస్తే ఆవిడకెందుకు కిట్టదో ఆ వయసులో మాకు తెలీదు"

"మీకే కాదు చాలారోజుల వరకూ ఆమె భర్తకే తెలీదు. అన్నగారి కూతురు అనే మమకా రంతో తన కొడుక్కి చేసుకున్న మేనత్తను చీల్చి చెండాడేది. ఆవిడ భరించలేక కాశీ వెళ్లిపోయి తిరిగి రాలేదు.

స్కూలు టీచర్గా పనిచేసినపుడు కూడా అందరిమీద అధార్టీ చెలాయించినట్టు మాట్లా డేదట. అధికారుల దగ్గర మాత్రం ఆమె మధురమైన కంఠంతో సౌమ్యంగా మాట్లాడి బుట్టలో వేసేది. ఆవిడమీద కంప్లయింటు చేసే సాహసం ఎవరూ చెయ్యలేదు.

ఈవిడ కారణంగా సహోద్యోగిని ఆత్మహ త్య చేసుకుని చనిపోయిందట. మృ త్యుంజయ మాటల్లో విచారం.

అమృతకు గుర్తొచ్చింది.

"తరుణ టీచర్ అందంగా లేకపోయినా ఆమెలో పిల్లలపట్ల ఎంత వాత్సల్యం ఉండేది. ఆవిడకి వారంరోజుల్లో పెళ్ళి అనగా ఎందుకో చచ్చిపోయింది"

"అవును తరుణగారు చాలా సెన్సిటివ్ పర్సన్. మీ బావకు పెళ్ళయిన ఆర్నెల్లలో నీమీద మోజు తగ్గి నువ్వందంగా లేవని గమనిస్తే పాపం నీ బతుకు అడవి కాచిన వెన్నెల కాదా, ఆలోచించి మరీ పెళ్లాడు అందిట ఈ వినోదిని లేనిపోనివన్ని ఊహించు కుంటుందని తెలిసీ. మధురమైన కంఠం వినోదినికి వరం, ప్రజలకు శాపం. ప్రాణం తీసే అబద్ధమైనా వచ్చి నిజంలా పలికిస్తుందా స్వరం. అంతే తరుణ ఉరేసుకుని చనిపో యిందిట.

తరుణ ఎంతో మంచి కాండక్ట్ కలిగిన మనిషి. పైగా చిన్నప్పట్నుంచే ప్రేమించి పె ళ్ళాడదలచిన వ్యక్తి ఎందుకు చనిపోయిందో తెలియక ఆ బావగారు కూడా భోరున విల పించాడు.

మృత్యుంజయ ఆగాడు.

అమృత అడిగింది.

"వినోదిని ఎందుకలా చేసిందో తెలుసా?"

"తెలిసింది. తన బావ తల్లి బల వంతంమీద తనని చేసుకుని ఇంకా గోపాలకృ ష్ణుడి వేషాలు వేస్తూనే వున్నాడు. తరుణలాంటి అనాకారిని ఆమె బావ ఎంతో ప్రాణంగా ప్రే మించి పెళ్ళాడబోవడమా అని వినోదిని బాధ.

ఇక ఆమె భర్త విష్ణు కూడా వినోదిని




ప్రవర్తన కారణంగానే విముఖుడిగా ఉండేవాడు. తనకెంతో ప్రియమైనది తల్లి. అష్టకష్టాలు పడి తనని ప్రయోజకుడిని చేసింది. కోరి వినోదినిని కోడలుగా తెచ్చుకున్న తల్లి అంటే భార్యకెందుకయిష్టమో తెలియక కాశీప్రయాణం పేరుతో ఆమెను ఇంటినుంచి ఎందుకు వెళ్ళగొట్టిందో తల బద్దలుకొట్టుకున్నా అర్థం కాలేదతనికి. పోనీ తనకి పసిపిల్లలంటే ఇష్టమని తెలిసీ ఫేమిలీ ప్లానింగ్ మాత్రలు మొండిగా మింగే భార్యని చూసి కొన్నాళ్లు నిస్సహాయుడై తరువాత రాటుదేలిపోయి వేరేదార్లు చూసుకునేవాడు.

ఇక ఆ కోపం శరణాలయం పిల్లలమీద చూపేది వినోదిని.

అమృతకో సంఘటన గుర్తొచ్చింది.

శరణాలయం పిల్లల్లో రవీంద్ర అనే కుర్రాడెంతో చక్కగా ఉండేవాడు. లేని తల్లీదండ్రీ అంటే వాడికెంతో మమకారం. ఊహల్లో బతికేవాడు.

ఒకరోజు వాడు బుగ్గలెర్రబడిపోయేలా ఏడ్చేడు తన దగ్గర. ఎంతో బుజ్జగిస్తే చెప్పాడు వెక్కుతూ.

"అమృతా మనమెంతో పాపం చేసామట. అందుకే అమ్మానాన్నలని మన పాపం మింగేసిందిట. వాళ్లు పైలోకాలనుంచి శపిస్తూ ఉంటారట. ఎన్ని జన్మలెత్తినా నాకు అమ్మానాన్న ఉండనే ఉండరట. టీచర్ చెప్పింది"

అధికారులకు రిపోర్టు చేసే వయసుకాదు తమది.

"ఏమిటాలోచిస్తున్నారు. మీరూ బాధితులే కదా అమృతా!"

"ఇదంతా మీకెలా తెలుసు" అని మృత్యుంజయని అడగలేదు అమృత. సర్వే చేయించి ఉండాలి. కాని అన్ని వివరాలు పుట్టుపూర్వోత్తరాలతో రాబట్టాలంటే ఎంత శ్రమ.

"ఇంతకీ ఆవిడ ఇక్కడికెందుకొచ్చింది?" అమృత కంఠంలో రవంత కోపం.

"ఆవిడక్కి ట్రీట్‌మెంటు ఇప్పిస్తున్నాం"

"ట్రీట్‌మెంటా?"

"అవును. పసిపిల్లల ఉసురో లేక ఆవిడ వాడిన రకరకాల మాత్రల ప్రభావమో ఆవిడ తల్లి అయ్యే అవకాశం శాశ్వతంగా పోయింది. అప్పట్నుంచీ ఎవరిబిడ్డల్ని చూసినా తృప్తిపడ వలసిందిపోయి మరింత శాడిస్ట్‌గా తయారయింది వినోదిని"

తల్లీబిడ్డల అనురాగాన్ని తెలిపే సినిమాలు చూసి పిచ్చిగా జుట్టు పీక్కునేదిట. అలాంటి సంఘటనలు చూసి వెర్రెత్తిపోయేది.

ఒకసారి పక్కింటి పాపాయిని ఎవరూ గమనించకుండా తీసికెళ్లి నూతిలో పడేసిందిట. ఆ పాపకి ఆయుష్షు ఉండి దిక్కులు పిక్కటిల్లేలా కేకపెట్టేసరికి మొత్తానికి ప్రాణాలతో బయటపడింది. కాని భర్త కళ్ళారా చూడబట్టి అప్పటికి ఆవిడ జబ్బు ముదిరిందని డాక్టర్‌ని సంప్రదించాడు ఆవిడకు తెలియకుండా.

డాక్టర్ నాగరాజ్ నా ఫ్రెండ్. విష్ణుగారు అతన్ని కలిసినప్పుడక్కడే వున్నాను.

నాగరాజ్ విష్ణుగారిని హెచ్చరించాడు.

ట్రీట్‌మెంటు వెంటనే మొదలు పెట్టకపోతే చివరికీ పరిస్థితి ఆత్మహత్యకు ప్రేరేపించవచ్చని ఈలోగా మరో విషయం చెప్పాడు ఆమె భర్త.

ఆమె పొట్ట పెరగడం. ఆమె తను గర్భవతినని ప్రచారం చేసుకోవడం. తలవంపులు కలిగించేలా ప్రవర్తన"

"అప్పుడు నేనే సూచించాను. డాక్టర్‌కి చూపించే మిష అదే. ఆమెనలా ఒప్పించి తీసుకురండని"

"ఆమె నిజంగా గర్భవతా?"

"కాదు- పిల్లలు కావాలనే విపరీతమైన తపనవల్ల గర్భవతి లక్షణాలు కనిపించే అవకాశముంది. ఆ తపనే ఆమె పెర్వర్టెడ్‌నెస్‌కి దారితీసింది. తనకు లేనిది దక్కనిది ఇతరుల కెందుకుండాలని ఆమె ఆలోచన.

అమృత తనకు తెలియకుండానే భారమైన నిట్టూర్పు విడిచింది.

శరణాలయంలో తన చిన్నప్పుడు ఆవిడకి లేని అందం పిల్లలకెందుకుండాలని అలా అందర్నీ హింసించేది. తనకు లేని తల్లిప్రేమ భర్తకెందుకుండాలని అతని తల్లిని

గెంటేసింది. మొత్తానికి మొదట్నుంచీ చివరి వరకూ ఆవిడకున్న జబ్బే అసూయ, అర్థంలేని అసూయ''

''ఆవిడ జబ్బు తగ్గిందా ఇంతకీ''

''కాస్త దార్లోకి వచ్చినట్టే. ప్రస్తుతానికి నాలు గునెలల కిందట మేమూహించినట్టే ఒకానొక తీవ్ర మానసిక ఒత్తిడితో ఆత్మహత్య ప్రయత్నం చేసింది. ఒంటినిండా కిరోసిన్ పోసుకుని- కాని ఇంత ఓపికతో ఆమెను భరించే విష్ణుగారిని అభినందించాలి. కంటికి రెప్పలా ఆమెను అహోరాత్రాలు కాచి ఆమె ప్రయత్నాన్ని భగ్నం చేశాడు. వెంటనే నాగరాజ్ నర్సింగ్‌హోంలో చేర్పాడు. ఒక సామాన్య ఉద్యోగి అంతఖర్చు భరించడం సాధ్యంకాని వని. అందుకే ఆ ఖర్చు నేను భరించే ఒప్పందంమీద ఆమె ఆయుష్షు నాకు అమ్మేడాయన.

కాని...

''ఆమె ఇంకా ప్రయత్నాలు చేస్తూనే వుందా?''

''కాదు. ఆమె మానసికస్థితి మెరుగుపడి మనుష్యుల్లో కలుస్తోంది. పాపలపట్ల ఆమె ప్రవర్తనలో కూడా చాలా మార్పొచ్చింది. నాపట్ల ఆవిడకు అభిమానం నమ్మకం కుదిరాయి.- అందుకే నెలకోసారి అయినా వచ్చివెళ్తుంది. కాని విధి విచిత్రమైంది. ఆమెకి వచ్చిన జలోదరం ముదిరిపోయింది. ఆమె బతికేది కొన్ని నెలలు మాత్రమే. నాగరాజ్ ఇప్పుడే చెప్పాడు''

అమృతకు ఇప్పటిదాకా వినోదినిపట్ల ఉన్న అసహ్యం కోపం మంచులా కరిగిపోయాయి.

అప్రయత్నంగానే ''అయ్యో ఇప్పుడెలా?'' అంది.

''అదే నాకు బాధగా ఉంది. పులిమీద పుట్రలా అన్నీ బ్యాడ్ కేసులే నాకు. ఈ వారం ఏమీ బాగలేదు''

మృత్యుంజయ కంఠంలో కూడా అలసట ద్యోతకమవుతుంది.

''ఏమీ మీరు వెళ్లినచోట కూడా...''

''అవును అమృతా!''

అమృతకెందుకో అతనిమీద విపరీతమైన జాలికలిగింది.

అయినవాళ్ళే నాకెంమకనుకుని స్వార్థాలు పెంచుకునే ఈ కాలంలో ఈతనేం ఆశించి ఇంత కష్టపడుతున్నాడు? డబ్బునాశిస్తున్నాడా?

కీర్తి కోసమా?

లేక ఇంకేదైనా తెరవెనుక కథ ఉందా?

ఏదిఏమైనా ఇతను వెళ్లినచోట దేనికోసమో బాగా దెబ్బతిని వుండాలి.

ప్రేమ కేసు ఏమయినా ఫెయిలయి వుండొచ్చు.

వయసులో ఉన్నవాడు- అందగాడు.

ఎంత దెబ్బతినకపోతే అంత డౌన్ అయిపోతాడు. అమృత ఆలోచనలో ఉండగానే మృత్యుంజయ అన్నాడు.

''అమృతా! మీ సహకారం నాక్కావాలి''

అమృత సమాధానం కోసం ఎదురు చూడకుండా అతనే అన్నాడు మళ్లీ.

''మీ కప్పగించవలసిన బాధ్యత ఒకటుంది. అందుకే ఎంతో త్వరగా రావాలనుకున్నాను. కానీ వీలుపడలేదు''

సమాధానం చెప్పలేదు అమృత.

''అతను చేస్తున్న పనులేమిటో తనకు తెలియదు.

తన అనుమానాలు తనకున్నాయి.

అవి నిజమో భ్రమలో తెలియదు.

ఇలాంటి స్థితిలో తను అతనికి ఎటువంటి మాటా ఇవ్వలేదు.

''మీరు ఉద్యోగంలో చేరవలసిన సమయం ఆసన్నమయింది''

అమృతకి మతిపోయినట్టయింది.

ఉద్యోగమా?

తనావిషయమే మర్చిపోయింది.

''మీకు కొన్ని సంగతులు ఆకళింపు కావాలనే మిమ్మల్నిక్కడ ఫ్రీగా వదిలేశాను

చాలా జీవితాలే తెలిసివుండాలి మీకు''

''అయితే?''

''ముందు వినండి...




ఈరోజు నాకు చాలా బడలికగా ఉంది. కాని తప్పదు. కాలం మనకోసం ఆగదు. ప్రీతి ఫైలు క్లోజ్ చెయ్యాలి. నేను చెప్తాను. మీరు విని వివరాలు నోట్‌చేసి క్లోజ్ చెయ్యండి. నాకు రాసే మూడ్ లేదివాళ. ఓపిక అసలేలేదు''

ప్రీతి పేరు వినగానే అమృత గుండె కొట్టుకుంది వేగంగా.

కొంపదీసి సుబ్రహ్మణ్యంగారి తప్పిపోయిన కూతురు కాదుకదా!

''కాస్త ఆ గ్రీన్‌ఫైల్ తెచ్చుకుని కూర్చోండి అమృతా!''

అతని కంఠంలో అభ్యర్థన.

మౌనంగా లేచి అతడు చూపించిన చోటు నుంచి ఫైల్ తీసింది అమృత.

కుర్చీలో కూర్చుని ఫైల్ తెరవగానే.

''ప్రీతి''

అన్న అక్షరాలు ముత్యాలకోవలాంటి దస్తూరీలో తెలుగు, ఇంగ్లీమల్లో ఎరుపు ఆకుపచ్చ రంగుల్లోకి తీర్చిదిద్ది వున్నాయి.

''గ్రీన్‌ఫైల్ అనేది మా దృష్టిలో ఆశాజనకమైన కేసు. బతుకు బాగుపడవచ్చనే అవకాశం ఆశ ఉన్న కేసు. కాని...''

మృత్యుంజయ కళ్ళు మూసుకున్నాడు.

కుర్చీలో వెనక్కి వాలాడు.

''ఫైలులో ముందు పేజీలన్నీ మీకు తెలిసినకథే''

''నాకెలా తెలుసు?''

''శారద మీకేం చెప్పలేదా?''

''శారదా! అంటే ప్రీతి...''

విస్తుపోయింది అమృత.

ఆమె చేతిలో ఫైలు జారిపోయింది.

''మీకే ఇలావుంటే ఆ కుటుంబానికెలా వుంటుందో ఆలోచించండి. నిన్నంతా మీరు చూసేవుంటారు. ప్రీతి వేసింది తప్పటడుగు. ప్రీతిది తొందరపాటు చర్య అని అందరికీ తెలుసు. కాని ఏదో ఆశ నాలో కూడా. ఆమె తప్పక తిరిగివస్తుంది అని వింటున్నారా?''

''ఊ!''

''పూర్తిగా వినండి తర్వాత మీ భాషలో రాసి ఫైల్ క్లోజ్ చెయ్యండి''

మృత్యుంజయ ఒకసారి కళ్ళుతెరిచి ఆమెకేసి చూశాడు. అమృత స్థబ్దంగా ఉంది.

ఆమెకెందుకో భయం వేస్తోంది.

అతనేం చేస్తాడో.

చచ్చిపోయిందని చెప్పడుకదా!

అలా జరిగితే. యశోదగారు బతికుంటుందా?

మృత్యుంజయ కంఠం గంభీరంగా సాగిపోతోంది.

''పదిరోజుల క్రితం ఫోనొచ్చింది''

తరంగ నర్సింగ్‌హోంనుంచి ఆ ఫోన్.

ఎవరో స్త్రీ కంఠం.

''మీరు మృత్యుంజయగారేకదూ''

''అవునండీ''

''ప్రీతి అనే అమ్మాయి గురించి మీరు ఫొటోతోసహా ఇచ్చిన ప్రకటన చూసి మీకు ఫోన్ చేస్తున్నాను. ఆ వ్యక్తి మా నర్సింగ్‌హోంలో ఉంది.

ఉలిక్కిపడ్డాను.

''సీరియస్‌గా ఉందా? ఆవిడ ప్రీతేనా? ఇంతకీ మీరెవరు? మీ అడ్రను చెప్పండి''

''మీరు వెంటనే బయలుదేరిరండి'' అని అడ్రను చెప్పింది ఆవిడ.

చివరికి ప్రీతి బొంబాయి చేరిందా? వెంటనే బొంబాయిచేరి అడ్రనుకోసం వెతికాను. ఆవిడ పేరు చిత్ర. తరంగ నర్సింగ్‌హోంలో నర్సు.

ఆవిడ నన్ను నర్సింగ్‌హోంకి తీసుకెళ్లి చూపించిన వ్యక్తిని చూసి ఆవిడకేసి అనుమానంగా చూశాను.

చిత్ర నవ్వింది.

''నాకు తెలుసు. ఈ రూపంలో మీరేకాదు ఎవరూ నమ్మరు.

మీరు వేసిన ఫొటోలాంటి ఫొటో ఆవిడ హేండ్‌బాగ్‌లో ఉంది''

ఆ ఫొటో చూసి బిత్తరపోయాను.

అసలు ప్రీతిని నేను ఎప్పుడూ పరిశీలనగా చూడకపోయినా ఆవిడ రూపం బాగానే గు




ర్తుంది.

పచ్చని పసిమిఛాయ.

పెద్ద సోగకళ్ళు.

సన్నజాజి మొగ్గలాంటి నాసిక.

లక్కపిడతలాంటి ఎర్రనోరు.

శంఖులాంటి మెడ.

చిదిమితే పాలుగారే ముఖం.

పొడవుగా చక్కని పర్సనాలిటీతో మళ్లీ మళ్లీ చూడాలనిపించే రూపం.

ఒక్కమాటలో చాలా అందగత్తె.

కాని ఈ బెడ్‌మీద పడుకున్న ఈమె.

నలభైఏళ్ల మనిషిలా పీక్కుపోయి లోతుకు పోయిన దవడలతో.

లోతు కళ్లతో.

ఒంట్లోని జవసత్వాలన్నీ ఏ పిశాచంచేతో పీల్చబడిన మనిషిలా. ప్రాణంవున్న బొమ్మలా ఉందామె.

ఈమె ప్రీతి మాత్రం కాదనిపించింది. కాస్త రిలీఫ్. అయితే ఆ హేండ్‌బేగ్ ఈవిడ దగ్గర కెలా వచ్చింది?

ఆ ఫొటోలో సుబ్రహ్మణ్యంగారి కుటుంబం.

"ఏమిటీవిడ జబ్బు? ఇక్కడికెవరు తీసుకొచ్చారు"

చిత్ర చెప్పింది.

"ఎయిడ్స్"

నా తలలో భయంకరమైన పేలుడు.

ఆవిడ ప్రీతి అవనీ కాకపోనీ.

ఎంత భయంకరమైన జబ్బు.

ప్రాణాలకు గ్యారంటీలేని జబ్బు.

ఎప్పుడు చచ్చిపోతారో తెలియని జబ్బు.

"ఈవిడ పేరు కేస్‌షీట్ చూసి చెప్పగలరా?"

చిత్రంగా చూసిందామె. ఏమిటీ పిచ్చివాడన్నట్లు.

"ఏమీ అనుకోకండి. నేనీమె తండ్రి సుబ్రహ్మణ్యంగారికి మిత్రుడిని. ఆయన బాగా కావలసిన వ్యక్తి కావడాన దేశంలోని అన్ని న్యూస్‌పేపర్లలోను ప్రకటన వేయించారు. అందుకే ఈమె అవునో కాదో తెలుసుకుని..."

"ఆమె పేరు ప్రీతి అనేవుంది రిజిస్టర్‌లో. ఆ ఫొటోలో ఉన్న రూపంలో కూడా నేను ఈ నర్సింగ్‌హోంకి వచ్చినప్పుడు ఇదివరలో రెండుసార్లు చూశాను. కాని అప్పటికి మీ ప్రకటన రాలేదు.

"అపుడు కూడా ఈ జబ్బుతోనే..."

చిత్ర కాసేపు తటపటాయించింది.

"అబార్షన్స్" అంది చివరకు.

నాకు మతిపోయింది.

చక్కగా పెళ్లి చేసుకున్న వ్యక్తి రెండుసార్లు అబార్షన్ చేయించుకోవలసిన అవసరం ఏమిటి?

ఆమె భర్త కూడా ఉన్నారా?

చిత్ర నవ్వింది. "అబార్షన్స్ ఈ నర్సింగ్ హోంలో చేయించుకునేవాళ్లు మాత్రం కాదు. అయినా ఎవరో వచ్చినవాళ్లు నాకు గుర్తులేదు"

"ప్రీతి కదుల్తోంది"

"ఉండండి. సెలైనిస్తాను. ఆవిడ ఎక్కువ నిద్రపోతూనే వుంటుంది. ఓ గంటో అరగంటో మెలుకువగా వుంటుందంతే.

చిత్ర సెలైన్‌బాటిల్ అమర్చి చేతికి నీడిల్ గుచ్చుతుంటే మూలిగింది ప్రీతి.

బలవంతాన కళ్లు విప్పింది.

ఎదురుగా నన్ను చూసి కనుపాపలు కదిలాయి.

మీరు?

"నన్ను మీరు గుర్తుపట్టగలరా?"

తల తిప్పుకుంది.

"మీ అమ్మగారు యశోదగారు మీకోసం బెంగతో మంచం పట్టారు"

ఆ కళ్లలో విచారం స్పష్టంగా కనిపించింది. కాని తెలియనట్టు ముఖం తిప్పుకోబోయింది.

"ఆగండి- మీరెంత నటించినా మీరు ప్రీతి అని నాకు తెలుసు. మీ బేగ్‌లోని ఫొటో చూశాను"

ఆమె వెక్కివెక్కి ఏడుస్తోంది.



ఆమె తలపై నా చెయ్యి వేశాను ఓదార్పుగా.

ఆ స్పర్శ ఆమెకేమనిపించిందోగాని నాకు మాత్రం ఓ చిన్నారి చెల్లిలా అనిపించింది.

నాకూ అంతులేని దుఃఖం కలిగింది.

ప్రీతి కళ్లలో రవంత ఆశ్చర్యం.

''మృత్యుంజయగారూ! మీరు ఏడుస్తున్నారా? నా కోసం...''

నాకు కాస్త రిలీఫ్‌గా ఉంది.

ప్రీతి దార్లో పడుతోంది.

ఆమె జబ్బు ఏమవనీగాక. ప్రాణాలుండగా ఈ బొమ్మను సుబ్రహ్మణ్యంగారి కప్పగిస్తే వాలు''

కాని నా ఊహ తప్పని తేలిపోయింది.

ఆమె నానుంచి తనవాళ్ల క్షేమసమాచారాలు మాత్రమే తెలుసుకోగోరింది. కాని నాతో వచ్చేందుకు అంగీకరించలేదు.

''ప్రీతీ నీకు కాస్త నెమ్మదించాక బయలుదేరదాం. అంతవరకూ నేనిక్కడే ఉంటాను''

ఎంత చెప్పినా ఆమె ధోరణి మారలేదు.

''వద్దు మృత్యుంజయగారూ! ఈ నిజాన్ని ఇక్కడే సమాధి చెయ్యండి. మా వాళ్లకు ఆత్మ ఘోష కలిగించకండి. శారదక్క గుండెలు పగిలిపోతాయి. అమ్మ చచ్చిపోతుంది. అన్నయ్య ఏడుస్తాడు. వాళ్ల గురించి నేనేనాడూ ఆలోచించలేదు. ఎప్పుడూ నేనూ నా కలల జీవితం తప్ప అటువంటిది నా చరిత్ర చెప్పి శోకం కలిగించి మరింత పాపం మూటకట్టుకోనా? మీరు నాకు మాటివ్వండి. మీరలా ఏడుస్తూంటే మా అన్నయ్యే గుర్తొస్తున్నాడు. శారదక్క తన బట్టల డబ్బులు కూడా త్యాగంచేసి నాకు మంచిబట్టలు కొనేది.

ఆయాసంగా ఆగింది ప్రీతి.

ఆమెకు గత జీవితంలోని ఆప్యాయతానురాగాలు గుర్తుకొచ్చినట్టున్నాయి. అదో లోకంలో ఉన్నట్టుంది.

చిత్ర విభ్రాంతితో చూస్తోంది.

ఈమధ్యకాలంలో ఇంతసేపు మెలకువగా ఉండడం ఇదే మొదటిసారిట.

''నాదో కోరిక తీరుస్తారా?''

''చెప్పమ్మా!''

నా జీవితం ఇలా చిందర వందరగా కావడానికి కారణం నా తొందరపాటు మాత్రమేకాదు. కుమార్‌లాంటి వాళ్లు ప్రపంచంలో ఎందరో కాని... నేనీస్థితికి రావడానికి కారణం. నా అభిమాన రచయిత్రి ఆముక్త...

మృత్యుంజయ ఒక్కక్షణం ఆపాడు.

అమృత గుండె వెయ్యిముక్కలయినట్టయింది.

తన ప్రియమైన పాఠకురాలు కూడా ఇలా...

మృత్యుంజయకు తనే ఆముక్త అని తెలిస్తే ఇలా చెప్పడు.

''వింటున్నారుకదూ!''

''ఊ'' ఆ స్వరంలో జీవంలేదు.

''నా డైరీ బట్టల మధ్యలో ఉంటుంది. బట్టలున్న పెట్టె ఆ నర్సునడగండి. కుమార్ ఎన్నాళ్లీ నర్సింగ్‌హోంకి డబ్బు కట్టాడో నాకు తెలీదు. అసలు నేనెన్నాళ్లు బతుకుతానో కూడా తెలియదు. పసిబిడ్డలంటే అందులో నా రూపురేఖలున్న పిల్లలు కావాలని నాకెన్నో కలలుండేవి. కాని అబార్షన్ చేయిస్తుంటే ఆ గర్భస్తపిండం ఎన్ని శాపనార్థాలు పెట్టిందో ఇదే నాకు తగిన శిక్ష.

ఈ డైరీని మాత్రం ఆముక్తగారి చిరునామాకు అందజేయండి. టీనేజ్‌లో పిల్లలకు ముఖ్యంగా ఆడపిల్లలకు ప్రేమ లోతులుకంటే జీవితపు లోతులు నేర్పమనండి. నా జీవితాన్ని కథగా రాస్తే వేలాదిమంది రక్షించబడతారు. తప్పకుండా ఈ కోరిక తీరుస్తారుకదూ!

ప్రీతికిష్టమున్నా లేకపోయినా సుబ్రహ్మణ్యంగారికి టెలిగ్రామిచ్చి రప్పిద్దామనుకున్నాను. తండ్రిని చూసైనా ఆ పిల్లకు జీవితంపట్ల మమకారం కలుగుతుందేమోనని ఆశపడ్డాను. కాని ఆ రాత్రే ప్రీతి చచ్చిపోయింది.

ఆమె చనిపోయాక ప్రీతికిచ్చినమాట నిలబెట్టకపోతే ఆమె ఆత్మకు శాంతి కలగదనిపించింది. ఈ నిజం ఎప్పటికీ సుబ్రహ్మణ్యంగారి కుటుంబానికి తెలియదు.

అందుకే నేనే అంత్యక్రియలు పూర్తిచేశాను.

నర్సింగ్‌హోం ఫీజు కట్టేశాను.




మృత్యుంజయ కళ్లువిప్పాడు.

ఎదురుగా కుర్చీలో అమృతలేదు.



మృత్యుంజయ కంగారుగా బయటికొచ్చాడు. అమృత తల గోడకు కొట్టుకుంటోంది.

"అమృతా ఏమిటీ పిచ్చిపని?"

ప్రద్యుమ్న ఆమెను బలంగా పట్టుకున్నాడు.

మృత్యుంజయ దవడ కండరాలు బిగుసుకున్నాయి.

"ఆగండి"

అతని కేకకు ఆ గది దద్దరిల్లింది.

"మీకు చనిపోయే హక్కులేదు. మీ ఆయుష్షు నాకమ్మేశారు"

అమృత ఆగిపోయింది.

ఆమె కనుగుడ్లు పెద్దవయ్యాయి.

"అవును. నేనిచ్చిన ఉద్యోగం చెయ్యాల్సిన బాధ్యత కూడా మీకుంది. ఇటువంటి విషయాలలో నేను చాలా కఠినుడిని"

అతనంత పరుషంగా మాట్లాడడం ఎప్పుడూ వినని ప్రద్యుమ్న కూడా తెల్లబోయాడు.

"రండి ఆ ఫైల్ క్లోజ్‌చేసే బాధ్యత మీదే. అసైన్‌మెంటు పూర్తిచేసి చూపించండి"

అమృత మారుమాట్లాడకుండా లోపలికి నడిచింది.

అతడు కలం కాగితాలు ఇచ్చాడు.

ఆమె నిశ్శబ్దంగా తీసుకుంది.

"ఇదిగో ప్రీతి డైరీ. ఇందులో విషయాలు కూడా క్లుప్తంగా పొందువరచండి"

బ్రీఫ్‌కేసునుంచి ఎర్రడైరీ ఒకటి తీసి ఇచ్చాడు. అందుకుంటున్న అమృత చేతులు వణికాయి.

"ప్రద్యుమ్నా వీరన్న నగేష్‌లు మళ్లీ కలిశారా?"

"వారంరోజులుగా కాపేస్తే నిన్న రాత్రి ఫారెస్ట్‌లో కలవగలిగాం బాస్"

"ఏమంటారు. నిర్ణయం మారిందా?"

"వాళ్లు భయపడుతున్నారు బాస్. ఇంకా వాళ్లతో మరో నలుగురు ఉన్నారట. వాళ్లంతా ఆ వృత్తిలోంచి బయటికొచ్చేయాలని కోరుకుంటున్నారట. అయితే ఆ తర్వాత ఎలా వుంటుందోనని భయపడుతున్నారట"

"ప్రద్యుమ్నా వాళ్లింక భయపడాల్సిన అవసరంలేదు. వాళ్లకి మంచిరోజులొచ్చాయి. ఈరోజు పేపర్ చూశావా?"

"చూశాను బాస్. వాళ్లు కూడా ఆ పేపర్ చదవగలిగితే బాగుండును. స్వయం ఉపాధి న్యూస్‌గదూ ఇది చదివితే వారి జీవితం ఒడ్డున పడినట్టే"

"నిరాశాజనకమైన మాటలేమీ వాళ్ల నోటివెంట రాలేదుగా రాత్రి"

"లేదు బాస్. విశ్వం నేను మళ్లీ ఈవారం ప్రయత్నిస్తాం. వాళ్లను కలుసుకుని అన్నీ వివరంగా చెప్తాం"

"భేష్! నువ్వు పోయి రెస్ట్ తీసుకో"

ప్రద్యుమ్న వెళ్లిపోయాడు.

మృత్యుంజయ తేలిగ్గా ఊపిరి తీసుకున్నాడు.

బయటికి రాగానే అక్కడ ప్రద్యుమ్నను చూసి అతని గుండె జారిపోయింది. ప్రీతి విషయం అతడు వినలేదుకదా అని.

కాని అతనిలో ఏమార్పూ కనిపించకపోవడం చూసి మనసు కుదుటపడింది.

అమృత ఇంకా అలాగే స్తబ్దంగా కూర్చుని వుంది.

"అమృతా! మిమ్మల్ని హర్ట్ చేస్తే క్షమించండి. ఇందాక నా కోపం చూసి మీరు

వెంటనే ఇక్కడినుండి వెళ్లిపోవాలనుకుని వుంటారుకదూ!"

ఆమె సమాధానమివ్వలేదు.

జీవితం ఎంత చిత్రమైనది అమృతా. వైకుంఠపాళిలా అనిపిస్తుంది నాకు. ఎదుటివాళ్లు గాయపడితే చూసి ఆనందించాలని మొదటినుంచీ స్వార్థంతో ప్రవర్తించిన మీ వినోదినీ టీచర్ బతుకేమయింది. చివరికి తనే తీవ్రంగా గాయపడి మనశ్శాంతి పోగొట్టుకుని జీవితమే లేకుండా చేసుకుంది. ప్రీతి పెద్దపాము నోట్లోనే పడింది. అందుకే పాతాళంలోకి దిగజారిపోయి మళ్ళీ మెట్లెక్కే ఓపికలేక అక్కడే అణగారిపోయింది.

మీరు ప్రద్యుమ్నతో సంభాషణ వినేవుంటారు.

వీరన్న నగేష్ బందిపోట్లు.

పేదరికం, నిరుద్యోగం, ఆకలి భరించలేక సంఘంమీద కసితో అలాంటివారితో చేయి కలిపారు. అందులో దిగాకకాని వాళ్లకి లోతు తెలియలేదు.

ఎన్నో దోపిడీలు చేశాక ఈరోజు ఆ జీవితం వాళ్లకు వెగటుగా వుంది. వాళ్లు తమ దోపిడీకి అడ్డం వచ్చాడని చంపిన వ్యక్తి చెడ్డవాడే కావచ్చు. కాని అతని పెళ్లాం బిడ్డలేం చేశారు? వాళ్ల రోదన వాళ్ల హృదయాలను పిండేసింది. కాని బయటకొస్తే ప్రభుత్వపు సంకెళ్లు. లోపలుంటే మళ్లీ దోపిడీలు హత్యలు చెయ్యక తప్పనిస్థితి. ఈ మానసిక సంఘర్షణ భరించలేక ఇద్దరూ ఒకదశలో ఆత్మహత్యకు పాల్పడ్డారు.

ఆరోజు నేను, ప్రద్యుమ్న, విశ్వం, సుషమ ఏదో కేసు చూసుకుని కారులో తిరిగివస్తున్నాం. ఒక చెట్టుకింద వెల్లకిలా పడుకున్న ఇద్దర్నీ చూసి అనుమానించా. పక్కనే గన్నేరు పప్పు. అది తిని ఇంకా ఎంతోసేపు కాలేదనుకుంటాను. నాకు తెల్సిన నర్సింగ్‌హోంకి తీసుకెళ్లి నలుగురం ఆ రాత్రంతా హోరాహోరీ పోరాడితే తెల్లారేసరికి తెలివొచ్చింది వాళ్లకి. మమ్మల్ని చూసి కంగారుపడ్డారు. వాళ్లెవరైనదీ చెప్పలేదు.





మీ ఆయుష్షుకి మేం ఉన్నాం. అనేసరికి వాళ్లు అంత నీరసంలోను విరగబడి నవ్వారు.

"ఆయుష్షే లేని మా ఆయుష్షు మీరెలా కొంటారు" అని వీరన్న.

"మా కిష్టంలేకుండా మమ్మల్నెందుకు బతికించారు" అని నగేష్ గోల.

విశ్వం ప్రద్యుమ్నలకు వాళ్లను అప్పజెప్పి మిగిలినవాళ్లం వెళ్లిపోయాం.

వాళ్ల వివరాలను రాబట్టి ఓదార్చి రహస్యంగానే పంపించేశాడు విశ్వం.

ఈరోజు పేపర్‌లో వార్త తెలిస్తే వాళ్లెంత సంతోషిస్తారో! స్వయంఉపాధి పథకాల పుణ్యమా అని ఈ బందిపోటు బతుకునుండి విముక్తి దొరుకుతుంది వాళ్లకి.

అమృతా! జీవితంలో తప్పులందరూ చేస్తారు. కొన్ని క్షణికావేశంలో జరిగితే మరికొన్ని తెలిసే అడుసులో కాలేయడంలాంటివి. కాని చావు వాటికి పరిష్కారం కాదు.

ప్రతీ సమస్యకీ తప్పనిసరిగా పరిష్కారం ఉండితీరుతుంది.

కానీ అది బలమైన క్షణం-

ఆ క్షణాన్ని జయించగలిగితే???"

చివరిగా అన్నమాట తనునుద్దేశించి కాదు కదా.

అమృతలో బాధ సుడులు తిరుగుతోంది.

"పేదరికాన్ని భరించలేక నగేష్ వంటి వాళ్లు తీసుకునే నిర్ణయాలవల్ల వాళ్లేకేకాకుండా మొత్తం కుటుంబానికే రక్షణలేకుండా పోతుంది.

వీరన్న నగేష్‌ల కుటుంబసభ్యులను పోలీసులు వేధించని క్షణంలేదు. అంతకంటే పేదరికమే బాగుందన్నారు వాళ్లు. ఏ క్షణాన ఏ వార్త వినాల్సివస్తుందో తెలియని బతుకు "అమృతా! ఇదంతా మీకెందుకు చెబుతున్నానంటే నాకో చిరకాల వాంఛితం ఉంది. అది మీవల్లనే అవుతుందని నా మనసు చెబుతోంది"

అమృత సమాధానంకోసం ఆగాడు మృత్యుంజయ.

మళ్ళీ తనే అన్నాడు.

"నేను అది చెప్పేముందు మీరు కొంత

పరిశ్రమ చెయ్యాలి. ఇదిగో ఈ ఆఫీసు రూంలోని రాక్స్‌లో ఎన్ని ఫైల్స్ ఉన్నాయో చూశారా?

"వీటన్నిటిని మీరు పూర్తిగా చదివితీరాలి.

ఈలోగా మీరు అక్షరం కూడా వ్రాసేందుకు వీలులేదు.

తర్వాత చెప్తాను. నాకు ఎటువంటి సహకారం కావాలో? ముందు..."

"బాబూ!"

సరస్వతమ్మగారు! పిలిచారు.

"ఏంటమ్మమ్మగారూ!"

మృత్యుంజయ కంఠంలో ఒకరకమైన ఆప్యాయత ధ్వని విని అమృత విస్తుపోయింది.

ఇతడు గొప్ప నటుడయివుండాలి.

ఒక్కక్షణంలో ఆగ్రహావేశాలు వెదజల్లిన కంఠంనుండి పన్నీటి జల్లులాంటి పలుకులు.

నిరాశా నిస్పృహలు ధ్వనించిన ముఖంనుండి ఓదార్పుమాటలు.

ఇతగాడు చెప్పేవి నిజంకానీ, అబద్ధంకానీ గొప్ప తెలివైనవాడు అన్నదిమాత్రం ఖాయం.

"ఆశ్రమంలో నా పని అయిపోయింది. సుప్రియకు మధ్యాహ్నం పన్నెండుగంటలకు ఆపరేషన్ అని చెప్పారు. నన్ను కాస్త పంపిస్తే"

మృత్యుంజయ ఉలిక్కిపడ్డాడు.

ఇదేమిటి ఇంత ముఖ్యమైన విషయం మర్చిపోయాడు.

తనకేమయింది.

ఎప్పుడూ ఇలా జరగలేదు.

ఎంతో తప్పు చేసినట్టుంది అతని స్థితి.

"అమ్మమ్మగారూ! మీరు పెద్దవారు. మీరేం చెయ్యగలరు. సుషమను పంపిస్తానులెండి"

"కాదుబాబూ! సుప్రియ నాకు చాలా చేరిక. రాత్రినుంచీ ఆ పిల్లను హాస్పటల్‌కి తీసికెళ్లినప్పటినుంచి నాకు కాళ్లూ చేతులూ ఆడడంలేదు. ఇక్కడ కూర్చునేదేదో అక్కడే కూర్చుంటే దానికీ ధైర్యంగా వుంటుంది"

మృత్యుంజయ కళ్లు చెమర్చాయి.

ఈ వయసులో ఏమిటీవిడ తపన.

అయినవారంతా స్వార్థంతో దూరమయ్యారు.

ఈవిడ బాగోగులు ఎవరికీ అక్కర్లేదు.

రెక్కలుడిగిపోయేదాకా సేవలందుకున్న బిడ్డలకు ఈవిడ పనికిరానిదయ్యింది.

ఇక్కడికొచ్చినప్పటినుంచీ ఎంతో వైరాగ్యంతో ఏమీ పట్టనట్టుండేది.

కాని నాలుగురోజుల్లోనే ఆవిడ అవసరం ఈ ఆశ్రమానికెంత ఉందో తనకర్థమయింది.

సాంత్వన వచనాలు.

ఊరట.

ఓదార్పు.

సాధారణంగా ఇక్కడకు తీసుకురాబడినవారిలో చాలామంది విధివంచితులే.

అందరి కష్టసుఖాలూ ఎంతో ఓర్పుతో కనుక్కొని నేర్పుగా వారికి ఊరట కలిగించడం కళ్లారా చూసి తన ధ్యేయం సార్థకమైందనుకున్నాడు.

పండువయసులోని ఈవిడకు పట్టెడన్నంపెడితే తమ నిధులు తరిగిపోతాయనుకున్నారు కొడుకులు.

కాని ఎంతటి నిధిని పోగొట్టుకున్నారో వాళ్లకు తెలిసే అవకాశమే లేదు.

రోగగ్రస్థులైన వాళ్లకి ఓదార్పు, సేవ ఎంతో అవసరం.

సుప్రియను ఇక్కడకు తీసుకొచ్చినప్పుడు నిస్సంకోచంగా ఆవిడకు అప్పగించగలిగాడు.

"మృత్యుంజయగారూ! సుప్రియకేమయింది?"

అమృత కంఠంలో ఆదుర్దా.

ఆమెకు మతిపోయినట్టుంది.

నిన్న తను ప్రార్థనా సమయంలో చూసింది.

లేత గులాబీ పువ్వులా వుంది. వచ్చింది మొదలు తన కొంగుపట్టుకుని తిరుగుతుండేది.

ఇంతలో ఏమయింది?

అసలెపుడు హాస్పిటల్‌లో అడ్మిట్ చేశారో?

అమృతవైపు తిరిగి-

"అమృతా! మీకభ్యంతరం లేకపోతే సరస్వ

తమ్మగారితో వెళ్ళండి. విశ్వం డ్రాప్ చేస్తాడు. నేను డాక్టర్‌తో మాట్లాడతాను"

అమృత సంశయించలేదు.

వెంటనే బయలుదేరింది.

కార్లో ఎవరూ మాట్లాడలేదు.

నర్సింగ్ హోంలోకి వెళ్ళగానే విశ్వం ను ప్రియ ఉన్న రూం చూపించి, హడావుడిగా



వెళ్ళిపోయాడు.

లోపల బెడ్‌మీద పడుకుని కిటికీలోంచి చూస్తోంది సుప్రియ.

అడుగుల చప్పుడుకి ఇటు తిరిగిన సరస్వతమ్మగారు సుప్రియను కౌగలించుకున్నారు.

అమృత చూస్తూ ఉండిపోయింది.

"ఆంటీ మీరు కూడా నన్ను చూసేందుకు వచ్చారు. అబ్బ ఇప్పటిదాక నాకెంత భయం వేసిందని. లేచింది మొదలు తెలిసిన మొహంలేదు. అన్నీ నర్సు మొహాలే"

"పిచ్చిపిల్లా!" సరస్వతమ్మగారు తల నిమిరారు ఆప్యాయంగా.

"అమ్మమ్మగారూ నాకింక కడుపునొప్పి తగ్గిపోతుంది కదూ! ఇక్కడ నేనెన్నాళ్ళుండాలి. నాకిక్కడేం బాగులేదు"

సుప్రియ ఆ మాటలంటున్నపుడు పెట్టిన బుంగమూతి చూసి పక్కున నవ్వింది అమృత.



"అబ్బ నవ్వితే ఎంతందంగా ఉన్నా రాంటీ!"

సుప్రియ అలాగే చూస్తుండిపోయింది.

"వట్టి కబుర్ల పోగువి నువ్వు. ఆస్పత్రిలో మాట్లాడేవారు లేరని నీకు నచ్చలేదన్నమాట"

అమృత సుప్రియ బుగ్గ పుణికింది.

సుప్రియ ముఖం అంతలోనే విచారంగా మారిపోయింది.

"అమ్మమ్మా! అంకుల్‌కి ఉన్న ప్రేమ కూడా మా నాన్నకు లేదు. నేనెవరికీ అక్కర్లేదు. అందుకే నాన్న ఈ నెలలో రానేలేదు. నాన్నను చూసి ఎన్నాళ్ళయిందో?"

గుమ్మంలో చప్పుడయింది.

ఆ వ్యక్తి ముఖం బేలగా వుంది. చేతిలో చిన్న సంచీ.

"నాన్నా"

సుప్రియ ఆనందంతో ఒక్క ఉదుటున లేవబోయింది.

"లేవకమ్మా" ఆ వ్యక్తి కంగారుగా లోపలికొచ్చాడు.

"నాకు కబురు పొద్దుటే తెలిసిందమ్మా ప్రియా!"

చేతి సంచీలోంచి మల్లెపూలు తీసి ఇచ్చాడు కూతురికి. సుప్రియ మొహం చాటంత యింది.

అంతలోనే వాడిపోయింది.

"పిన్ని నిన్ను తిడుతుందేమో నాన్నా! వద్దులే"

"లేదమ్మా ఇవి పిన్నినడిగి తేలేదు. నీకోసం దాచిన నా డబ్బులేనమ్మా!

అతను ఏడుస్తున్నాడు.

"చూశారా మామ్మగారూ నా అసమర్థత బిడ్డకి కూడా తెలిసిపోయింది"

సరస్వతమ్మగారు అన్నారు-

"ఊరుకో బాబూ, చిన్నపిల్ల ఏదో తెలియదు. ఆశ్రమంలో మానాన్న ఎంతో మంచివాడు అంటూ రోజుకి పది సార్లేనా తలుచుకుంటుంది"

"నా మంచితనం దానికేం మేలుచేసింది. దాని ప్రాణం మీదకొచ్చినా అసమర్థుడిలా ఉండిపోయాను"

నర్సు లోపలికొచ్చింది.

"పాపకి ఇంజక్షనివ్వాలి. మీరు కాస్త బయటికి వెళ్ళాలి, డాక్టరుగారు వస్తారు"

అంతా బయటకెళ్ళారు. డాక్టర్ రాగానే తలుపు వేసేసారు.

డాక్టర్‌గారు ఐదు నిమిషాల తర్వాత బయటికి వెళ్ళిపోయారు.

మళ్ళీ వాళ్లు లోపలికెళ్లేసరికి సుప్రియ నిద్రపోతోంది.

మత్తు ఇంజక్షన్ ఇచ్చి ఉంటారు.

నర్సు చెప్పింది.

"పాపని లేపకండి, మరో అరగంటకి ఆపరేషన్‌కి తీసుకెళ్తాం"

ఆ వ్యక్తి సుప్రియ తండ్రి అన్నమాట.

రేగిన జుట్టు.

ముతక బట్టలు.

సంరక్షణలేని మనిషో లేక కూతురిమీద బెంగో అస్తవ్యస్తంగా ఉన్నాడు.

తండ్రి ఉండగా సుప్రియ ఆశ్రమంలో ఉండవలసిన అవసరమేమిటో?

ఆ అరగంటా అమృత మౌనంగా చూస్తూ కూర్చుంది. అతడు మాత్రం సరస్వతమ్మగారితో ఏదో చెప్తూనే వున్నాడు. అవేమీ అమృత చెవికెక్కలేదు.

ఆమె మనసు సుప్రియపట్ల జాలితో నిండిపోయింది.

సుప్రియను థియేటర్‌లోకి తీసుకెళ్ళగానే. అతడు సరస్వతమ్మగారికి చెప్పి వెళ్లిపోయాడు.

"సాయంత్రం వస్తాను మామ్మగారూ!" అమృత అంది.

"అమ్మమ్మగారూ! మనిమిక్కడ చేసేదేం లేదు. బయట చెట్లకింద కూర్చుందాం, థియేటర్‌లోంచి వచ్చిన వెంటనే కూడా మనం చూసేందుకు కొంత టైము పడుతుంది".

సరస్వతమ్మగారు బయటకు నడిచారు.

ఎండాకాలమైనా ముందురోజు వర్షం పడడం మూలాన వాతావరణం చల్లగానే





ఉంది.

ఎండ పల్చగా వుంది.

గడ్డిలో అక్కడక్కడా తడితడిగానే ఉంది.

చెట్టుకింద బెంచీమీద కూర్చున్నారిద్దరూ.

అమృత ఇంక ఆగలేకపోయింది.

"అమ్మమ్మగారూ ఇపుడు చెప్పండి... ప్రియకి తల్లిలేదు కదూ"

"అవునమ్మా!"

అమృత గుండెలో బీట.

అమ్మలేని బతుకు తనకు తెలుసు. రవంత ఆప్యాయతకోసం వెంపర్లాట... కానీ దొరకదు.

ఈలోకం స్వార్థంతో నిండిపోయింది.

"సుప్రియ తండ్రి దుర్బలుడమ్మా.

ఎంతో అమాయకుడు.

ఎక్కడో పల్లెటూళ్లో తాతలనాడు మిగిలిన కొన్ని సెంట్లభూమిమీద బతుకుతున్నాడు.

తల్లి బతికున్నన్నాళ్లూ ఆవిడ నీడలో అతని అమాయకత్వం సురక్షితంగానే ఉంది.

తమ్ముడి కూతురిని బంగారు బొమ్మని కోడలుగా తెచ్చుకుని ఆమె... సుప్రియ తల్లి... ఎంతో నేర్పుగా సంసారం దిద్దుకునేది.

కాని కాలం కలసిరాక పురిట్లో... రెండో కాన్పులో చచ్చిపోయింది.

ముసలమ్మగారి గుండె చెదిరిపోయింది.

తనకా వయసు చెల్లిపోతోంది. కొడుకు అమాయకుడు. పైగా వాడికో ఆడపిల్ల.

తను చచ్చిపోతే గుప్పెడు మెతుకులు కంచంలో పెట్టే దిక్కుండదు.

ఆలోచించి మళ్లీ పెళ్ళిచేసింది కొడుక్కి.

కాని ఆరోజునుంచీ అందరి బ్రతుకులనీ నరకం చేసింది ఆ రెండోభార్య ఆదిలక్ష్మి.

ప్రియ అంటే అసలు గిట్టేదికాదు.

దానికితోడు ఆపిల్ల రాచబిడ్డలా అందంగా ఉండేదిట.

మొగుడిని ఎప్పుడో వాజెమ్మని చేసింది.

తల్లి ఆ దిగులుతోనే చనిపోయింది.

ఆదిలక్ష్మికి ఎంతకీ సంతానం కలక్కపోవడం, ప్రియ బంగారు బొమ్మలా తయారవడం ఆవిడకి కంటగింపుగా ఉండేది.

తల్లిలేని బిడ్డ అని కూడా ఆలోచించక ఎంతో ఏడిపించేది. పెళ్లానికి ఎదురు చెప్పలేక, కూతుర్ని ఓదార్చలేక సతమతమయాడు ప్రియ తండ్రి.

ప్రియకి ఆరేళ్లవుడు ఆవిడకో కొడుకుపుట్టాడు.

ఇంక ఆదిలక్ష్మికి పట్టపగ్గాలేకపోయాయి.

మొగుడి ప్రతీపైసా కొడుకుకోసం కూడబెట్టేది.

దురదృష్టవశాత్తూ ఏడాదిక్రితం ప్రియకు కడుపునొప్పి ప్రారంభమయింది.

తీవ్రతకు ఆ లేతపిల్ల తట్టుకోలేకపోయేది. దానికితోడు సవిత్తల్లి నమ్మేదికాదు.

పని తప్పించుకునేందుకు నాటకాలాడుతోంది అనేది. అందుకే నిర్లక్ష్యంలో చాలా రోజులు మొగుడి దృష్టికి తేలేదు.

ఒకసారి తండ్రి ఇంట్లో ఉండగానే విపరీతంగా లుంగలు చుట్టుకుపోయింది సుప్రియ.

అతడు లబలబలాడుతూ నాటు వైద్యుడి మందులేవో వాడాడు. తాత్కాలిక ఉపశమనం కలిగినా జబ్బు తగ్గలేదు.

పట్నం తీసుకెళ్ళి మందులిప్పించి డబ్బు ఖర్చు పెట్టేందుకు సవిత్తల్లీ ఒప్పుకోలేదు.

అతడికీ స్తోమత లేకపోయింది.

కడుపునొప్పితో విసిగి పోయిన ప్రియ... ఈ చిన్నారి బిడ్డ ఒకరోజు ఎవరికీ చెప్పకుండా వచ్చేసింది.

ఆ రావడం ఒకరకంగా మంచిదే అయింది.

ఎంతోదూరం నడిచి నడిచి రైలు పట్టాల దగ్గరకెళ్ళి..." ఉలిక్కిపడింది అమృత.

"ఇంత చిన్నపిల్ల ఆత్మహత్యకి పాల్పడిందా?"

"అవునమ్మా. కానీ ఆయువుండబట్టి మన వాళ్ల కంటబడింది. పరీక్షలో తప్పిందేమో అనుకున్నారట మొదట్లో. కాని తర్వాత తెలిసింది విషయం.

మృత్యుంజయబాబు ఆలస్యం చెయ్యలే



దు.

ప్రియను హాస్పటల్‌లో చూపించాడు.

ఈసారి తీవ్రంగా వచ్చినపుడు ఆపరేషన్ చేస్తే పూర్తిగా నయం కావచ్చు అన్నారు డాక్టర్లు.

ప్రియను బుజ్జగించి తండ్రి అడ్రసు తెలుసుకుని తనే వెళ్ళాడు ఆ ఊరు.

ఆదిలక్ష్మి ససేమిరా ప్రియ ఇంటికి రావడానికి ఒప్పుకోలేదు. అది దొంగ కడుపునొప్పి. ఆపరేషను లేదు ఏంలేదు అందిట.

తండ్రి గుడ్లనీరు కుక్కుకున్నాడు.

ఆపరేషన్ ఖర్చు తనే భరిస్తాను, ఆ పాప ఆయుష్షు అమ్మేయమన్నాడు మృత్యుంజయ.

ఆ తండ్రి రెండు చేతులూ జోడించాడట.

పాపను తను పెంచుకుంటానని తీసుకొచ్చేసాడు మృత్యుంజయ.

సుప్రియకీ విషయాలేం చెప్పకపోయినా... తండ్రికోసం ఎదురుచూసేది.

క్రమంగా ఆశ్రమ జీవితానికి అలవాటుపడింది.

ఇక్కడకు వచ్చాక ఒకటి రెండుసార్లు నొప్పి వచ్చినా కాస్త తిండి పుష్టితో తేరుకున్నది కాబట్టి తట్టుకోగలిగింది.

ఇదిగో రాత్రి మాత్రం చాలా ఉధృతంగా వచ్చింది.

అమ్మాయ్, అప్పుడు నేనుపడ్డ గాభరా చెప్పనలవికాదు.

అందరూ బయటికెళ్ళారు. ఉన్నవాళ్లు చదువుకున్న వాళ్ళు కారు. నాలాంటివాళ్ళే నువ్వు కూడా లేవు.

కాని దేవుడిలా మృత్యుంజయ... ఎవరో పిలిచినట్టే ఊరినుంచి వచ్చాడు.

అతడు డాక్టర్‌కి ఫోన్ చేసేలోగా విశ్వం, ప్రద్యుమ్న వచ్చారు.

వెంటనే పిల్లను హాస్పటల్‌కి తీసుకుపోయారు!"

వార్డుబోయ్ పిలుస్తున్నాడు చేతులూపుతూ. అమృత పరిగెత్తింది. సరస్వతమ్మగారు అనుసరించారు.

రూంలోకి వెళ్ళేసరికి విశ్వం, మృత్యుంజయ ప్రియదగ్గర కూర్చుని ఉన్నారు.

అమృతకు సిగ్గేసింది.

మాటల్లోపడి తను ఆవిడను కూడా ఉంచేసింది.

ఏమనుకున్నారో వాళ్ళు.

"ప్రియకు తెలివి వచ్చేలోగా సెలైన్ నీడిల్ కదలకుండా చూడాలి. విశ్వం ఉంటాడు. మీరిద్దరూ భోజనం కూడా చెయ్యలేదు కదా!"

సరస్వతమ్మగారు వెంటనే అంది.

"ఈరోజు నేను భోజనం చెయ్యను బాబూ! రెండరటిపళ్లు తిని ఇక్కడే ఉంటాను. మీరు పని చూసుకోండి బాబూ, ప్రియకు ఇంక ఫరవాలేదు కదా"

మృత్యుంజయ నవ్వులో అలసట.

ఆపరేషన్ అవుతున్నంతసేపూ అతనెంతో టెన్షన్ అనుభవించి ఉండాలి.

"బాస్ చెయ్యి పడిన వాళ్ళకు ఢోకాలేదు అమ్మమ్మగారూ! డాక్టర్ కేశవ్, బాస్ కలిసే చేసారు"

విశ్వం మాటలకు అమృత విస్మయంలో పడింది.

"మృత్యుంజయ కూడా ఆపరేషన్ చేశాడా! అయితే సరస్వతమ్మగారి మాట నిజమేనన్నమాట. ఇతడు డాక్టరా? మరి ఎక్కడో ప్రాక్టీసు పెట్టుకుని రెండు చేతులా సంపాదించక, అంత చదువూ వదులుకుని ఏమిటిలా? ఎందరో రోగులకు ప్రాణాలు పొయ్యక ఈ ఆశ్రమం, ఆయుష్ బిజినెస్ ఏమిటి?"

అంతలోనే అమృతకు తన ఆలోచనలో లోపం తెలిసింది.

"ఇదీ ప్రాణాలు పొయ్యడమేగా... కాని డాక్టర్ వృత్తిలో ప్రాణం పోస్తే కాసులు రాల్తాయి. ఇక్కడ చేతి డబ్బులు వదుల్తున్నాయి. అయినా చేస్తున్నాడంటే ఏదో లాభం ఉండాలి.

అమృత జీవితంలో నూటికి తొంభయి తొమ్మిదిమంది స్వార్థపరుల్నే చూసింది.

సోషల్‌సర్వీసు పేరుతో బిల్డింగులు కట్టిన సాంఘికసేవా తత్పరులు మాత్రమే తెలుసు.

'అమృతా, నువ్వు భోంచెయ్యలేదుకదా ను




వ్వెళ్లు... ప్రియకేం ఫరవాలేదు, నేనుంటాను''

సరస్వతమ్మగారు అమృత చెయ్యి తట్టింది.

ఆలోచనల్లోంచి తేరుకుని సుప్రియనోసారి చూసింది.

ఆ పిల్ల మొహం ప్రశాంతంగా వుంది.

ఇంత చిన్నవయసులో కడుపునొప్పి, ఆపరేషన్. జీవితంలో సుప్రియ కష్టాల కింతటితో తెరపడి మంచి జీవితం దొరికితే బాగుండును.

మృత్యుంజయ... విశ్వం కారులో కూర్చున్నారు. అమృత మెల్లిగా నడుస్తూ వచ్చి కారెక్కబోయింది.

ఎవరో చెయ్యి లాగారు.

వెనక్కి తిరిగితే,

సుభద్రమ్మగారు... ఇంటి ఓనర్.

''అమ్మాయ్ అమృతా! నువ్వేనా? ఎంత చిక్కిపోయావు? ఇన్నాళ్ళు ఆఫీసుకేంపా? ఎక్కడికెళ్ళావు?''

ఆవిడ ప్రశ్నల వర్షం తప్పించుకునేదారి లేకపోయింది అమృతకు.

తనకొక ఇల్లుందన్న విషయమే మర్చిపోయిందేమిటి ఇన్నాళ్ళూ.

తను ఏదో ప్రపంచంలో తిరుగాడుతోంది.

తన ఇల్లు, పుస్తకాలు, బట్టలు, అమృతకు అసలు విషయం అప్పటికి స్ఫురించింది.

ఆవిడ ఇక్కడ హాస్పటల్‌లో ఎందుకుంది?

అదే అడిగింది ఆవిడను.

''మా మనవరాలికి ఒంట్లో బాగులేదమ్మా... టైఫాయిడ్. ముసలిదాన్ని నాకు తెలియలేదు, కషాయాలతోఎంతకీ తగ్గకపోయేసరికి డాక్టర్‌కి చూపిస్తే నానాతిట్లూ తిట్టాడు. వెంటనే వాళ్ళమ్మా, నాన్నలకి టెలిగ్రాం ఇప్పించాను. సమయానికి నువ్వు కూడా లేవు. నువ్వుంటే ధైర్యంగా ఉండేది''

''ఇంతకీ లావణ్య ఇక్కడే ఉందా? ఇపుడు తగ్గిందా?''

ఆదుర్దాగా అడిగింది అమృత.

''రేపు ఇంటికి తీసుకు వెళ్ళవచ్చన్నారు డాక్టర్లు. బోల్డు డబ్బయింది అమృతా''

అమృతకి జాలేసింది.

చిన్నప్పట్నుంచీ లేమిలో పెరిగిందావిడ. మెట్టినిల్లూ అంతంతమాత్రమే.

భర్త ఏక్సిడెంటులో పోతే ఇద్దరు కూతుళ్ళనూ అష్టకష్టాలుపడి పెంచి పెళ్లిళ్లు చేసింది. పెద్ద కూతురు తనదగ్గరే ఉండమంది.

మొదట్నుంచీ ఉన్నఊరు... ఇల్లు వదలనని భీష్మించుకుని కూర్చుంటే... వాళ్ళ పెద్ద పిల్లని ఈవిడ దగ్గర సాయం ఉంచారు.

లావణ్య కూడా అమ్మమ్మని అరక్షణం వదిలేదికాదు. ఆవిడ ప్రాణాలన్నీ ఆ పిల్లమీదే.

తనకిచ్చిన వాటామీద అద్దె డబ్బులు అల్లుళ్ళు మంచి వాళ్లు కనుక చెరో రెండొందలూ పంపుతారు. వాటితో కాలక్షేపం చేస్తోంది.

''లావణ్యని తీసుకుపోతారట అపర్ణా! నేనూ ఇక్కడ ఉండేందుకు వీలులేదుట. మా పెద్దల్లుడికి సెలవు లేదు. రేపు సాయంత్రమే ప్రయాణం''

మృత్యుంజయ కారు కాస్త ముందుకు తీసుకెళ్ళి ఆపాడు వాళ్ళ కబుర్లు చూసి.

''అన్నట్టు అపర్ణా అసలు విషయం మర్చేపోయాను. నువ్వీనెల అద్దె ఇచ్చేస్తే తర్వాత నుంచి మా పెద్దల్లుడి అడ్రసుకి మనీయార్డరు చేద్దువు కాని''

అదీ అసలు సంగతి.

అపర్ణకి ఏం చెప్పాలో అర్థంకాలేదు.

తన దగ్గర డబ్బులేదు.

ఆశ్రమంలో కూడా మృతుంజయ ఎపుడు తెచ్చాడో మరి ఆ చీరల్ని వేరే గత్యంతరంలేక కట్టుకుంటోంది.

అలాంటిది తను అద్దె ఎలా ఇవ్వటం.

పోనీ విశ్వాన్ని అడిగితే?

ఈలోగా మృత్యుంజయ కారు దిగి అమృత దగ్గరకి వచ్చి-

''మీరు మాట్లాడుతుండండి. మేం అలా తిరిగివస్తాం'' అనేసి వెళ్ళిపోయాడు.

సుభద్రమ్మగారు అతన్ని చూసి అవాక్కయింది.

ఇతడే.

అనుమానం లేదు.



తనెంత పిలిచినా కనీసం ఆరోజు వెనక్కి తిరిగయినా చూడలేదు.

పెద్దతనం మూలాన ఆవిడకు ఆరోజు అమృతకోసం వచ్చిన ఇద్దరిలో ముందు వచ్చిందెవరో గుర్తులేదు.

"అమ్మాయ్ అమృతా! ఆ అబ్బాయి మీ ఆఫీసరా?" సుభద్రమ్మగారి మాటలకు ఏం చెప్పాలో తెలియక తలూపింది అమృత.

ఆవిడకు తనేం చెప్పినా పాతకాలం మనిషి మూలాన అపార్థం చేసుకునే అవకాశం ఉంది.

"నాలుగు రోజులక్రితం అసలింతకీ నీకా కాగితాలు అందాయా?"

తెల్లబోయింది అమృత.

"ఏ కాగితాలు పిన్నిగారూ!"

"అదే నాలుగు రోజులక్రితం నువ్వితన్ని కాగితాలకోసం పంపావు కదా!"

"నేను పంపానా?"

"అవును..."

"ఎవర్ని"

"ఇందాక నీతో మాట్లాడిన నీ ఆఫీసర్ని"

అమృత మాట్లాడక విస్తుపోయి ఉండటం చూసి ఆవిడ అంది.

"నాకారోజే అనుమానం వచ్చిందమ్మాయ్, నన్నడక్కుండా మారుతాళంతో నీ వాటా తెరిచి ఏవో కాగితాలు తీసుకుని వెళ్లాడు. పైగా నువ్వు కేంప్‌లో ఉన్నావని చెప్పాడు"

మృత్యుంజయ తన ఇంటికొచ్చి కాగితాలు పట్టుకెళ్ళడమేమిటి?

"పిన్నిగారూ! మీరతని పేరడగలేదా?"

"అడిగానమ్మాయ్! మృత్యుంజయరావు అని చెప్పాడు"

అమృత చెవిలో హోరు మొదలయింది.

ఆ తర్వాత సుభద్రమ్మగారు మరో మృత్యుంజయరావడం చెప్పిందిగాని అవి అమృత చెవిలోకి దూరలేదు.

"పదండి పిన్నిగారూ! నేనింటికొస్తున్నాను" స్థిరంగా అంది అమృత.

"మరి మీ ఆఫీసరు?"

సుభద్రమ్మగారికి సంతోషం కలిగింది.

పెద్దవయసు... చాదస్తం అని తన మాటలెవరూ పట్టించుకోరు. ఇపుడీ అమృత తనమాటకి విలువిచ్చింది.

"మా అమ్మాయికి చెప్పి వస్తాను. నేనూ భోజనం చెయ్యాలి"

లోపలికెళ్ళి అయిదు నిమిషాల్లో వచ్చింది ఆవిడ.

మృత్యుంజయ విశ్వాన్ని జంక్షన్‌లో దింపి తిరిగి వచ్చేసరికి అమృతక్కడ లేదు.



అమృత తన ఇంట్లో బెడ్‌రూంలో మంచం మధ్యన కూర్చుంది.

ఆ కూర్చున్నతీరు సర్వస్వం కోల్పోయినట్టుంది.

పది లంకణాలు చేసిన మనిషిలా వుంది.

ఇంటికి రాగానే అన్నం తినేదాకా సుభద్రమ్మగారు విడిచి పెట్టలేదు. ఆవిడకి కూతురుతో వెళ్ళడం ఇష్టంలేదు. అంత ఇంట్లో ఆ ముసలమ్మని వదిలి వెళ్లడం కూతురికిష్టంలేదు. అమృతకికమీదట ఆఫీసు కేంప్ లెక్కువ ఉండవు అని కూతురికి చెప్పింది. ఇక్కడే ఉండిపోవాలని ఆవిడ ఆశ.

అమృతకు ఎంత త్వరగా తన రూంకి వెళదామా అని వుంది. చివరికావిడని వదిలించుకుని ఇంట్లోపడింది.

ఇల్లంతా బూజులు పట్టేసింది.

వంటిల్లు ఆనాటి తన మానసికస్థితిని తెలుపుతోంది. పుస్తకాల అరలు గబగబా వెదికింది.




అప్పటికే ఆమె బట్టలు, పుస్తకాలు కెలికే సినట్టు చెల్లాచెదురుగా ఉన్నాయి.

ఏంటా కాగితాలు.

చటుక్కున స్ఫురించింది.

వెంటనే మంచందిగి బెడ్ క్రింద తడిమింది పెద్ద కవరు దొరకలేదు.

అవి రాహుల్ రాసిన ప్రేమలేఖలు.

ఆమె మనసు మొద్దుబారిపోయింది.

ఆ ప్రేమలేఖలు మృత్యుంజయ ఏం చేసుకుంటాడు? తనని బ్లాక్ మెయిల్ చేయడానికా?

తను ముందే అనుమానించింది, అతన్ని.

తను ఎపుడైనా ఎదిరిస్తే అవి చూపించి...?

కోపంతో ఆమె ముక్కుపుటాలెరుపెక్కాయి.

ఎంత ధైర్యం అతనికి?

ఏమిటి అతను కోరుతున్న సహకారం, అది కాదనే వీలు లేకుండా అన్నిపక్కలా బంధిస్తున్నాడన్నమాట.

తను చాలా మొండిదన్న విషయం అతనికింకా తెలియదు.

తటాలున లేచి వెళ్లిపోతున్న అమృతను కాఫీ కప్పుతో వచ్చిన సుభద్రమ్మగారు విస్తుపోతూ చూసింది.

ఆవిడ పిలుపులు అమృత చెవి చేరడంలేదు.

"ఈ పిల్లకు గాలిసోకలేదు కదా" అనుకుందావిడ.

★ ★ ★

అమృత పిచ్చిపట్టినదానిలా నడుస్తూంది.

అతన్ని నిలదీసి అడగాలి.

తనకేమిటి భయం?

ఆమెకాళ్లు నర్సింగ్ హోం దగ్గర ఆగిపోయాయి.

సుప్రియకెలా వుందో?

తను మర్చేపోయింది.

లోపలకి అడుగుపెట్టిన అమృతకంటికి ఆ దృశ్యం అపురూపంగా తోచింది.

సరస్వతమ్మగారి మెడచుట్టూ ప్రియ చేతులు. ప్రియ కదిల్తే ఎక్కడ కుట్లు తెగిపోతాయోనని ఆవిడ బాగా ముందుకు వంగింది.

ఆమె పెదాలు ప్రియ నుదుటిని చుంబిస్తున్నాయి, "మామ్మ మనవరాళ్ళ అనురాగం"

అమృతను చూసి తేలిగ్గా నిట్టూర్చిందావిడ. "ఎక్కడకెళ్ళావమ్మా మృత్యుంజయ గాభరా పడుతూ వెళ్ళాడు. ఇదిగో ఆ కంగారులో ఈ పుస్తకం మర్చిపోయాడు. ఇందులో డబ్బు కూడా ఉంది. రాత్రికి నేనిక్కడే ఉంటాను. ఈ పుస్తకం మృత్యుంజయకియ్యి"

అప్రయత్నంగా అందుకుంది అమృత.

అది డైరీ.

కొత్త డైరీలాగుంది.

ఈమధ్యకాలంలో రాసినట్టు కొత్తగా ఉంది. ఇంకు కూడా బ్రైట్‌గా. డైరీ మూసింది. ప్రియ కేసి తిరిగి అడిగింది

"ప్రియా! ఎలా వుంది?"

"అసలు నొప్పేలేదు ఆంటీ! అంకుల్ చూశారా నేను భయపడతానని ఆపరేషన్ అనే చెప్పలేదు. అంకుల్ చేశారు కనుక ఆపరేషన్ కూడా తియ్యగా వుంది"

"పిచ్చిపిల్లా" సరస్వతమ్మగారి మొహంలో ఉదయం కనిపించిన దిగులు మాయమయి తేటగా ఉంది.

"ఆపరేషన్ ముందు మత్తుమందు క్లోరోఫాం తియ్యటి వాసన వేసి వుంటుంది అవునా"

అమృత మొహంలో నవ్వు చూసి హమ్మయ్య అంది ప్రియ.

"అదేం"

"మీరు వచ్చిన వెంటనే అద్దంలో చూసుకుంటే తెలిసేది"

"మరి నీమొహం చూస్తే మంత్రం వేసినట్టు దిగులుపోయింది అంటావ్ అంతేనా?"

ప్రియ తండ్రి వచ్చాడు.

"మరి నే వస్తాను అమ్మమ్మగారూ" అమృత లేచింది.

నర్సింగ్ హోం దాటి నాలుగడుగులు వేసింది అమృత. ఆమె కళ్లు పెద్దవయాయి.

అమెరికా వెళ్లిపోయిన రాహుల్.

ఎదురుగా జ్యూవెలరీ షాపునుంచి ఎవరో

అమ్మాయి భుజంమీద చెయ్యివేసి మరీ దిగుతున్నాడు.

"రాహుల్"

ఆమె గొంతునుంచి అప్రయత్నంగా వెలువడిన ఆ కేకకు తలెత్తిన అతడు ఖంగుతిన్నాడు.

ప్రక్కనున్న అమ్మాయి భుజంమీద చెయ్యి షాక్ కొట్టినట్టు తీసేశాడు.

వెంటనే తలతిప్పుకుని వడివడిగా వెళ్ళబోయాడు.

అమృతకు కోపం ముంచుకొచ్చింది.

స్పీడుగా వచ్చి అతని చెయ్యి పట్టుకుని-

"నీతో ఐదు నిమిషాలు మాట్లాడాలి" అంది.

తన గర్ల్‌ఫ్రెండ్ చూపులోని తీవ్రతను గమనించాడు రాహుల్.

"ఛీ వదులు... ఎవరు నువ్వు?"

ఆమె చెంపమీద ఛెళ్ళున చరిచినట్టయింది.

"మేడమ్ ప్లీజ్ మీతో రెండు నిమిషాలు మాట్లాడే భాగ్యం కలిగించరా?" అని తన చుట్టూ తిరిగిన రాహుల్ ఇతనేనా?

ఆ గర్ల్‌ఫ్రెండ్ వెళ్లి కోపంగా మారుతీకారులో కూర్చుంది. ఆ క్షణం చాలు అతనికి.

"ఎందుకు? ప్రేమలేఖలు ఎందుకు పట్టుకుపోయావ్ అని నిలదీసేందుకా?" అయిదు నిమిషాలు రాహుల్ నవ్వులో విషం.

"ఒక్క నిమిషంలో చెప్తాను. అవును నేనే నీ యింటిని మారు తాళంతో తీసి నా లెటర్స్ పట్టుకుపోయాను. నువ్వు బ్లాక్ మెయిల్ చెయ్యకుండా... ఏం చేస్తావో చేసుకో"

పరుగున వెళ్ళి కారులో కూర్చుని డోర్ ఠపీమని వేసి కారుతో దుమ్మును ఆమె కళ్ళలో కొడుతూ వెళ్ళిపోయాడు.

అమృత నడిరోడ్డుమీద పిచ్చిదానిలా నించుంది.

హారన్‌లు ఆదేపనిగా మోగుతున్నాయి.

బీట్ పోలీసు పరిగెత్తుకుంటూవచ్చి శిలాప్రతిమలా నుంచున్న ఆమెను చూసి చెవిదగ్గర గట్టిగా విజిల్ వేశాడు.

అమృత చుట్టూ ఒకసారి చూసి తలదించుకుని పక్కకు నడిచి పోయింది.

తనెక్కడికి పోతుంది.

మృత్యుంజయ దగ్గరకా?

ఎందుకు?

నిలదీసేందుకా?

ఏమని నిలదీస్తుంది?

సుభద్రమ్మగారు తనకలా ఎందుకు చెప్పింది?

అబద్ధం చెప్పేందుకు మృత్యుంజయపేరు ఆవిడకెలా తెలుస్తుంది.

ఆలోచించినకొద్దీ మిస్టరీ విడిపోయింది.

రాహుల్ తనపేరు మార్చి చెప్పి ఉండాలి.

★ ★ ★

వారం రోజులుగా అమృత ఆశ్రమంలో ఆఫీసురూం వదలలేదు.

ప్రతీ ఫైలూ శ్రద్ధగా చదివింది.

విశ్వం ఫైలు చదివినపుడు ఎంతో ఆశ్చర్యం కలిగింది. అసలు ఆ విశ్వం ఈ విశ్వం ఒకడేనా అనిపిస్తోంది.

ప్రతీ ఫైలులో వ్యక్తి వయసు మనస్తత్వం, గత చరిత్ర క్లుప్తంగా వున్నాయి.

ఆత్మహత్య చేసుకునే బలవత్తర కారణం,

రక్షించబడిన విధానం,

తర్వాత గడుపుతున్న జీవితం,

మళ్లీ వెనక్కివెళ్లే అవకాశం ఉందా!

అంటే ఆత్మహ్యా చేసుకునే అవకాశం ఉందా.

ఆనందంగా జీవితం గడిపే అవకాశం ఉందా?

ప్రతి చిన్న విషయం ఎంతో జాగ్రత్తగా సర్వే చేసి రాసినట్టున్నాయి.

విశ్వం ఫైలు ఆసక్తిగా చదివింది అమృత.

విశ్వం ఉన్నత కుటుంబం నుంచి వచ్చినవాడు.

వయసు ముప్పై ఐదు.

వృత్తిరీత్యా ఇంజినీర్.

తల్లిదండ్రుల ఇష్టం లేకపోయినా బలవంతాన ఒప్పించి సంయుక్తను పెళ్లి చేసుకు




న్నాడు.

కానీ భార్యగా సంయుక్త అతనికి అనుకూలించలేదు.

ప్రియురాలిగా ఆమె కోరికలు తీరినట్టే జీవితమంతా ఉంటుందని అనుకుంది.

కానీ ఇల్లాలిగా తనకి కొన్ని బాధ్యతలుంటాయని గ్రహింపులేదు.

అందుకే ఇంట్లో అత్తామావలతో జగడం.

ఒక బిడ్డ తల్లి అయినా బాధ్యత తెలిసిరాలేదు.

ఒక బాధ్యతాయుతమైన ఉద్యోగంలో ఉన్న భర్త అలసిసొలసి ఇంటికి వస్తాడని గ్రహింపు లేక, వచ్చీరాగానే జగడం వేసుకునేది.

విసుగెత్తిపోయినా భార్య మీద ప్రేమ చంపుకోలేక పోయాడు.

దానికి తోడు కొడుకంటే ప్రాణం అతనికి.

కానీ అతని గుండె పగిలిపోయే రహస్యం వెల్లడయేసరికి తట్టుకోలేకపోయాడు.

సంయుక్త రెండు పడవలమీద ప్రయాణం చేస్తున్న స్త్రీ.

తనకంటే ముందే ప్రేమించిన మేనబావతో పెళ్లికి ముందు సంబంధం ఉంది.

పెళ్లయ్యాక కూడా చీటికీ మాటికీ ఇంట్లో తగవు పెట్టుకుని పుట్టింటికి వెళ్లడం, అతనితో సంబంధం కొనసాగించడం కోసమేనని చాలా కాలం తెలీలేదు.

చివరకి పుట్టిన బిడ్డ కూడా తన కొడుకుకాడని తెలిసి...

మనశ్శాంతికోసం మత్తుమందులు అలవాటు చేసుకున్నాడు.

సంయుక్త ఒకరోజు కొడుకుతో సహా చెప్పాపెట్టకుండా గుడ్‌బై చెప్పి వెళ్లిపోయింది.

విశ్వం అప్పటినుంచీ మరీ ఎక్కువగా రోజుకి పది గంటలు మత్తులోనే మునిగిపోయి వుండేవాడు. తల్లీతండ్రీ నెత్తీనోరూ కొట్టుకున్నారు.

వినేందుకు అతనికి తెలివి ఉంటేగా.

చేస్తున్న ఉద్యోగం ఎపుడో పోయింది.

తిండికి లోటు లేకపోయినా కొడుకు బతుకు చేజేతులా నాశనం చేసుకుంటూంటే ఆ తల్లి మరీ విలవిల్లాడిపోయింది.

మృత్యుంజయ దృష్టికి వచ్చిన ఈ కేసును అతనే తెలివిగా పరిష్కరించాడు.

ముందు విశ్వంతో పరిచయం చేసుకున్నాడు.

తప్పు చేసింది భార్య అయితే శిక్ష తనకు తాను విధించుకోవడం, కనిపెంచి ఎన్నో ఆశలు పెట్టుకున్న తల్లిదండ్రులను బాధపెట్టడం మంచిది కాదని నచ్చజెప్పాడు.

కానీ అతనికి విషయం అర్థమవుతున్నా శరీరం అతని మాట వినడం లేదు.

ఒక్క గంట మత్తుమందు ఆలస్యమైతే చేతులు కాళ్లూ వణికిపోయేవి.

వళ్లంతా చెమటలు పట్టేసేవి.

మృత్యుంజయ తనకు తెలిసిన పెద్ద డాక్టర్‌కి చూపించాడు.

ఇతనికి విల్‌పవర్ ఉంటే తగ్గడం కష్టం కాదన్నాడు ఆయన.

కానీ...

ఇతన్ని హాస్పిటల్‌లో దాదాపు ఏడాదిపాటు ఉంచవలసి వుంటుందని చెప్పాడు డాక్టర్.

మెంటల్ హాస్పిటల్ పేరు విని తల్లీధండ్రీ లబోదిబో మన్నారు. కానీ మృత్యుంజయ నచ్చజెప్పిన మీదట వాళ్లు ఇష్టపడ్డారు.

ఇష్టపడక చేసేదేమీలేదు.

కొడుకు ప్రాణాలు పోతూవుంటే చూస్తూ ఊరుకోలేరుకదా!

మృత్యుంజయ ప్రతీరోజూ విశ్వాన్ని చూసిపోయేవాడు. వచ్చిపోయే తల్లిదండ్రుల అభిమానం,

మృత్యుంజయ ఓదార్పు, అతడిని తిరిగి మనుషుల్లో పడేసాయి.

మామూలు మనిషయిన విశ్వం తిరిగి ఉద్యోగంలో చేరలేదు. సోషల్ సర్వీసుకే తన జీవితం అంకితం చేస్తానన్నాడు.

మృత్యుంజయ ఆశ్రమంలో తనంత తానుగా పని చేస్తున్నాడు.

అమృతకెంతో రిలీఫ్ అనిపించింది.




మోసం చెయ్యడానికి, మోసానికి గురవడానికి ఆడమగ అని లేదన్నమాట.

సంయుక్తలాంటి ఆడవాళ్లు మహిళలకే సిగ్గుచేటు.

మత్తుమందులకు అలవాటుపడి ఆ మత్తు మందు దొరక్క విలవిల్లాడి పోయి ఆత్మహత్యలు చేసుకోబోయిన వాళ్ల ఫైల్సన్నీ ఒక అరలో ఉన్నాయి.

డౌరీ- వరకట్నం అన్న లేబిల్ ఉన్న అరలో ప్రవీణ ఫైల్ చూసి విస్మయపడింది.

ఆడుతూ పాడుతూ తిరిగే ప్రవీణకు పెళ్లయిందా? కట్నం తేలేదని భర్త వదిలేసాడా?

లేత మొహం. అసలు పెళ్లయినట్టే ఉండదు.

ప్రసన్నత, చిరునవ్వు, చక్కని కళ్లు ఆ మొహానికి అందాలు.

ప్రవీణ ఆశ్రమంలోనే ఎందుకుండిపోయింది?

తల్లిదండ్రులెలా ఊరుకున్నారు?

ప్రవీణ కూడా ఆత్మహత్య చేసుకోబోయిందన్నమాట.

ప్రవీణ ఫైలు చదివాక అంతా తేటతెల్లమయింది. ఆ ఫైలు ప్రవీణే రాసినట్టుంది.

"నాన్నగారు ముహూర్తం సమయానికే కట్నం ఇచ్చేయాలనుకున్నారు.

కానీ పొలం అమ్మి తెచ్చిన డబ్బు దొంగల పాలయింది.

రిటైర్మెంటు సమయానికి తలదాచుకునేందుకు స్వంత ఇల్లు కూడా లేనంత నిజాయితీపరుడైన ఉద్యోగి నాన్న.

మరో ఏడాదిలో రిటైరయినపుడు డబ్బు వస్తుంది, ఇచ్చేస్తానని బతిమాలితే ప్రామిసరీ నోటు రాయించుకుని మరీ తాళికట్టించాడు మా మావగారు తన కొడుకు చేత.

కానీ రిటైరయ్యేలోగానే నాన్నపోయారు.

ఆ తర్వాత డబ్బు అమ్మ పేర వచ్చింది.

కానీ తమ్ముడు ఆ డబ్బు ఇచ్చేందుకు ఒప్పుకోలేదు.

అది ఇస్తే తనకి ఉద్యోగం వస్తుంది.

ఉద్యోగం వచ్చాక నెలకింత అని తీరుస్తానన్నాడు.

నిప్పులు తొక్కిన కోతుల్లా గెంతారు అత్తామావగారూ. నా భర్త వాళ్ల చాటు బిడ్డ.

నాకు ఆరళ్లు ఎక్కువయ్యాయి.

నా కూతురును నా దగ్గరకు రానివ్వకుండా దాచేసేవారు. అది పాలకోసం కక్కటిల్లిపోతూ ఉంటే అశక్తతతో నా గుండెలు బరువెక్కిపోయేవి.

నా భర్తకు కూడా కన్నకూతురనే మమకారం లేకపోయింది.

పసిపిల్ల ఏడుపుకంటే నేను కార్చే కన్నీళ్లు వాళ్ల కసిని చల్లార్చేవి.

నేను చచ్చిపోతే నా తల్లి ఏడవాలని వాళ్ల కోరిక. వాళ్లు నన్నెక్కడ చంపేస్తారో నా బిడ్డ అనాథ అవుతుందేమోనని విలవిల్లాడిపోయేదాన్ని.

కానీ ఆకలితో అరిచి అరిచీ నా పాప చచ్చిపోయింది.

నాకు కక్ష...

ఏదో చెయ్యాలి!

నా చిన్నారిని పొట్టన బెట్టుకున్న వాళ్లు శాంతిగా బతక్కూడదు. అందుకే ఎవరికీ తెలియకుండా పోలీసులకి ఒక లెటర్ రాసాను.

'నా భర్త, అత్తామావలు నాకు విషం కలిపి చంపే ప్రయత్నం చేయబోతున్నారు. నన్ను రక్షించండి' అని.

అది వాళ్లకి చేరేదెలా?

అప్పటికే సుషమ నాకు పరిచయమయింది.

ఎపుడూ నవ్వుతూ తుళ్లుతూ ఉండేది.

మా పాపను ఎత్తుకుని ముద్దులాడేది.

ఆమె ఉన్నంతసేపూ మా .వాళ్లు ఎంతో ప్రేమ నటించేవారు. నా గోడు సుషమకి తెలిసే అవకాశం లేదు.

తను ఉన్నంతసేపూ నాకు కాపలా ఉండేది ఇంట్లో.

చివరికి తెగించి ఆ లెటర్‌తో సుషమకీ లెటర్ రాసి నేర్పుగా ఆమె వచ్చినపుడు



హేండ్ బ్యాగ్‌లో పడేసాను.

'నేను ఆత్మహత్య చేసుకుంటున్నాను.
కానీ నాకు ఆత్మశాంతి కలగాలంటే
అది హత్యగా రుజువు కావాలి. వాళ్ళు జైళ్ళలో
మగ్గాలి.
ఆ సహాయం సుషమ చెయ్యాలి'
అదీ ఉత్తరం

ఆ రాత్రే నేను ఎలుకల మందు కలిపిన పాలు నా చేతులతో నేనే తాగాను.

కానీ చావలేదు.

అది సుషమ పనే అని తర్వాత తెలిసింది.

నేను చావకపోయినా సుషమ నా లెటర్‌ని పోలీసులకి అందజేసింది.

దానిని కంప్లయింట్‌గా తీసుకుని వాళ్ళు నా భర్తను అత్తమావల్ని నానా తిప్పలూ పెట్టారు.

పాపను మాడ్చి చంపినవైనం కూడా రాసిమ్మని సుషమకోరింది.

నాకా ఇంట్లో ఉండాలనిపించలేదు.

రాత్రిళ్ళు నిద్రలో నా పాప ఏడుపులు వెంటాడేవి.

నా గుండెలు బరువెక్కిపోయేవి.

మా పుట్టింటికీ వెళ్ళదలుచుకోలేదు.

నాన్నగారు లేని ఆ ఇల్లు నాదికాబోదు.

అమ్మ ఉన్నా తమ్ముడి అధీన.

నన్ను చూసి ఏడవడం తప్ప ఏం చెయ్యాలేదు.

తమ్ముడు ఉద్యోగం వచ్చి ఆరు నెలలయినా కనీసం చెప్పలేదు. వాడి ఉద్దేశం అర్థమవుతూనే వుంది.

తండ్రి చేసిన కట్నమనే అప్పుతో తనకేం సంబంధం అని.
అత్తింటితో అన్ని బంధాలు తీరిపోయాయి.

నాకెవరూ లేరు.

కానీ నేనందరికీ ఉండాలి.

నేను చచ్చిపోను.

అదొక బలహీన క్షణం.

ఆ ఒక్క క్షణాన్ని సుషమవల్ల దాటాక నాకు మళ్లీ ఆత్మహత్య చేసుకోవాలనిపించడంలేదు.

అభాగ్యుల ఆక్రందనలకు బదులు పలకాలనుకున్నాను. మృత్యుంజయగారి సహాయంతో చిన్న హోం తెరిచాను. అమృత నిట్టూర్చింది.

లోకంలో ఎంతమంది నిస్సహాయంగా విలపిస్తున్నారో. అమృత ఓదార్పు సహకారంతో వాళ్ళ జీవితాలు దారిన పడతాయి. నరకంనుంచి వాళ్ళకి విముక్తి కలుగుతుంది.

భర్త అనేవాడు తాళికట్టిన పుణ్యానికి నరికినా చంపినా కొట్టినా తిట్టినా సహించనవసరంలేదు.

అనామకంగా జీవితం అంతం చేసుకోవడంకంటే తను బతుకును పదిమందికోసం పంచిపెడితే సార్థకత.

ప్రవీణ జీవితం స్త్రీలకు ఆదర్శం కావాలి.

రెడ్‌క్రాస్ వేసివున్న ఫైలు తీసింది.

ప్రముఖ సైకియాట్రిస్టులతో ఇంటర్వ్యూల వివరాలు.

అమృత ఆసక్తిగా చదివింది.

సర్వే ప్రకారం మనదేశంలో ప్రతి ఆరు నిమిషాలకు నలుగురు ఆత్మహత్యకు ప్రయత్నిస్తే అందులో ఒకరు మరణిస్తున్నారని తేలింది. ముఖ్యంగా నగరాల్లో ఎక్కువగా జరుగుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో 40 నుంచి 50 ఆత్మహత్యలు జరుగుతుంటే రికార్డుల్లోకి వచ్చేవి స్వల్పం.

ఆత్మహత్యలు ఇంత ప్రబలడానికి కారణం ఆత్మహత్య చేసుకునే సాధనాలు. నిద్రమాత్రలు ఇంచుమించు ప్రతీ కిళ్లీకొట్టులోనూ దొరకటమే.

మరో డాక్టర్ ఇంటర్వ్యూలో అండర్‌లైన్ చెయ్యబడినవి ఆత్మహత్య ప్రయత్నానికి ముందు వాళ్లలో కొన్ని ప్రత్యేక లక్షణాలు కనిపిస్తాయి.

వాళ్ల దినచర్యలో, ప్రవర్తనలో ఒకేసారి విపరీతమైన మార్పు కనిపిస్తుంది.

దేనిమీదా ఆసక్తి చూపరు.

చచ్చిపోవాలని ఉంది అని నిస్పృహగా అనడం
ఏదో భయం వ్యక్తం చెయ్యడం




స్కిజోఫీనియా లక్షణాలు.

ఇంకో డాక్టర్ ఇంటర్వ్యూ మొత్తంలో కొన్ని లైన్లు అండర్‌లైన్ చేశారు.

ఆత్మహత్యలకు కారణాలను బట్టి ఆత్మహత్య చేసుకోవాలనే తీవ్రతను వారి ప్రయత్నం తెలియజేస్తుంది.

ప్రయత్నం ఎంత భయంకరంగా ఉంటే అంత ఉద్వేగం.

మంటల్లో కాలిపోవడం.
బావిలో దూకడం.
రైలుకింద తలపెట్టడం
విషం పురుగుమందులు తాగడం
నిద్రమాత్రలు మింగడం
లెటర్ రాసి చనిపోవడం.

చాలామంది తమ ప్రయత్నాల్ని సూచనల ద్వారా తమ సన్నిహితులకు తెలియజేస్తారు.

ఆ మాటలే కాకుండా...

సంజ్ఞలు...
చేతలు...

వారికి సన్నిహితులు సరైన ఉపశమనం కలిగిస్తే ఆ ప్రయత్నం విరమించే అవకాశమూ ఉంది.

సాధారణంగా 18-48 మధ్య వయస్సులో అధికమయిన పని ఒత్తిడి రోగపీడనం, మత్తు పదార్థాల అలవాటువల్ల ఆత్మహత్యలకు పాల్పడతారు.

కొందరు డాక్టర్లు చేసిన సూచనలు ఆ ఫైల్లో పెద్ద అక్షరాలలో ఉన్నాయి.

అటువంటి లక్షణాలు కనిపించినవారి మెదడుపై కొన్ని రకాల మందులు ప్రయోగించడం ద్వారా ప్రయత్నం మాన్పించవచ్చు.

హిప్నోటిజం ద్వారా కూడా వారి అంతరాన ఉన్న బాధ అవగాహన చేసుకుని ట్రీట్ చెయ్యొచ్చు.

సాంత్వన వచనాలు జీవం పోస్తాయి.

ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచనకు బీజం ఒక్కక్షణంలో పడుతుంది.

ఒక్క క్షణం దాటితే,
ఆవలి తీరం చేరవచ్చు.

మరో ఫైలులో ఆత్మహత్యల కారణాలు.

వివిధ రకాల వ్యక్తుల వివరాలు పొందుపరిచారు.

పరీక్షలే జీవితం అనుకున్న పిల్లలు తప్పితే.

తల్లిదండ్రుల ప్రేమలో వివక్షత గమనించినపుడు అనాదరణకు గురయిన పిల్లలు.

స్త్రీల విషయానికొస్తే
మనస్థిమితంలేక
అనారోగ్య తీవ్రతకు విసిగి
పేదరికాన్ని తట్టుకోలేక
నిరుద్యోగం
రిటైర్ కాబోయేముందు టెన్షన్
వ్యాపారంలో నష్టపోయిన అవమానం
మోసపోయిన స్త్రీలు
ఆడపిల్లలనే కంటున్న స్త్రీలు
అత్తింటి ఆరళ్లు భరించలేని స్త్రీలు
వరకట్న దురాచారానికి బలయినవాళ్లు
సంసార జీవితంలో పార్టనర్ బెదిరింపులవల్ల
సంఘ విద్రోహశక్తులుగా మారి ఆ జీవితంతో విసిగి
మత్తుమందుల అలవాటు
శాడిస్టు మెంటాలిటీతో నష్టపోయి

ఇలా ఎన్నో కారణాలు.

స్త్రీలు, ఈమధ్య కాలంలో తమ బిడ్డలు అనాథలవుతారనే భయంతో వాళ్లని చంపి మరీ ఆత్మహత్యలు.

ఒక్కోదానికి ఎదురుగా కొన్ని పేర్లు, ఫైలు నంబర్లు.

ఏదిఏమైనా అన్నిటికీ బలహీన మనస్తత్వం, సెన్సిటివిటీ ముఖ్య కారణాలుగా ఉన్నాయి.

అలా చదువుతూనే కుర్చీలో నిద్రపోయింది అమృత.

లేచేసరికి సరస్వతమ్మగారు ఎదురుగా ఉన్నారు.

టేబిల్ మీద గ్లాసునిండా నిమ్మరసం.

సిగ్గు పడింది అమృత.

పెద్దావిడ ఆవిడ తనకు తెచ్చివ్వడం ఏమిటి?

అమృత ఆలోచన గ్రహించినట్టుంది

ఆవిడ.

"ఫర్వాలేదమ్మా తాగు. మీ అమ్మయితే ఇలా అలసిసొలసిన కూతురికి ఇవ్వదా?"

"అమ్మే ఉంటే నా బతుకిలా ఉండేది కాదమ్మమ్మగారూ!"

అమృత కళ్లలో నీళ్లూరాయి.

"తప్పమ్మా! అమృతా! అమ్మ ఉన్నవాళ్ల బతుకులన్నీ సవ్యంగా ఉన్నాయంటావా? అయినా నీకేం లోటు?"

అందరూ ఉండి ఎవరూ లేనట్టయిన ఆవిడ బాధకంటే గొప్పదా తనది. అమృతకు స్ఫురించింది.

తనకేమయిందని దిగులుపడాలి.

జీవితంలో ఏవో ఒడిదుడుగులు వస్తూనే ఉంటాయి. వాటిని తట్టుకుని నిలబడితేనే జీవితం.

"అమృతా నువ్వులేచి కాస్త ముఖం కడుక్కుంటే మనం సుబ్రహ్మణ్యంగారింటికి వెళ్లాలి"

అమృత మనసు ఏదో కీడు శంకించింది.

ఎవరికీ ఏమీ కాలేదు కదా!

అమృతకు ధైర్యం చాల్లేదు అడిగేందుకు.

"యశోదమ్మగారికి గుండెపోటు వచ్చింది. నిన్ను చూడాలని కలవరిస్తున్నారట. వెంటనే తీసుకుని రమ్మని మృత్యుంజయ కబురు చేశాడు.

"ఆవిడిప్పుడు ఎక్కడున్నారు?"

"హాస్పిటల్‌లో. అసలు బతకదనే అనుకున్నారట. కానీ దేవుడు దయ చూశాడు. లేకపోతే ఈ వయసులో సుబ్రహ్మణ్యంగారికి తోడు లేక...

"పదండి వెళ్దాం"

వెంటనే చెప్పులు వేసుకుంది అమృత.

★ ★ ★

అమృత, సరస్వతమ్మగారు వెళ్లేసరికి సుబ్రహ్మణ్యంగారు బయటే కూర్చున్నారు.

రూంలో తల్లి దగ్గిర శారద ఉంది.

అమృతను చూడగానే "వచ్చావా తల్లీ నీ కోసమే అడుగుతోందమ్మా తెలివొచ్చినపుడు"

"అమృతా! నువ్వెళ్లాక ప్రీతి ఆలోచనలతో అమ్మ రోజంతా ఉద్వేగపడింది. దాని ఫలితం ఇది"

అమృతకు మృత్యుంజయ మాట గుర్తొచ్చింది.

"ప్రీతి తన విషయం చెప్పొద్దని వాగ్దానం తీసుకుంది. ఎందుకంటే తెలియకపోతే ఎక్కడో సుఖంగా కాపరం చేసుకుంటోందనుకుంటారు.

తెలిస్తే అమ్మ గుండె పగిలిపోతుంది"

మృత్యుంజయ చెప్పినరోజు. ప్రీతి చావు విషయం వాళ్ల కుటుంబానికి తెలియపర్చకపోవడం అమానుషం అనిపించింది అంతరాంతరాల్లో. కానీ ఇపుడనిపిస్తోంది తెలిసి పడే బాధతీవ్రత ఎక్కువ అని.

యశోదగారికి తెలివొచ్చినట్టుంది.

"అమ్మా అమృత వచ్చింది చూడు!"

బలవంతాన కళ్లు విప్పిందావిడ.

"ప్రీతీ, నా తల్లీ.. వచ్చావా?"

అమృత ఆవిడ చెయ్యి నిమిరింది.

"ఇకమీదట నిన్నలాగే పిలుస్తాను"

"అలాగే పిన్నిగారూ!"

"అమ్మా అను"

అమృత గొంతులో ఉండిపోయింది ఆ మాట.

దాదాపు పాతికేళ్లుగా ఆ మాట వినడమే గాని పిలుపులోని మాధుర్యం అనుభూతి తనకి తెలియదు.

"పిలువ్ అమృతా!"

"అమ్మా!"

మనసులోతుల్ని చీల్చుకు వచ్చింది ఆ మాట.

ఆవిడ తృప్తిగా కళ్లు మూసుకుంది.

ఎవరూ డిస్టర్బ్ చెయ్యదలుచుకోలేదు.

"అమృతా! మీరు రేపుదయం రండి"

మృత్యుంజయ కంఠం విని అదిరిపడింది అమృత.

వారమయింది అతని ముఖం చూసి.




గడ్డం గీయకుండా ఎలా ఉన్నాడో.

జబ్బు పడినట్టున్నాడు.

అతనికి విశ్రాంతి ఎక్కడ?

అందుకే తన సహకారం కోరుతున్నాడేమో

తను అపార్థం చేసుకుంది.

అతన్ని భుజంతట్టి నేనున్నాను అని చెప్పా లనిపించింది అమృతకు ఆ క్షణంలో.



ఆ రాత్రి భోజనం చేసేందుకు సుబ్రహ్మ ణ్యంగారింటికి వెళ్లిన అమృతకు మరో షాక్ తగిలింది.

సగం రాసిన కాగితాలు.

అది అమృత ఫైలు కోసం.

ఆ ఫైలులో తనకి తెలీని కొత్త విషయాలేవీ లేవు.

అది కాదు ఆమెను ఆశ్చర్యపరిచింది.

ఆ దస్తూరీ?

మృత్యుంజయ దస్తూరీ ఇక్కడెందుకుంది.

ఇక్కడ కూర్చుని ఫైల్స్ రాసే టైమేదీ అతనికి.

ఈ దస్తూరీ...

ఇది...

అజ్ఞాతి...

అవును తనను విమర్శిస్తూ రాసిన ఉత్తరా ల్లో ఇదే దస్తూరీ.

అమృత మనసులో రవంత అనుమానం.

వంటచేస్తున్న రమ దగ్గిరకు ఆ కాగితాలు పట్టుకెళ్లి చూపించింది అమృత.

"మృత్యుంజయగారు శారదక్క దస్తూరీ బాగుంటుందని ఆఫీసు ఫైల్స్ అన్నీ తనతో రాయిస్తారు.

అవసరమైన లెటర్స్ కూడా రాసి పెడు తుంది అక్క. ఆయన వాటికి పే చేస్తారు"

అమృత వినడం లేదు.

అయితే అజ్ఞాతి పేరుతో తనకి శారద రాసిందా?

ఎందుకు అన్ని శాపనార్థాలు పెట్టింది.

ఆమెకు తనేం అపకారం చేసింది.

భగవంతుడనే వాడుంటే.
తప్పకుండా ఉండే ఉంటాడు.

మీ జీవితాన్ని అదే బాటలో నడిపించిన రోజున ఆ పసిహృదయాల్లాగే మీ హృదయ మూ వెయ్యి వ్రక్కలయి దిక్కుతోచక మీరు అలమటించిన రోజున మీ తప్పు మీకు తెలు స్తుంది"

అజ్ఞాతి

అందులో ప్రతీ అక్షరమూ తనకి గుర్తే.

అమృత గదిలో తలపట్టుకుని కూర్చుంది.

చప్పున గుర్తొచ్చింది అమృతకు.

ప్రీతి కథ చెప్తూ, "ప్రీతి పతనానికి కారణం అది చదివే పుస్తకాలు. నాకేగానీ ఆముక్త కనిపిస్తే చెంపపగలగొట్టేదాన్ని" అంది శారద క్క ఆ రోజున.

చెల్లెలి జీవితం వక్రమార్గాన పడిందనే బాధతో ఆ ఉత్తరం రాసివుంటుంది.

ఆమె తప్పేముంది?

అమృతకిపుడు మరో బాధ శూలంలా గు చ్చుతోంది.

తనెంత మూర్ఖురాలు?

అజ్ఞాతి మృత్యుంజయ అనే అపోహతో అతన్నెంతగా తిట్టుకుంది, అసహ్యించు కుంది.

ఇపుడు శారదక్క అని తెలిసినా కోపం రావడంలేదు.

తన జీవితంలో మొదట్నుంచీ అన్నింటిలో తొందరపాటే.

తనకు రాయాలనే తపన.



వెంటనే కథరాసింది
అది అచ్చయింది
మరోటి రాసింది
అదీ అచ్చయింది
అంతే ప్రేమకథలు తప్పకుండా అచ్చవు తాయి.
అచ్చులో తన పేరు చూసుకోవాలి.
తన రచనల కోసం పాఠకులు ఎదురు చూడాలి.
ఆ తపనతో అదే బాణీలో,
కాస్త థ్రిల్ కోసం శృంగారం జోడిస్తూ,
ఎన్నో రాసింది.
రాహుల్ విషయంలో అంతే...

తన అందం కోసం ఎరవేస్తున్నాడనుకోలేదు.

ఎవరూలేనిది, ఏం చేయగలదు... అనే ధీమాతో తనతో ప్రేమ సరదాలు తీర్చుకుంటున్నాడు అనుకోలేదు.

తన ప్రేమకథల ఊబిలో తనే పడింది.

అక్షరాలా తన పాత్రలెలా ప్రవర్తిస్తాయో అలాగే కళ్లు మూసుకుంది.

రాసిన తనే అలా ఊబిలో పడినపుడు. అభం శుభం తెలియని.. వయసు ఉద్వేగంతో, పరవళ్లు తొక్కుతూ గారడీ చేసే టీనేజి పిల్లలు ఏమవుతారని ఆలోచించిందా?

లేదు...

అమృతకు అన్నం సహించలేదు.

మృత్యుంజయని చూడాలి.

రాత్రే వెళ్లిపోతే అతను ఏమీ అనడు.

కానీ అది సుగ్రీవాజ్ఞలా అనిపించింది.

ఆ రాత్రి యశోదమ్మగారి వద్ద ఉన్నంత సేపూ అన్యమనస్కంగానే ఉంది అమృత.

"ఏమ్మా ఒంట్లో బాగాలేదా! పోయి పడుకో" అందావిడ, శారద కూడా...

"చాలా నీరసంగా ఉన్నావు అమృతా! నువ్వు పడుకో" అంది.

★ ★ ★

ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురు చూసింది అమృత.

ఆమెకు ఆశ్రమంలో మృత్యుంజయతో మాట్లాడాలి అని వుంది.

ఎనిమిది గంటలకు విశ్వం కారు తీసుకు వచ్చాడు. అందరితో మళ్లీ వస్తానని చెప్పి బయలుదేరింది అమృత.

విశ్వాన్ని చూస్తే కొత్తగా ఉంది అతని ఫైల్ చదివాక.

ముక్కుకు సూటిగా డ్రైవ్ చేసుకుపోతున్న అతను వింతగా అనిపించాడు.

స్ట్రెయిట్ ఫార్వడ్ నేచర్ అన్నమాట.

"ఏమీ కొత్త సంగతులు లేవుగా" అంది అమృత.

అతను తలతిప్పి వింతగా చూశాడు ఒక్క క్షణం.

మళ్లీ కలవరంగా తల తిప్పుకున్నాడు.

"ఏమీలేవు" బాస్ తీసుకు రమ్మన్నారంతే.

అమృత వెళ్లేసరికి మృత్యుంజయ నీట్‌గా షేవ్ చేసుకుని ఉన్నాడు. నిన్న కనిపించిన అలసట, అనారోగ్యపురూపు మచ్చుకైనా కనిపించలేదు.

అతనిలో ప్రత్యేకత అదే.

ఒక్కోసారి ఎంత అలసటగా కనిపిస్తాడో మరుక్షణం అంత ఆరోగ్యంగా ఉంటాడు.

"కూర్చోండి అమృతా! మీతో మాట్లాడాలి. ఈ రోజు కాకపోతే మరెప్పట్లో కుదరదు. ఇప్పటికే చాలా ఆలస్యమయిపోయింది"

అమృత అతని ఎదురుగా కూర్చుంది.

"నన్ను క్షమించండి" ఆమె గొంతులో అతి సౌమ్యత అద్దంలా.

"దేనికి"

"ఏవో అనుమానాలతో బాధపడుతూ మిమ్మల్ని చాలా శ్రమ పెట్టాను"

"అమృతకు తను సుప్రియ ఆపరేషన్ రోజున అతనికి చెప్పకుండా కోపంతో తను వెళ్లిపోవడం, రాహుల్ చేసిన అవమానం, దిక్కుతోచక అలా నడుస్తూ పోతూ ఉంటే అన్ని గంటలు తనకోసం వెదకి వేసారి పోయిన మృత్యుంజయ కారు తన పక్కనే ఆగడం, అతని మొహంలో ఆ క్షణాన కనిపించిన రిలీఫ్... నలభై లంకణాలు చేసి తగ్గి పత్యం

తిన్న రోగిలా ఉంది.

"అది సహజం అమృతా! మీ స్థానంలో నేనున్నా అంతే. అది సరే. ఫైల్ చూస్తున్నారు కదా! మీకేమనిపించింది"

"ఇదొక పరిశోధనాశాల. మీరో పెద్ద సైంటిస్టు అని"

అతని మొహం మీద వెలసిన చిరునవ్వు వెలలేనిది.

అమృత హాయిగా నిట్టూర్చింది.

"అపుడే నిట్టూర్చకండి. మీకప్పజెప్పబోయే పని గురుతరమైనది. అది పూర్తయాక అంతటి నిట్టూర్పు అవసరమవుతుంది"

"ఇపుడు జీవితంలో ఏదీ బరువైన పని, సమస్య అనిపించవు నాకు"

"అంతటి జ్ఞానవృద్ధులయారన్నమాట. భేష్!"

"మీ దయవల్ల..."

"అమృతా మనమధ్య అటువంటి మాటలొద్దు. కాస్త ఆలస్యమైనా మీరు నన్నర్థం చేసుకున్నారంతే చాలు. జీవితంలో నాకింతకంటే అదృష్టముండదు. మనం అలా బయట నడుస్తూ మాట్లాడుకుందాం రండి"

ఆశ్రమంలో నడుస్తూంటే అదీ అతని పక్కపక్కగా అమృతకు ఎన్నడూలేనంత రిలీఫ్‌గా ఉంది. ఇన్నాళ్లకి ఇది నాది అనిపిస్తోంది. ఆమెలో ఈ మార్పు అతను గుర్తించాడు. అతని హృదయం ఆనందంతో నిండిపోయింది.

"అమృతా! ఈ జీవితం ఇలా ఎందుకు మొదలుపెట్టానో, ఇన్నాళ్లుగా ఇది ఎలా నడిచిందో నాకేతెలియదు. కానీ నాదో ఆశ... అది దురాశకాదనుకుంటాను. మనం చేతలద్వారా ఎంతటి సర్వీసుచేసినా రాతలద్వారా ఎంతో మందిని చైతన్యవంతులను చెయ్యొచ్చని నా ప్రగాఢ విశ్వాసం. అందుకే... అందుకే మిమ్మల్ని ఎంచుకున్నాను"

"దేనికి?"

"నా ఆశయ సాఫల్యానికి మీలాంటి రచయిత్రి చాలా అవసరం" అమృత నిర్వేదపడింది.

"తను రచయిత్రా? ఊహల ఉయ్యాలతో మబ్బుల్లోకి నిచ్చెన వేసి అమాయకుల ప్రాణాలతో చెలగాటమాడిన తను, కేవలం అచ్చులో తన పేరుకోసం తను కోరుకునే ఊహల్ని జిలిబిలిగా అల్లి ప్రజలమీదకు వదిలింది"

"మీ ఆలోచన నాకర్థమయింది అమృతా!"

అమృతకు ఆశ్చర్యంగా ఉంది. తను వచ్చిన కొత్తలో కూడా ఇలాగే తన ఆలోచనల్ని చదివేవాడు. ఇతనికా విద్య ఎలా పట్టుబడింది?

"అనుభవాలు నేర్పిన పాఠాలు అమృతా!"

"మీరు పాఠకుల పట్టు తెలిసినవారు"

అది తప్పకుండా పొగడ్తే.

"కానీ నేనింక కలం పట్టదలుచుకోలేదు" అతి సహజంగా పలికింది ఆమె కంఠం.

అతను ఖంగుతిన్నాడు.

"అదే నిజమైతే ఇన్నాళ్ల నా శ్రమ వృధా అయినట్టే"

మృత్యుంజయ కంఠంలో ధ్వనించిన నిరాశకు ఆమె మనసు విలవిల్లాడింది. అతనికి విడమర్చి చెప్పాలనే ఆదుర్దాలో అంది అమృత...

"ఆ అమృత చచ్చిపోయింది మృత్యుంజయగారూ! ఎందుకంటే నా రచనల ప్రభావం నేను స్వయంగా చవి చూడడమేకాదు అభం శుభం తెలియని ప్రీతి వంటి వాళ్లమీద అవి ఎంతటి విష ప్రభావాన్ని చూపించగలవో అర్థం చేసుకున్నాను. రచనల పరమార్థం పురోగతిగానీ నాశనం కాదు. అది తెలిసీ నేనింకా కలం పట్టగలనంటారా?"

"మీరు సరైన తోవలోకి వచ్చారు. కాకపోతే చిన్న సవరణ, రచనల పరమార్థం పురోగతి అని మీరే అన్నారు. అటువంటి పురోగతి మీవంటి స్థితి సాధించినవాళ్లవల్లనే అవుతుంది. అందుకే నేనింతకాలం ఎదురు చూశాను"

వాళ్లిద్దరూ చాలాదూరం నడిచి వచ్చేశారు. పెద్ద మర్రిచెట్టుకింద కూర్చున్నారు.

"అమృతా! పాఠకులకు మీరేం రాసినా చదివించగల శక్తి మీకుంది. అటువంటి శక్తివంతమైన హస్తం సహకారమే నాక్కావాలి.




నేనిన్నాళ్లూ చేసిందొక ఎత్తు, మీరు చేయబో యేది మరో ఎత్తు''

ఆమెకేసి చూశాడు.

''చెప్పండి''

అందులో రవంత అంగీకారం ధ్వ నించింది.

అది చాలు అతనికి ఆమెను తనదారిలోకి తెచ్చుకునేందుకు.

''ఇంతవరకూ మేం చేసిన కృషి అంతా మీరన్న ప్రయోగశాలలో ఫైల్స్ రూపంలో ఉంది. ఇంకా మీరు కోరిన సమాచారం అంతా మన విశ్వం, ప్రద్యుమ్న ఇక్కడున్న అందరూ అందిస్తారు. మీరు స్వయంగా కొన్ని తెలునుకు న్నారు.

వీటిన్నిటితో నాకు 'అమృతహస్తం' కావాలి''

ఉలిక్కిపడింది అమృత.

''అమృత హస్తం''

''జీవితంలో నా మొదటిది చివరది కోరిక అదే అమృతా! ఆత్మహత్యల రేటు ముఖ్యంగా నగరాల్లో మరీ ఎక్కువవుతోంది. అవి ఎక్కడ జరుగుతున్నాయో తెలునుకుని మనం అరిక ట్టడం ఒక వంతయితే దానికి తోడుగా అనలు ఆ దృక్పథాన్నే మార్చే విధానం ఉంటే ఎంత బాగుంటుందీ!

''ఆత్మహత్యలు చేసుకుంటున్నవాళ్లు అనా మకులుకాదు.

''విద్యాగంధం లేనివారు కాదు,

''అయినా నమస్యల్ని నుడిగుండంగా భావించుకునే బలహీనత ఎక్కువైంది.

''దానికి కారణం

''పెరుగుతున్న జీవన వేగం

''అవినీతి..

''దురాచారాలు

''స్వార్థం... ఏదయినా కావచ్చు.

''ఉక్కిరి బిక్కిరయిపోతున్న మనిషి తట్టు కునే స్థైర్యం కోల్పోతున్నాడు.

''ఎందుకు?

''నరయిన అవగాహనలేక

''జీవిత మాధుర్యం తెలియక

''జీవితం విలువ తెలియక

''మిమ్మల్నే ఉదాహరణ తీసుకోండి!

''మీ నమన్య పరిష్కరించలేనిది కాదు.

''కానీ ఆ క్షణంలో మిమ్మల్నావహించిన మానసిక ఉద్వేగం.. బలహీనత, జీవితంపట్ల ఆసక్తిని చంపేసాయి.

''ప్రజలకు ఎంతో ఉపయోగపడవలసిన మీ జీవితం ఒక్కక్షణంలో నీటి పాలయేది''

అతని కంఠంలో వణకు స్పష్టంగా గు ర్తించింది.

''ఆ క్షణం తలుచుకుంటే నాకిప్పటికీ ఎంత భయం వేస్తుందని

''మీరొక అపురూప వజ్రం అమృతా!

''మీరు గడిపిన జీవితంవల్ల, మీరేర్పరచు కున్న అభిప్రాయాల వల్ల అది బొగ్గులా ఇన్నా ళ్లూ ప్రకాశించలేకపోయింది.

''ఆ వజ్రాన్ని సానబట్టి నా స్వంతం చేసుకు న్నాను.

''ఇప్పుడు నాకు నిశ్చింత''

అమృత అతని కంఠంలో వస్తున్న మార్పు ల్ని అర్థ నిమిలీత నేత్రాలతో గమనిస్తూంది.

అతను మోచేతుల మీద వెనక్కివాలి ఉన్నాడు. చెట్ల నందుల్లోంచి అతని మీదుగా రవి కిరణాలుపడి మెరుస్తున్నాయి.

అతడు కళ్లుమూనుకుని ఒకరకమైన తన్మ యావస్థలో ఉన్నాడు.

''నిజం అమృతా! మీరు ప్రజలకు అమృత హస్తం అందించాలి.

''క్షీరసాగరాన్ని మథించి అమృతాన్ని వెలికి తీయండి.

''ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసే రచనకు జన్మనివ్వండి.

''జీవితం అంటే ఆటవస్తువుకాదు.

''ఒక్కక్షణం బలహీనతకు అంతం చేసు కునే అల్పమైనది కాదు అని జనాన్ని జా గృతం చెయ్యండి.

''జీవితం విలువ అనల్పం అని తెలియజే యండి.

''తమకక్కర్లేదు ఆ జీవితం అనుకుంటే ఆ

మిగిలిన జీవితాన్ని నిస్వార్థంతో ప్రజా సంక్షేమం కోసం ధారపొయ్యమనండి.

"మీరేం చేస్తారో

"ఎలా రాస్తారో... నాకు తెలియదు.

"అమృత హస్తం ధారావాహికంగా ఈ వారంనుంచే మొదలవాలి"

ఉలిక్కిపడింది అమృత.

"ఏమిటి మీరనేది"

"అవును.. నా మిత్రునిదే జనమిత్ర. అందులో మీ సీరియల్ మొదలవుతుంది"

"నేనింతవరకు కథలు మాత్రమే రాసాను"

"అది చాలు. మీరు వారం వారం మేటర్ అందిస్తూండండి.

"విశ్వం మిగిలింది చూసుకుంటాడు.

"అమృతహస్తం నడుస్తున్నంతకాలం మీరీ ఆశ్రమం వదలరు. మీకు కావలసిన అన్ని సదుపాయాలు నేను సమకూరుస్తాను. మీరొప్పుకున్నట్టే మీకు నేనిస్తానన్న ఉద్యోగం కూడా ఇదే"

అమృత కంగారుపడింది.

"అమృతా ఇపుడు నాకెంతో నిశ్చింతగా ఉంది. అమృతహస్తం ఆర్నెల్లలో కాకపోతే ఏడాదిలో పూర్తవుతుంది. నేనీరోజు ఊరెళ్లాలి. మళ్లీ మీ రచన పూర్తయేలోగా మీకు నేను కనిపించను"

అమృతలో కలవరం.

"కంగారుపడకండి. ఇది ఉద్యోగం అని చెప్పానుగా! మీకిక్కడ మందీ మార్బలం ఉంటారు. మీ నవలకు మేమిచ్చే పారితోషికమే మీ జీతం అనుకోండి.

"మీరీ పని చేస్తే మిగిలిన మృత్యుంజయ ఆశ్రమాలను అమృత ఆశ్రమాలుగా మార్చే సుదీర్ఘమైన వ్యాపారంలో నేను నిశ్చింతగా మునిగివుంటాను. ఈ దేశంలో అన్ని నగరాలు మనవే. ఈ ఆశ్రమాల అవసరం కొన్నాళ్లే అమృతా!"

"మీ అమృత హస్తం ప్రభావంతో మృత్యుభయం పోవాలి ప్రజలకు"

అమృత ఈసారి భయపడలేదు.

'ఇది నాకు సాధ్యపడుతుందా' అనలేదు.

ఆమెలో ఏదో తెలియని ఉద్వేగం.

తపన...

సాధించాలనే కార్యదీక్ష...

పట్టుదల...

ఆమె ముఖంమీద ప్రతిఫలిస్తున్న భావాలను చూసి సంతృప్తిపడ్డాడు మృత్యుంజయ.

ఆమె చెయ్యి తన చేతిలోకి తీసుకున్నాడు.

అమృత అడ్డుపెట్టలేదు.

ఆమెకది ఎబ్బెట్టుగా అనిపించలేదు.

ఆ స్పర్శ ఆమెకు విపరీతమైన స్థైర్యాన్ని కలిగిస్తోంది.

అది చాలు తన పురోగమనానికి.

ఎట్టి పరిస్థితుల్లోను తన రచన పూర్తయ్యేవరకు దీక్షనాపదు.

"థాంక్యూ అమృతా! నేను కోరుకున్నదిదే"

ఆమె మనసును చదివి అన్నాడో మరెందుకో ఆ క్షణంలో ఆమెకర్థం కాకపోయినా మరి తర్కించుకోలేదు.

నెమ్మదిగా పైకి లేచి ఆమెకు చేయినందించాడు. నిస్సంకోచంగా ఆ చెయ్యినందుకుంది.

అప్పటికి సూర్యాస్తమయమైంది.

వాళ్లిద్దరూ ఆశ్రమంవైపు నడుస్తుంటే విశ్వం, ప్రద్యుమ్న ఎదురొచ్చారు.

"బాస్! రాగింగ్ మొదలయ్యింది"

★ ★ ★

"ర్యాగింగ్"

అంతవరకూ విడీవిడని బాల్యంతో హైస్కూలు స్థాయినుంచి కాలేజీలలో అడుగుపెట్టే యువత.

అప్పటికే కాలేజీ జీవితం గడుపుతున్న సీనియర్ విద్యార్థులు కొత్త విద్యార్థులలో బెరుకు, సిగ్గు, సంకోచాలను పోగొట్టేందుకు మొదలైన స్నేహపూరితమైన సద్భావనా ప్రక్రియ, ఒకప్పుడు రాగింగ్ అంటే..

అదీ కొన్నాళ్లు ప్రొఫెషనల్ కాలేజీలకే పరిమితంగా ఉండేది. కానీ ఇక్కడ దాదాపు అన్ని కాలేజీల్లోనూ ఇదొక వినోద సాధనం ఈనాడు.




సిగ్గు, అభిమానం, మానవత్వం మర్చిపోయి కొత్తవారిని వీలైనంత తారాస్థాయిలో భయపెట్టగల ఏకైక వినోదం ర్యాగింగ్.

పాత విద్యార్థుల అమానుష ప్రవర్తనలవల్ల ప్రతీ సంవత్సరం అవమానం భరించలేక ఆత్మహత్యలు చేసుకుంటున్న సున్నిత మనస్కులయిన విద్యార్థులెందరో.

వారి తల్లిదండ్రుల గర్భశోకం ఎవరు తీర్చగలరు?

విద్యార్థినులు కూడా ర్యాగింగ్‌లో ఏమీ తీసిపోలేదు.

ర్యాగింగ్‌ను ఆపగల శక్తి ఈ రోజుల్లో ఎవరికీ లేదనే చెప్పాలి.

అయినా ర్యాగింగ్ ఫైల్ ఆశాజనకమైన ఫైల్స్‌లో అంటే గ్రీన్ ఫైల్స్‌లో ఉంచాడు మృత్యుంజయ.

తన వాళ్లను అప్రమత్తం చేసి అన్ని చోట్లా విద్యార్థుల్లో విద్యార్థుల్లా కలిసిపోయేలా విస్తరింపచేశాడు.

ఒక మానవతావాదిగా కాలేజీల అధికారులను కలుసుకుని అప్రమత్తం చేశాడు.

ర్యాగింగ్‌లో కలుగజేసుకుని విద్యార్థులకు వ్యతిరేకంగా ప్రవర్తించి రెచ్చగొడితే ఎన్నో సమస్యలుత్పన్నం కావచ్చు.

అందుకే కొత్త విద్యార్థులను నీడలా అనుసరించే మెరికల్లాంటి మనుషులను నియమించాడు.

విశ్వం, ప్రద్యుమ్న, సుషమ, ప్రవీణ, మరో డజనుమంది ఫ్రెండ్స్‌తో మృత్యుంజయ చేసిన చర్చను అమృత వింటూ వుండిపోయింది.

వాళ్ల అద్భుతమైన వ్యూహానికి విస్తుపోయింది.

వాళ్లతోపాటు మృత్యుంజయకూడా వెళ్లిపోగానే.

ఆమె ఒకరకమైన ఉద్వేగానికి లోనైంది కాసేపు.

రచన మొదలు పెట్టేముందు ఆమె స్థితి సాధారణంగా అలాగే వుంటుంది.

ఆమె ఆలస్యం చెయ్యలేదు. తన నవలకు ప్రారంభం ఇక్కడనుంచే.

ర్యాగింగ్ మొదటి భాగం నుంచే మొదలవాలి.

ప్రస్తుత సమస్య కాలానికి అనుగుణంగా ఉన్నదే కనుక పాఠకుల అటెన్షన్ తప్పకుండా సాధించగలదు.

అంతే...

ఆఫీసురూంలో ఆమెను ఆ క్షణంలో చూస్తే, సుదీర్ఘ తపస్సులో ఉన్న యోగిని గుర్తుకొస్తుంది.

పాత్రల కనుగుణంగా ఆమె ముఖంలో భావాలు మారుతున్నాయి. చేతిలో కలం అతి వేగంగా నృత్యం చేస్తూంది, తెల్లని మీగడ వంటి కాగితాల మీద.

అలా ఎంతసేపు రాసిందో ఆమెకు తెలియదు.

"అమ్మా అమృతా కాఫీ"

సరస్వతమ్మగారు అమృతను స్పృశించారు.

ఏ లోకంనుంచో వచ్చినట్టు ఒక్కక్షణం తనెక్కడుందో అర్థం కాలేదు.

చూస్తే తెల్లారిపోతోంది.

ఎర్రబడి నిద్రలేమిని సూచించే కళ్లు.

రేగిన జుట్లు..

అలసటగా ఉన్నా అమృత ముఖంలో ద్యోతకమవుతున్న సంతోషానికి అబ్బురపడింది సరస్వతమ్మగారు ఒక్కక్షణం.

"అమ్మమ్మగారూ! నాకు మరో కప్పు కాఫీ కావాలి"

కుర్చీ వెనుకనుండి వినిపించిన స్వరానికి ఒకసారి ఉలిక్కిపడింది అమృత.

వెనక్కి తిరిగితే మృత్యుంజయ.

అతడు తను రాసి కిందపారేసిన కాగితాలన్నీ చక్కగా సర్ది బొత్తిగా పెట్టినట్టున్నాడు.

అది చూసి రవంత సిగ్గుపడింది అమృత.

తనకిదో అలవాటు.

చకచకా రాసిన కాగితాలు కింద పారేయడం.

అంతా అయాక చూస్తే రూం నిండా కాగితా

లు చెల్లాచెదరుగా పడుండేవి.

మృత్యుంజయ రాత్రి ఎప్పుడొచ్చాడో ఎంత సేపట్నుంచీ ఆ పని చేస్తున్నాడో కూడా తను గమనించలేదు.

"మీ ఏకాగ్రత వండర్‌ఫుల్ అమృతా! దాదాపు రెండు గంటలసేపు మీతోబాటు నేనూ ఇక్కడే ఉన్నా మీరు కనీసం తలెత్తి కూడా చూడలేదు"

చిరునవ్వుతో అమృత లేచి చేతి మెటికలు విరుచుకుంది.

"ప్రారంభమే చాలా బాగా, అనుకోనంత బాగా వచ్చింది. పొగుడ్తున్నాననుకోకండి. నాకే ఇంత అద్భుతంగా ఉంటే వాహ్!"

మాట తప్పించింది అమృత.

ఇది వరలోలా ఇపుడు పొగడ్తలు వినాలని పించలేదామెకి.

తనలో రగులుతున్న దావాగ్ని బయటపడాలి. అందులో బలహీనతలన్నీ దగ్ధమైపోవాలి. అమలిన సువర్ణంలా మిగలాలి.

"ఇంతకీ మీరెళ్లిన పని ఏమయింది?"

"గ్రాండ్ సక్సెస్ అమృతా! ఇద్దరాడపిల్లలు, ముగ్గురు లేత అబ్బాయిలు చాలా హర్ట్ య్యారు. అతి నీచమైన ర్యాగింగ్.

దిగంబరంగా హాస్టల్ వార్డ్ అంతా పరిగెత్తించారుట ఇద్దరిని.

బారెడు జడ కత్తెరపాలయ్యిందిట ఒక పిల్లకి.

ముద్దులు పెట్టుకునే ప్రహసనం మరొకరికి.

భరతనాట్యం ఇంకొకరిది.

ముందునుంచీ ర్యాగింగ్ ఎంతో భయంకరంగా ఉంటుందని ఊహించుకునే ఉన్నా అది అనుభవంలో తట్టుకోలేకపోయారు.

కానీ మనవాళ్లు వాళ్లను ఊరడించడంలో సఫలీకృతులయారు. మరొక్క పదిరోజులు జాగ్రత్తగా ఉంటేచాలు.

తేలిగ్గా నిట్టూర్చింది అమృత.

వినడానికి నాలుగైదు వాక్యాల్లో ఉన్నా వాటి వెనుక ఎంతటి శ్రమ, కృషి ఉన్నాయో తను అర్థం చేసుకోగలదు.

"అమృతా నాకెంతో తృప్తిగా ఉంది. మీ అమృతహస్తం ప్రారంభం అచ్చులోకంటే ముందుగానే మీ ముందే చదివే అదృష్టం మరి రాదనుకుంటాను. ఎందుకంటే ఇప్పటికే నా ప్రయాణం ఆలస్యమైంది. మీకు చెప్పి వెళ్లాలనే మీ తపస్సు మీ అంతట మీరే ఆపేవరకు నిరీక్షించాను. మరి సెలవా?"

అమృత మనస్సు కలుక్కుమంది.

కానీ తప్పదు.

అతనిని ఆపేశక్తి ఇప్పట్లో తనకులేదు.

తన దీక్ష అతడు తనకిచ్చిన అసైన్‌మెంటు పూర్తయ్యాక అపుడు తనొకవరం అడుగుతుంది.

అది స్వార్థపూరితమైనదైనా అతడు కాదనడని ఎందుకో నమ్మకం.

రెండు చేతులూ జోడించింది అమృత.

అతడు కనుమరుగు కాగానే తన శరీరంలో ఏదో భాగం ఎవరో కోసి తీసుకుపోయినట్టుంది.

ఆ వెలితి భరించలేనిది.

ఇంతకుముందెన్నడూ అనుభవించనిది.

అతని కోసం ఆమె నిరీక్షణ అప్పుడే మొదలయ్యింది.

★ ★ ★

మృత్యుంజయ వెళ్లిపోయాక అమృత ఆఫీసురూంలో కూర్చోలేకపోయింది.

ప్రార్థన అయిపోయాక ఎంతోసేపు అలాగే కూర్చుండి పోయింది మంటపం మీద.

ఆమె స్మృతిపథంలో ఎన్నో వరసగా కదిలి పోతున్నాయి.

ప్రీతి డైరీ దగ్గర ఆగిపోయింది ఆమె ఆలోచన. ఆమెకు మళ్లీ కొత్తగా ఎంతో దుఃఖం వచ్చింది.

ప్రీతి జీవితం మృత్యుంజయ ఊహించినట్టే అయింది.

ఆ డైరీలో???

ప్రతీ పేజీలోనూ ప్రీతి అనుభవించిన అంతులేని వేదన, నిజాన్ని జీర్ణించుకోలేక ఆ లేత మనసు పడిన తపన, సాలీడు గూట్లో చిక్కుకున్న ఈగలా ఎటూ దారిలేక అల్లాడిపో




యిన ఆక్రందన అది.

"నా ఆశలన్నీ అడియాశలయ్యాయి.

నా కుటుంబాన్ని ఆదుకోవాలనుకున్నాను.

అన్నయ్యకు ఉద్యోగం,

అక్కకి పెళ్లి,

కానీ అవి నాకిపుడు సమస్యలుగానే కని పించడంలేదు. అవన్నీ నా సమస్య అనే పెద్ద గీతముందు చిన్న గీతల్లా ఉన్నాయి. రోజూ నరకం.

అసలు కుమార్‌కి అన్ని పెళ్లిళ్లయ్యాయని అతని ముఖం చూసిన ఏ ఆడపిల్లా గ్రహించ లేదు. అతడు ఏడు పెళ్లిళ్లు చేసుకున్నాడని తెలిసి నాకు మూర్ఛవచ్చింది.

ఆ ఏడుగురినీ నాలాగే మోసగించి హనీ మూన్‌కి తీసుకొచ్చి ఇక్కడ...

వాళ్లను ఇక్కడకు వచ్చిన కొత్తలో చూసి అలాంటి రూపురేఖలున్న వాళ్లని ఎలా చేసుకు న్నాడా అని కుమార్ మీద జాలిపడ్డాను.

కానీ కొన్నాళ్లకు నా జీవితమే జాలిపడదగిన జీవితమవుతుందని ఊహించలేక పోయాను.

మూడు రాత్రులూ అనారోగ్యం సాకుతో నన్ను మభ్యపెట్టాడు. పగలు ఎవరెవర్నో స్నే హితులని చెప్పి పరిచయం చేసేవాడు.

వాళ్ల చేష్టలు చికాకు కలిగించినా కుమార్‌కి కోపం వస్తుందేమోనని బెరుకు.

కానీ కుమార్ స్వయంగా వాళ్లను నా మీదకి దండయాత్ర చేయించాడని తెలిసిన రోజున ఈ భూమి ఒక్కసారి పగిలిపోయి నేనందులో ఎందుకు కూరుకు పోలేదా అనిపించింది.

కానీ చిట్లిన గాజులతో,

వాళ్ల అమానుషత్వంతో నా ఒళ్లంతా అయిన గాయాలు,
రేగిపోయిన జుట్టుతో...
అద్దంలో చూసుకుంటే అందరూ బంగారుబొ మ్మ అని పొగడే ప్రీతినేనా అనిపించింది.

కొన్నాళ్లకు నాకు ఏడిచే అవకాశం, ఏడవడా నికి ఓపికా తగ్గిపోయాయి.

పిల్లలంటే నాకెంతో ఇష్టం.

నా కల ఎంత అందమైనది.

అందాల పొదరిల్లు...

అందులో నేను. మన్మధుడిలాంటి నా భర్త.

నా చిన్నారి పాపలు..

ఆ స్వర్గం చేజారిపోయింది.

గర్భవతినని తెలిసి పారిపోవాలని ప్రయ త్నించాను. కానీ నా శరీరం రుచి మరిగిన పులులు ఎందుకు వదుల్తాయి.

నాలోని బిడ్డ ఆక్రందన నాకు వినిపిస్తోంది.

ఆ మరణవేదన నన్నెన్నో శాపాలు పెడు తోంది.

కానీ నేను అన్నివిధాల అశక్తురాలిని.

చచ్చిపోయేందుకు కూడా నాకు స్వేచ్ఛలే దు.

కానీ భగవంతుడు నా మొరాలకించాడు ఇన్నాళ్లకు.

ఇద్దరు బిడ్డల్ని మొగ్గలుగానే తుంచేసిన ఆ త్రాష్టుడికి నాతోపాటు భయంకరమైన శిక్షప డినందుకు నాలో ఏదో ఆనందం.

నాకు ఎయిడ్స్ అని తెలిసిన రోజున విరగ బడి నవ్వాను.

నేను త్వరలో చచ్చిపోతున్నానని నాకసలు విచారమే కలగలేదు.

నాతో సంబంధం పెట్టుకుని నన్ను పీల్చి పిప్పి చేసిన వాళ్లంతా కుమార్‌తో సహా ప్రాణ భయంతో గజగజా విలవిల్లాడుతూ ఎలా వణి కిపోతారో గుర్తొచ్చిన కొద్దీ వికటానందం.

భగవంతుడున్నాడు అనిపించిన ఏకైక శుభక్షణం.

నేనెపుడు చచ్చిపోతానో నాకు తెలియదు.

కానీ ఇపుడు నాకు గత జీవితం గుర్తొచ్చి నేనెంత కళ్లు మూసుకుని ప్రవర్తించానో తెలిసి ఎంతో బాధకలుగుతోంది.

చేసిన ఏ వస్తువయినా నాకు ముందుగా స్వయంగా కొసరికొసరి తినిపించే అమ్మ గారాబం,

నాన్న ఆప్యాయత, చెల్లిప్రేమ...

తన చీరలు కూడా మానుకుని నేను సంబర పడితే చాలనుకునే శారదక్క,

అన్నయ్య అభిమానం.



శారదక్క మాటలు ఆ రోజు నాకర్థం కాలేదు.

'జాగ్రత్త ప్రీతీ, నెమ్మదిగా నడు, కాలుజారితే ప్రమాదం' ఆ ప్రమాదం కాలుజారిన రోజునే నాకర్థమయింది. అప్పటికే నేనగాధంలోకి కూరుకుపోయాను.

నాకొక్కటే కోరిక.

నేను పోయాక నా డైరీ చూసిన ధర్మదాతలెవరైనా దీనిని ఆముక్తగారికి చేరవేయండి.

నాలా అగాధంలో కూరుకుపోకుండా ఎందరో యువతను రక్షించగల శక్తీ బాధ్యతా ఆమెకే ఉన్నాయి"

"అమృతా!"

ప్రద్యుమ్న పిలుపుతో ఈ లోకంలోకి వచ్చింది అమృత.

"ఆ మృత్యుంజయుని విగ్రహాన్ని ఎంత సేపు చూసినా తనివి తీరడం లేదుగదూ!"

తన దృష్టి ఎక్కడో ఉందన్న సంగతి తెలియడంలేదన్న మాట. భౌతికంగా మార్కండేయస్వామిని చూస్తున్నట్టుంది.

"అవును" ఏమనాలో అంతకంటే తెలీలేదు అమృతకు.

"అది చెక్కింది సాక్షాత్తూ మృత్యుంజయగారే"

"ఆ!" అమృత నోరు విస్మయంతో తెరిచింది.



# ఏరిన ముత్యాలు

★ సృష్టిలో అతిగొప్పది, అత్యంత సుందరమైనది 'స్నేహం'

--ఎమర్సన్

★ మనలో వున్న లోపాలవంటి లోపాలుగల వ్యక్తులతోనే నిజంగా మనం స్నేహంగా వుంటాం.

--జార్జి జోనాదన్

★ అవసరానికి ఆదుకునే మిత్రులున్న వ్యక్తి అదృష్టవంతుడు. కానీ మిత్రుల సహాయాన్ని స్వీకరించాల్సిన అవసరం రానివ్యక్తి మరింత అదృష్ట వంతుడు.

--వార్విక్

★ నీకంటే ఉత్తముడుకాని వ్యక్తితో స్నేహం చెయ్యకు.

-- కన్ఫ్యూషియస్

★ సూర్యునియొక్క నిజరూపాన్ని మనం సూర్యోదయ సమయంలోనూ, అస్తమయ సమయంలోనూ మాత్రమే చూడగలం. అలాగే మనుషుల సహజస్వభావాలు వారి బాల్యంలోనూ, నిర్యాణ సమయంలోనే చూడగలం.

— బాయిల్

★ నిజమైన స్నేహం నీ దుఃఖాన్ని భాగిస్తుంది. ఆనందాన్ని హెచ్చిస్తుంది.

--ఆంగ్ల సామెత

★ ఇతరుల చెడు స్వభావాన్ని సహించడమే మంచి స్వభావంలోని గొప్పగుణం.

— ఎంప్సన్

★ మానవుడన్న తర్వాత ఏవో గుణదోషాలుంటాయి. ఆవేశం వచ్చి పైకి కొంచెం కటువుగా మాట్లాడినంత మాత్రాన అతని స్వభావం అంతేనని నిశ్చయించుకోకూడదు.

— శరత్

★ శత్రువు ఇచ్చే కపటమైన ముద్దులకన్నా మిత్రుని చేతిదెబ్బలే మిన్న.

-- థామస్.ఎ. బెకెట్

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

"ఆయన చక్కని శిల్పి. హాబీగా నేర్చుకున్న కళతో తన ఆశ్రమంలోనే మనకిది కానుకగా చెక్కి ఇచ్చారు"

"ఇవాళ రెస్టేనా? అమ్మగారికెలా ఉంది?"

ప్రద్యుమ్నతో అంత డైరెక్టుగా ఎపుడూ మాట్లాడలేదు అమృత.

"బాగానే ఉంది. మిమ్మల్ని తలుస్తూ ఉంటుంది"

"అదృష్టవంతురాలిని"

"నేనొక విషయం మీ దృష్టికి తీసుకుని వద్దామని వచ్చాను. మీరేమీ అనుకోకపోతే..."

"అన్న దగ్గిర చెల్లెలికలాటివేం ఉండవు"

ప్రద్యుమ్న ముఖం వికసించింది.

"ఆ ధైర్యంతోనే వచ్చాను. అసలది నేచెప్పినట్టు అనకండి. విశ్వానికి మీరంటే చాలా ఇష్టం. ఇన్నాళ్లుగా అతని ముఖంలో చిరునవ్వు చూడలేదు మీరొచ్చాక తప్ప. కానీ మీతో చెప్పేందుకు ధైర్యం చాలడం లేదనుకంటాను"

అమృతకు మతిపోయింది.

విశ్వం తనని ప్రేమిస్తున్నాడా?? నో!

తనకి ప్రేమించబడే అదృష్టం లేదు.

అతనికి తగని మనిషి తను.

"మీరొక మహత్తర కార్యంలో నిమగ్నమై ఉన్నారని తెలుసు. కానీ అతని మిత్రునిగా మీతో చెప్పాలనిపించింది. విశ్వం ఉత్తముడు అమృతా!" ఒక అన్నగా చెల్లెలు జీవితంలో స్థిరపడితే బాగుండుననే ఆకాంక్ష వినిపించిందామెకు.

అమృత కాసేపు ఏం మాట్లాడలేదు.

"ప్రద్యుమ్నగారూ! నాకు అంతటి అదృష్టం లేదు. క్షమించండి. జీవితంలో నాకొకటే ధ్యేయం. అది మృత్యుంజయుని అనుసరించడం. నా జీవితాన్ని అందుకే అంకితం చెయ్యదలుచుకున్నాను"

"మీ మనసు నొప్పిస్తే క్షమించండి"

"ఛ అలాంటిదేమీ లేదు"

ప్రద్యుమ్న వెళ్లిపోయాక అమృత కాసేపు బాధపడింది. ప్రద్యుమ్న మధ్యవర్తిగా వచ్చి ఉంటాడు. ఈ విషయం తెలిసి విశ్వం మళ్లీ హర్ట్ కాడుకదా.

ఆమెకు భయం వేసింది.

కానీ విశ్వం వాళ్ల సంభాషణ విని వెళ్లిపోయాడని ఆమెకు తెలీదు.

ఎందుకంటే ఆ తర్వాత కూడా ఆమెతో అతని ప్రవర్తనలో మార్పులేదు.



రోజులు... వారాలు..
వారాలు... వారాలు... నెలలు...
చాలా మార్పులే జరిగాయి.

అమృతహస్తానికి ఎన్నో ప్రశంసలు.

సాధారణ పాఠకుడినుండి సాహితీవేత్తల వరకు ఎన్నో ఉత్తరాలు.

కానీ అమృత ఎడిటర్‌కి ఖచ్చితంగా చెప్పింది... తన చిరునామా ఎవరికీ చెప్పొద్దని.

అమృత చేస్తున్నది ఒక అమృత సిద్ధి కోసం తపస్సు. ఆ తపస్సు పూర్తయేలోగా ఎటువంటి జోక్యమూ ఇష్టం లేదు. మృత్యుంజయ చెప్పి వెళ్లినట్టుగానే, ఆమె కనుసైగలలో ఆమె కోరిన సమాచారం తెచ్చి అందిస్తున్నారు విశ్వం, ప్రద్యుమ్న ప్రవీణ, సుషమ, సరస్వతమ్మగారు. చివరికి సుప్రియకూడా ఉడతాభక్తి చేస్తోంది.

అమృతలో ఏదో దాహం

మధనం

అమృతం సిద్ధిస్తే తప్ప అది తీరదు.

చివరికి 'అమృతహస్తం' పూర్తయింది.

ఎడిటర్ స్వయంగా వచ్చి అడిగాడు...

పాఠకులెందరో ఈ అమృతను పరిచయం చేసుకోవాలని తహతహలాడుతూ అర్థిస్తున్నా

రని.

ఒక్కసారి వాళ్లతో మాట్లాడమని.

కానీ అమృత ఆలోచన వేరు.

'అమృతహస్తం' పూర్తయిందిగదా... మరి మృత్యుంజయ రెస్పాన్స్ ఏమిటి?

పూర్తయిన తర్వాతే కలుసుకోవడం అన్నాడు.

ఎంత కర్కశుడు.

ఒకరోజు 'అమృతహస్తం' పుస్తకం కాపీలను తెచ్చి ఆమెచేతిలో ఉంచాడు విశ్వం.

ఆమె కళ్లలో నీళ్లు.

ఇది తన జన్మ చరితార్థమయిన రోజు.

మృత్యుంజయ రాగానే తను అందించవలసిన అమృత ఫలం.

కానీ...

ఆమె ఇంక ఆగలేకపోయింది.

నిరీక్షణ ఆమెలో రెట్టింపు బాధను కలిగిస్తోంది.

ఆమె పుస్తకం రాసింది తనకోసం కాదు. మృత్యుంజయకోసం.

చివరికి ఒకరోజు విశ్వాన్ని అడిగింది.

విశ్వం విస్తుపోయాడు.

"మీకు నిజంగా తెలియదా?"

"ఏమిటి?"

ఆమె గుండె వేగంగా కొట్టుకుంది.

"ఆయన మీ సీరియల్ రెస్పాన్స్ తెలుసుకుంటూనే మాకు చాలా సూచనలిచ్చారు. కానీ తన ఉనికి మీకు చెప్పొద్దన్నారు.

అమృత ఆవేశపడింది.

"మీకాయన అడ్రసు తెలుసా?"

"ఎపుడూ వెళ్లలేదు గానీ తెలుసు"

ఆయన ఇచ్చిన అసైన్‌మెంటు పూర్తయాక నాకు అడ్రసు ఇస్తే మీకు ఆజ్ఞను మీరినట్టుకాదుకదా!"

"కాదు"

అయితే నాకు మృత్యుంజయ చిరునామా కావాలి"

విశ్వం ముఖంలో రవంత ఆశ్చర్యం.

కానీ ఏమనుకున్నాడో లోపలికి వెళ్లి తీసుకొచ్చి ఇచ్చాడు.

"ఇది మీకివ్వడం ధర్మమే. మీరన్నట్టు మీ అసైన్‌మెంట్ పూర్తయింది"

"విశ్వంగారూ! నాదో కోరిక నా నవలకు రాయల్టీ అని చెప్పి ఇరవై వేలకి చెక్కు ఇచ్చారు. నాకు దాని అవసరం రాలేదు. ఈ ఆశ్రమానికి నేనది కానుకగా ఇచ్చి వెళ్లిపోతున్నాను. స్వయం ఉపాధి పెట్టుకున్న వారి నుండి తీసుకుంటున్న డబ్బు జాబితాలో దీనినీ జత చేసుకోండి"

ప్రద్యుమ్న ఎపుడొచ్చాడో అన్నాడు.

మీరు పొరబడ్డారు అమృతా! ఆ నిరుద్యోగులు తాము పైకి వచ్చి కృతజ్ఞతతో ప్రతినెలా డబ్బు ఇచ్చినా అది మళ్లీ పెట్టుబడి మొత్తంగా వాళ్లకే ఏడాది తర్వాత వ్యాపారాభివృద్ధికి అందజేయమని మృత్యుంజయగారి ఆజ్ఞ!"

ఈసారి అమృత విస్తుపోయింది.

అంతలోనే తేరుకుని అంది...

"నా ఇరవైవేలు మాత్రం ఇష్టపూర్తిగానే ఇస్తున్నాను. ఈ నవల మీద వచ్చే రాయల్టీ కూడా ఆశ్రమానికే ఉంచేయండి. జీవితంలో నేనేదైనా మంచి పని చేశాననుకుంటే ఇది మాత్రమే.

విశ్వం, ప్రద్యుమ్న ఈసారి అభ్యంతరపెట్టలేదు.

"అయితే వెళ్లిపోవడానికే నిర్ణయించుకున్నారా?"

"అవును"

"కానీ ఆయన అక్కడ కరెక్ట్‌గా ఉంటారో లేదో చెప్పలేం. ఎపుడూ మృత్యుంజయగారే కాంటాక్ట్ చేయడం తప్ప మేం చెయ్యలేదు"

"నాకు తప్పక కనిపిస్తాడని నమ్మకం"

చిన్న బ్రీఫ్‌కేస్‌తో వెళ్లిపోతున్న అమృతకు వారంతా వీడ్కోలు చెప్పారు ఆవేదనగానే.

సుప్రియ అయితే ఏడ్చేసింది.

ఆమె బుగ్గలు పుణికింది అమృత ఓదార్పుగా.

గేటు తీసి బయటకు వెళ్తూంటే తాను ఆశ్రమంలోకి వచ్చిన రోజు గుర్తొచ్చింది అమృ





తకు...

ప్రద్యుమ్న ఆశ్రమం దాటి నాలుగడుగులు వేశాక చేతులు జోడించాడు.

"ప్రీతి డైరీ నాకు కానుకగా ఇచ్చి వెళ్లిపొండి" అమృతకు కన్నీటి పొరల మధ్య అతని మొహం మసకగా కనిపించింది.

"అంటే..."

"మీతో మృత్యుంజయగారు చెప్పిన రోజునే తెలుసు. కానీ ఆయన చెప్పిన మాటల్లో వాస్తవముండబట్టి నేను మౌనం వహించాను"

మౌనంగా బ్రీఫ్‌కేసు తెరచి ప్రీతి డైరీ ప్రద్యుమ్న చేతుల్లో పెట్టింది.

"పదండి మిమ్మల్ని స్టేషన్‌లో దింపి వస్తాను"

★ ★ ★

రైల్లో ప్రయాణం చేస్తున్నంతసేపు అమృత మనసు గాలిలో తేలిపోతోంది.

మృత్యుంజయ డైరీని ఆరోజు సుప్రియ నర్సింగ్‌హోంలో ఆపరేషన్ రోజున సరస్వతమ్మగారు తనకిచ్చారు అతడు మర్చిపోయాడని.

ఆ తర్వాత తనూ మర్చిపోయింది.
ఆ విధంగా అది తనవద్దే ఉండిపోయింది.

రాత్రి ఆశ్రమంలో అది చదివిన దగ్గర్నుంచీ ఆమెలో ఉద్వేగం పెరిగిపోయింది.

తను కోరుకున్నదీ అదే.

అందులో వాక్యాలు పదేపదే గుర్తొస్తున్నాయి.

అమృత ఎంత చక్కని పేరు,
పేరులాగే మనిషి అమృతమూర్తి.
మనసు, ఎదగని మనసు.
తనకు తెలియకుండానే ఏదో బంధం ఆమె వైపు లాగుతోంది. కానీ???
నాకా అదృష్టం లేదు.

ఆమె ప్రేమించిన రాహుల్ ఎటువంటివాడో నాకు తెలిసినట్టు ఆమెకు తెలిసే అవకాశం లేదు.

ఏమైనా కానీ.. అమృతను నా ఆశ్రమానికి తీసుకు రాగలిగితే నేను అనుకున్నది సాధించగలను. నా ఆశయం పూర్తవుతుంది.

మరోచోట.

"అమృతను వెంటాడడం ఎంత మంచిదయింది

లేకపోతే రాహుల్ స్వార్థానికి బలయ్యేది.
ఒక నిండుప్రాణం.
ఒక విలువైన వజ్రం.

ఒక అపురూప రచయిత్రి ఈ లోకానికి లేకుండాపోయేది.

అమృత!!

అమృతను చూడకుండా ఉండలేకపోతున్నాను.

అది తప్పని నా మనసు హెచ్చరిస్తోంది.
లవ్ ఈజ్ నాట్ ఎ క్రైమ్.
ప్రేమించడం నేరంకాదు.

కాని నేను...

నాకా అదృష్టం ప్చ్... ఎందుకులే?
హృదయమా నా మాటవిను.
వినవా? అయ్యో నేనేం చెయ్యను?

★ ★ ★

ఇంకోచోట.

"అమృత నన్నపార్థం చేసుకుంటోంది"

భగవాన్- చీకటినుంచి వెలుగులోకి పయనించవలసినదారిని ఆమెకు చూపించవా?

పసిపాపలా ఆమె నైర్మల్యం.

ఆమెకు దగ్గరయ్యే అదృష్టం నాకు లేకపోయినా నాపట్ల ఆమెకు ద్వేషం లేకుండా ఉంటే చాలు.

ఇప్పుడు అమృత ఏం చేస్తుంటుంది?
పిచ్చిపిల్ల.

నేను ఎన్ని కుట్రలు పన్నుతున్నానో అని ఆలోచిస్తూ బుర్ర పాడుచేసుకుంటూ ఉంటుంది.

ఇకమీదట అలా కాకూడదు"

★ ★ ★

ఇదీ మృత్యుంజయ హృదయం.

అన్యులకు చొరశక్యంకాని హృదయం.

పిడికెడు హృదయంలో ఎన్నెన్ని భావాలు

యుగానికి సరిపడినంత ప్రేమ ఉంది అందులో.

డైరీ చదవకపోతే తనకీ తెలిసేది కాదు.

ఎప్పటికీ అతని మనసు పట్టుపడేది కాదు.

ఆలోచనల్లో రైలు ఆగడం గమనించలేదు అమృత.

"మీరెక్కడకు వెళ్లాలమ్మా?"

ఆలోచనల్లోంచి ఈ లోకంలోకి వచ్చింది.

ఎవరో మధ్యవయస్కుడు.

చెప్పింది అమృత.

"అరె త్వరగా దిగండి. ఇక్కడ ఎక్కువ సేపు ఆగదు ట్రెయిన్"

"ఈ స్టేషనేనా!" అంటూ.

అమృత కంగారుగా బ్రీఫ్‌కేసుతో దిగుతుండగానే రైలు కదిలిపోయింది.

నయం. అతను అడగకపోతే తనీ స్టేషన్ దాటిపోయి ఇబ్బంది పడేదే.

చుట్టూ చూసింది.

అదో చిన్నస్టేషన్.

స్టేషన్‌మాస్టర్ గదికి వెళ్లింది. ఆయన ఒక్క క్షణం ఆశ్చర్యంగా చూశాడామెవైపు. "బాగా చదువుకున్నదానిలా వుంది. అంత పల్లెటూళ్లో ఈమెకి తెలిసినవాళ్లెవరున్నారు? ఏంపని?"

అడ్రసు చూపించి అడిగింది అమృత.

బయటికివచ్చి ఒక జట్కాబండిని పిలిచి అడ్రసు చెప్పాడు.

ఆయనకి థాంక్స్ చెప్పి బండెక్కింది అమృత.

"ఇక్కడికెంతదూరం ఉంటుందబ్బీ"

"రెండు మైళ్లుంటుదమ్మా!"

అమృత మనసు ఆనందంలో పరవళ్లు తొక్కుతోంది.

మరో అరగంటలో తనని చూసి మృత్యుంజయ...?

ఎల రియాక్టవుతాడు?

ఆ రోజులా తన రెండు చేతులూ తన చేతిలోకి తీసుకుని "అమృతా నా జీవితం చరితార్థమయింది. నా ఆశయం నేరవేర్చావు. నీకేం కావాలో కోరుకో" అంటాడా.

లేకపోతే గంభీరంగా ఉండిపోతాడా?

అతని స్పర్శ గుర్తొచ్చి ఆమె ఒళ్లు మైమరచింది ఒక్కక్షణం.

అది అమృత స్పర్శ.

"అమ్మా- ఇదే మీరడిగిన ఇల్లు"

ఆ ఇంటికేసి చూసి ఉలిక్కిపడింది అమృత.

"ఇదేనా?"

ఆమె సందేహం చూసి బండివాడన్నాడు.

"సుందరయ్యగారిల్లిదే నాకు తెలవకపోవడమేటి? మీరు బంధువులా?"

సమాధానం కోసం ఎదురు చూడకుండానే ఆమె పెట్టె అరుగుమీద పెట్టాడు. ఆమె ఇచ్చిన నోటు అందుకుని వెళ్లిపోయాడు.

"ఎవరు కావాలమ్మా?"

నడివయసు దాటిన స్త్రీ బయటకొచ్చింది.

చెప్పింది అమృత.

ఆమె లోపలకి రమ్మనట్టు సైగ చేసింది.

లోపల మండువా.

అక్కడ రెండు కర్ర కుర్చీలున్నాయి.

"కూర్చోమ్మా!"

సందేహిస్తున్న అమృతనుద్దేశించి అన్నదావిడ.

ఎవరది?

వీళ్ళ రాక గమనించి అక్కడే పడకకుర్చీలో కళ్లకడ్డుగా చేతులుంచుకుని నిద్రపోతున్న భంగిమలో ఉన్న మునలాయన అడిగాడు.

"ఎవరో పిల్ల మన బాపన్నకోసం వచ్చింది. అన్నయ్యా! నువ్వు మాట్లాడు. నేను మజ్జిగ తెస్తాను. ఎండను పడి వచ్చింది"

అయితే ఈవిడ మునలాయన చెల్లెలన్న మాట.

మరి ఈయన మృత్యుంజయకేమవుతాడు? తండ్రా?

"ఎవరమ్మా నువ్వు? ఏంకావాలి"

ఆ మాటలో అంతులేని వాత్సల్యం.

"నేను... నేను... అమృత..."

మాట ఎందుకో తడబడుతోంది.

ఆయన చప్పున లేచాడు.

"అమృతంటే నువ్వా తల్లీ. ఈ పేదరైతు ఇంటికి వెతుక్కుంటూ వచ్చావా? మావాడు నీ





పేరు తలవనిక్షణంలేదు. అమ్మా నువ్వు పుస్తకాలు రాస్తావటగా! ఇదిగో మా లక్ష్మీ! అమ్మాయికి మజ్జిగ త్వరగా తే"

అంతదాకా నీరసంగా పడుకునున్న ఆయన గొంతు కంచులా మోగుతూంటే అమృత ఆయన మాటలకి రవంత సిగ్గుపడింది.

"మృత్యుంజయ మీ అబ్బాయా? బయటకు వెళ్ళారా?"

అమృత మనసు నాట్యం చేస్తోంది.

ఆయన ఆగిపోయాడు.

చప్పున కుర్చీలో కూలబడ్డాడు.

మళ్ళీ కళ్ళమీదకి చేతులొచ్చేశాయి.

మాలక్ష్మి అన్నామె మృత్యుంజయకు మేనత్త కావచ్చు. మజ్జిగ గ్లాసుతో వచ్చినదల్లా అన్నగారిని చూసి కంగారుడింది.

"ఇదమ్మా వీడి వరస. అంతలోనే గట్టిగా అరుస్తాడు మళ్ళీ వెంటనే నీరసం"

"నుస్తీగా ఉందాండీ"

అమృత కంఠంలో జాలి, ఆత్మీయత.

"వీడిది ఉక్కులాంటి శరీరమమ్మా. కాని ఆ కొడుకు పేరెత్తితే పూనకం వచ్చినట్టుంటుంది. మళ్ళీ ఏ జబ్బూలేదు. నువ్వు స్నానం చెయ్యి తల్లీ"

"మృత్యుంజయగారు..."

"కబురు చేస్తానమ్మా"

మృత్యుంజయ పేరు వినగానే ఆవిడ ముఖం రవంత నల్లబడటం అమృత దృష్టిదాటిపోలేదు.

"అత్తయ్యా... ధాన్యం బస్తాలకెత్తించాను. ఇక గాదెల్లో పోయించడం అదీ నువ్వే చూసుకోవాలి. నాకు పట్నంలో పనుంది"

"సీతారాం ఈ అమ్మాయి మన బావన్న కోసం వచ్చింది. కాస్త వాడికి కబురు చెప్పకూడదూ!"

అప్పుడు చూశాడు సీతారాం అక్కడ కర్రకుర్చీలోని అమృతను.

"ఎవరు?"

"అమృత అని... నేను..."

అతను సంభ్రమంగా చూశాడామెవైపు.

"అమృత... మీరిక్కడికెలా వచ్చారు? అరె... అమృత హస్తం..."

అమృతకు అతని కంగారు చూసి నవ్వొచ్చింది.

"రైలెక్కి ఆ తర్వాత జట్కాబండెక్కి"

సీతారాం కంగారుగా అన్నాడు.

"అదికాదు.. మీరు.. మీకెలా తెలుసు ఈ అడ్రసు..."

"తెలుసుకున్నాను"

"అయితే మృత్యుంజయ... అరె..."

అమృతకి చిరుకోపం వచ్చింది.

"ఇందాకట్నుంచీ చూస్తున్నాను. నా పేరు వినగానే కంగారు పడుతున్నారెందుకూ మీ అన్నయ్య నన్నో రాక్షసిలా వర్ణించి చెప్పారా?"

"సీతారాం మా లక్ష్మమ్మగారిని "అత్తయ్యా" అనడం వింది. తప్పక అతనికి తమ్ముడు కావచ్చు.

"మా అన్నయ్యా? భలేవారే. 'జయ' నా ప్రాణస్నేహితుడు"

"అవునమ్మా ఈ ఇంటి విషయాలన్నీ స్వంత కొడుకుకంటె ఎక్కువగా చూస్తాడు సీతారాం"

"అయితే మృత్యుంజయగారు ఇల్లు పట్టకుండా తిరుగుతారన్నమాట"

అమృతకు అతడు ఆశ్రమంవదలి ఎన్నెన్నో వారాలుండడం మళ్ళీ సడెన్‌గా ప్రత్యక్ష్యం కావడం గుర్తొచ్చింది.

సీతారాం ముఖం నల్లబడిపోయింది.

కానీ ఏమీ అనలేదు వెంటనే.

ఓ క్షణంఆగి అన్నాడు. "మీరు భోంచెయ్యండి. నేను మిమ్మల్ని వాడి దగ్గరకు తీసికెళ్తాను"

అమృతకు అర్థమయింది.

సంఘసేవ అంటూ ఇల్లు పట్టకుండా పనులన్నీ స్నేహితుడి కప్పజెప్పి తిరుగుతూంటే ఏ తండ్రి హృదయం దహించుకుపోదు? మృత్యుంజయ ఏమనుకున్నానరే మందలించితీరాలి.

పాపం ముసలాయన ఎంత మధనపడుతు

న్నాడు.

ఇన్నాళ్లూ ఆయన ఏదో కష్టబడబట్టికదా నాలుగువేళ్లూ లోపలికెళ్తున్నాయి ఇతగాడికి. ఇప్పుడైనా బాధ్యత తీసుకోకపోతే అదేంపని?

"సీతారాంగారూ! మృత్యుంజయగారున్న ఆశ్రమానికి నన్నిప్పుడే తీసికెళ్లండి. ట్రెయిన్‌లో అరటిపళ్లు తిన్నాను. ఆకలిగా లేదు"

"ఆశ్రమమా?" సీతారాం ముఖంలో ఆశ్చర్యం.

"అయ్యో పళ్లతో కడుపెలా నిండుతుంది తల్లీ! నీకోసం మళ్లీ వండాలని మొహమాటపడకు. మా పల్లెటూళ్లలో ఏ క్షణం చుట్టమొచ్చినా పిడికెడు అన్నానికి కరువులేదు" అంది మాలక్ష్మమ్మగారు.

ఆవిడ అమృతను మాట్లాడనీయలేదింక.

ముసలాయన కూడా అమృత భోంచేస్తున్నంతసేపూ అక్కడే కూర్చుని అదీ ఇదీ మాట్లాడారు.

అన్నం తిన్నాక తృప్తిగా ఉంది అమృతకు. కడుపులో వెలితి పూడిందిగా.

సీతారాం బయట కుర్చీలో కూర్చున్నాడు ఆమె వచ్చేదాకా.

"ప్రయాణ బడలికతో ఉన్నారు. కాస్త విశ్రాంతి తీసుకుంటే సాయంత్రం వచ్చి తీసుకెళ్తా" అన్నాడతను.

'అనలాయన ఇంట్లో వున్నారా?" ఇప్పటికి అనుమానం వచ్చింది అమృతకు.

"ఆ... అదేంకాదు... ఉన్నాడు. సరే పదండి"



ఏమనుకున్నాడో సీతారాం లేచి చెప్పులు వేసుకున్నాడు.

''ఇప్పుడు ఇంత ఎండలో ఎందుకమ్మా?''

''లేదండీ నేను మళ్లీ వెళ్లిపోవాలి''

అమృత కూడా చెప్పులేసుకుంది.

మాలక్ష్మమ్మగారు మాట్లాడలేదు.

''మళ్లీ వెళ్లిపోవాలా'' ముసలాయన మాటలు ఒక్కక్షణం బంధించాయి అమృతను. కాని తన మనస్సు మృత్యుంజయను కలవాలని తొందరపెడుతోంది''

ఊళ్లోకొచ్చి ఎందుకీ దాగుడుమూతలు.

ఆ ఊరంతా కలిపి వంద గడపలుండవేమో!

సీతారాం వెనుక అమృత నడుస్తోంటే తలకాయలు గుమ్మాల్లోంచి తొంగిచూసి లోపలికెళ్లిపోతున్నాయి.

అమృత నవ్వుకుంది.

పల్లెటూళ్లలో ఇది మామూలే.

కొత్త మొహం కనిపిస్తే పట్టి పట్టి చూస్తారు. ఊరు దాటాక పొలాలు చెట్లు.

ఎండ అనిపించడంలేదు. అమృతకి.

దారిలో ఒక్కమాట కూడా మాట్లాడలేదతను.

ఏదో ఆలోచనలో మునిగిపోయినవాడిలా ఉన్నాడు.

చల్లని గాలి ఏవో పరిమళాలు మోసుకొస్తూ మొహాన్ని తాకుతుంటే పరవశంగా ఉంది అమృతకు.

అన్నం తిన్నదేమో కళ్లమీదకు కునుకు తన్నుకొస్తోంది. కూనిరాగాలు తీస్తూ పొలాల్లో పనిచేసుకుంటున్న కూలీలు గట్టుమీద నడుస్తున్న వీళ్లను ఒక్కక్షణం చూసి మళ్లీ పనిలో మునిగిపోతున్నారు.

సడన్‌గా గుర్తొచ్చింది అమృతకు.

పొలాల్లోకి తీసుకెళ్తున్నాడేమిటి?

''సీతారాంగారూ! ఇటెక్కడకి? ఆశ్రమం...''

''ఆశ్రమమేమిటి?''

అతను విస్తుపోయాడు.

''మరి?''

''మృత్యుంజయ దగ్గరకెళ్తున్నాం''

వింతగా చూసింది అమృత.

''మృత్యుంజయ పొలంపని చేస్తున్నారా?''

అతడు మాట్లాడలేదు.

కాసేపు నడిచాక దూరంగా ఓ వ్యక్తి.

బక్కచిక్కిన దేహంతో.

చీపురుపుల్లలాంటి కాళ్లూ చేతులలో.

అస్థిపంజరంలా ఉన్న మనిషాకడు.

తలపాగా చుట్టి పొలంలో పాదులు చేస్తున్నాడు మొక్కలకి.

అతన్ని చూసి ఒళ్లు జలదరించింది అమృతకు.

అతన్ని దాటి ముందుకెళ్లారు ఇద్దరూ.

అక్కడ ఓ చిన్న పూరిల్లు, గడ్డియిల్లు.

దాని మీదికి పాకిన పాదులు. మరోపక్క బటానీపూలు అచ్చం పొదరిల్లులా ఉంది.

లోపలికడుగుపెట్టిన అమృత విస్తుపోయింది.

పైకి పొదరిల్లులా ఉన్న ఆ ఇంట్లో లోపల సరస్వతీ నిలయం.

రాక్‌లనిండా పుస్తకాలు.

చిన్న టేబుల్. ఒకమంచం రెండు కుర్చీలు.

టేబుల్‌మీద.

''అమృత హస్తం''

ఆ పుస్తకం ఎన్నోసార్లు చదివినట్లు కాస్త నలిగివుంది.

అదొక గ్రంథాలయం.

ఒక్కొక్క రాక్‌మీద లేబిల్స్.

అదొక విజ్ఞాన భాండాగారం. అచ్చం అమృతాశ్రమంలో అతని గదిలా ఉంది.

''కూర్చోండి'' అన్నాడు సీతారాం.

ఆమె కూర్చున్నాక బయటికెళ్లాడు.

టేబుల్‌మీద కాగితాలు.

తన పేరు కనిపించినందుకు కాదు. ఆమె ఉలిక్కిపడింది.

అది మృత్యుంజయ దస్తూరీ

''కంగ్రాట్యులేషన్స్ అమృతా!''

నేననుకున్నది సాధించిపెట్టావు.

''అమృత హస్తం ప్రజల హృదయరంజనేకా




దు''

ఆలోచింపజేస్తున్న రచన.

నేనూహించిన దానికంటే బాగా వచ్చింది.

నాకెంత తృప్తిగా ఉందో?

నీకెంత రుణపడి వున్నాను.

''అమృతా అమృతా అమృతా''

ఆమె హృదయం ఎక్కడికో తేలిపోయింది.

అమృత హస్తం మృత్యుంజయకి తృప్తిని చ్చింది.

అమృత అపురూపంగా ఆ కాగితాన్ని ముద్దుపెట్టుకుంది.

అంతలో ఏదో గుర్తొచ్చినట్టు 'అమృత' అన్న లేబిల్ ఉన్న రాక్ తెరిచింది.

ఫైల్స్.

అన్నిటినిండా అమృతకి రాసిన లెటర్సే.

అమృత నేత్రాలు అక్షరాల వెంబడి కదలి పోతున్నాయి.

కొంతసేపటికి అందులో పూడుకున్న అశ్రువులు అక్షరాలకి అడ్డొచ్చి కొనగోటితో మీటింది.

కొబ్బరిబొండాలతో వచ్చాడు సీతారాం.

అతని వెనుక అస్థిపంజరంలాంటి ఆ మనిషి.

అమృత కళ్లు భయంతో విచ్చుకున్నాయి అంత సమీపంలో ఆ వ్యక్తిని చూడగానే.

లోతుకుపోయిన చెంపలు.

దేహానికి చర్మం అతికించినట్టుంది తప్ప.

రక్తమాంసాలు రవంతకూడ లేవు.

కళ్లలో ఏవో ప్రాణాలున్నట్టున్నాయి తప్ప.

అవి గాజుకళ్లు.

అబ్బ ఎవరితను? ఇంకా ఎలా బతికిఉన్నాడు? ఆమె నోరు విప్పేంతలో-

''అమృతా నా కోసం వచ్చావా?''

పక్కకి తిరిగింది అమృత-

సీతారాం నిర్లిప్తంగా చూస్తున్నాడు.

''అమృతా! అదేమిటి నాకేసి చూడు''

ఈసారి ఆ స్వరం బక్కమనిషినుండి వస్తోందని గ్రహించిన అమృత కళ్లుతిరిగిపడబోయి నిగ్రహించుకుంది.

సీతారాం చప్పున ముందుకొచ్చాడు.

అతని కళ్లనుండి తడి.

''అమృతా! నన్ను చూసి భయపడుతున్నావా?

అందుకే నిన్ను చూడాలని నా మనసెంత కొట్టుకుంటున్నా ధైర్యం చెయ్యలేదు.

ఈ క్షణం కోసమే నా నిరీక్షణ.

నేను ఆయుష్షులెందుకు కొనుక్కునేవాడినో ఇప్పుడర్థమయివుంటుందికదూ!

ఏడవకు అమృతా!

నేను చిరంజీవిని.

నా వయసు వెయ్యిన్నూట ఇరవైమూడు సంవత్సరాలు,

అమృత ఇంకా నమ్మలేకపోతోంది.

అతడు మృత్యుంజయా!

భగవాన్ ఇది నిజం కాకూడదు.

ఆమె హృదయం నిశ్శబ్దంగా ఆక్రోశిస్తోంది.

''భౌతికంగా నాకు ముప్పయ్యేళ్లే అమృతా!

జీవితమంటే నాకెంతో ఇష్టం.

నాన్న సామాన్యరైతు అయినా కష్టపడి వృద్ధిచేశాడు.

ఎందుకు? నన్ను డాక్టర్ని చెయ్యాలని.

నేనూ ఒక తపనతో చదివాను.

డాక్టరయి ఆయన కోరిక ప్రకారం ఈ ఊళ్లోనే ప్రాక్టీసు పెట్టాలని.

కాని ఫైనలియర్ చదువుతున్నప్పుడే నాలో ఏదో అంతుతెలియని రోగం ప్రవేశించింది.

తెల్లగా పాలిపోవడం.

ఉన్నట్టుండి కళ్లుతిరిగి పడిపోవడం.

ఎంతో డబ్బు ఖర్చుపెట్టాడు నాన్న.

కాని వైద్యపరిభాషలో ఈ రోగానికేదో పేరు పెట్టినా కుదిరేరోగం కాదని తెలిసిపోయింది.

నేనూ డాక్టరే చదివినవాడినే అయినా నాన్న తృప్తికోసం ఎందరో బాబాలకు మొక్కాను.

పైకి కొన్నాళ్లు బాగుంటాను.

క్రమేపీ క్షీణించిపోతుంటాను.

అమృతాశ్రమంనుండి నేను అప్పుడప్పుడూ మాయమవుతూ ఉండడం మళ్లీ కాస్త పుంజుకునే ఖరీదైన ఇంజక్షన్లు విశ్రాంతి కోసమే.

ఈ రోగం నన్నెప్పుడు కబళిస్తుందో తెలీదు.

భగవంతుడు నాకు ఎక్కువ జీవితాన్నివ్వలేదు.

మనస్సు నిబ్బరం చేసుకుని నేను చిరంజీవినయే బిజినెస్ ఆయుష్షుల బిజినెస్ మొదలుపెట్టాను.

మా నాన్నంటే నా ప్రాణం. నాకెంతో గౌరవం. ఇష్టం. నేనడిగినదేదీ కాదనలేదాయన. నా స్వేచ్ఛని హరించలేదు. నువ్వు నాన్నని చూశావటగా.

నా బిజినెస్‌లో నేను నష్టపోలేదు అమృతా!

నాన్న కష్టార్జితం నా పెట్టుబడి.

అదే నా ఆనందం.

అమృతా!

నాకు బతకాలని ఎంతో ఆశ.

అది నిన్ను చూసిన క్షణంనుంచీ ఎక్కువయింది.

కానీ...''

ఆయాసంతో ఆగాడతను.

అమృత ఎప్పుడు కూర్చుందో అతని పక్కనే ఉంది.

అతని చీపురుపుల్లలాంటి చేతులు ఆమె చేతిలో.

ఒక్కక్షణం నిశ్శబ్దం.

అది అగాధంలా వుంది.

''మాట్లాడకండి మృత్యుంజయా''

''లేదు. నన్ను మాట్లాడనీ. లేకపోతే ఎప్పటికీ నాకా అవకాశం ఉండదు. ఇది నేనెదురుచూడని అమృతక్షణం.

సీతారాం మౌనంగా కొబ్బరినీళ్లు పోసిన గ్లాసులందించాడు.

ఆమె అపురూపంగా అతడికి పట్టించింది.

ఇప్పుడా ఆకారం చూసి ఆమె ఒళ్లు జలదరించడంలేదు.

వదిలితే ఆ చెయ్యి. ఆ స్పర్శ ఎక్కడ దూరవుతాయోనన్నంత బెంగ ఆమె గుండె నిండా వ్యాపించింది.

''అమృతా ఒక్క కోరిక తీర్చగలవా?'' మృత్యుంజయ అడిగాడు.

''నీ కోసం నా ప్రాణాన్నయినా ఇస్తాను'' అనలేదు అమృత.

మౌనంగా అతని చెయ్యినిమిరింది.

అంగీకారం అర్థమయిందతనికి.

''నువ్వు వెంటనే అమృతాశ్రమానికి వెళ్లిపో''

పక్కలో బాంబు పేలినట్టయింది.

''నో'' ఆమె హృదయాకాశం దద్దరిల్లి కేకపెట్టింది.

''అమృతా! నా ఆయుష్షు పెంచుతూపోవాలి. అవునా. నీ కోసం విశ్వం వస్తాడు రేపు ఉదయం. మిమ్మల్ని నేను ఆశీర్వదిస్తాను. మీ ఇద్దరి కృషితో నేను చిరంజీవినవుతానని నాకెంతో నమ్మకం''

నిశ్శబ్దం క్షణంసేపు.

సీతారాం అపురూపంగా చూస్తున్నాడా ఇద్దరివైపూ.

ఎన్నో జన్మలనుంచి మాట్లాడుకోవలసినవి ఇంకా ఉండిపోయినట్టుంది వాళ్ళ ఆరాటం.

అమృతకి దుఃఖం రావడంలేదు.

అంతకంటే ఏదో అతీతమైనస్థితి.

''మృత్యుంజయా! భగవంతుడు నీకు మరోఏడాది ఆయుష్షునిచ్చినా నీకు పరిపూర్ణ సంతోషాన్ని చూపించగలను''

అతని కళ్లు నిశ్చలంగా చూస్తున్నాయి.

ఆ కళ్లలోని మెరుపును అలాగే చూస్తోంది అమృత.

పైకి ఏమీమాటలు వినబడడంలేదు.

కాని మౌనంగా వారి హృదయాలు సంభాషించుకుంటున్నాయని గ్రహించిన సీతారాం అక్కడ్నుంచి కదిలాడు.

★ ★ ★

అమృతాశ్రమం ఎప్పట్లాగే ప్రశాంతంగా ఉంది. అదే ఆఫీస్‌రూం.

ఫైల్స్.





వాటి మధ్యలో టేబుల్‌మీది తెల్లకాగితాలను నలుపు చేస్తూంటుంది అమృత.

అమృత ఇష్టమైతే ఎవరితోనైనా మాట్లాడుతుంది.

అందరి అవసరాలు కనుక్కుంటుంది.

ఆశ్రమమంతా చుట్టివస్తుంది.

ఆ మర్రిచెట్టంటే ఆమెకెంతో ప్రాణం.

తన దినచర్య అంతా అక్కడ చెప్తుంది.

దానినిండా ఏవో అంకెలు, లెక్కలు.

సూర్యాస్తమయమవుతుంది.

మృత్యుంజయ మంటపం వద్ద ప్రార్థన నిపిస్తుంటుంది.

''అసతోమా సద్గమయా...''

సుప్రియకంఠం తారస్థాయిలో పలుకుతుంటే అమృత గొంతు కలుపుతుంటుంది.

''అమృతా రెస్ట్ తీసుకోరాదూ ఎంతో అలసిపోయావు'' అంటాడు విశ్వం.

''అమ్మో బాస్ చిరంజీవి కావాలంటే బిజినెస్ వృద్ధిచెయ్యొద్దూ'' అంటుంది అమృత.

''నేను బ్రతికే ఉన్నాను అమృతా'' మృత్యుంజయనుండి వచ్చే ఉత్తరాల్లో ఆ ఒక్క వాక్యమే ఉంటుంది.

అదే ఎన్నో సందేశాలనిస్తున్నట్టు అపురూపంగా గుండెలకి హత్తుకుంటుంది అమృత.



# 'చైత్రంలో చిరుజల్లు'పై సమీక్షలు



అక్టోబర్ చతురలో ప్రచురితమైన భాగవతుల సుబ్రహ్మణ్యం నవల 'చైత్రంలో చిరుజల్లు'పై పాఠకుల నుండి మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్నవాటిని ఈ దిగువ ప్రచురిస్తున్నాం.

## ఆలోచనాపరిధిని పెంచాలి!

*(ప్రథమబహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

కథనబలం పుష్కలంగా వున్నా కథాంశంలో వైవిధ్యం లేని నవల 'చైత్రంలో చిరుజల్లు'. ఎమ్.ఎ. చదివిన మంజూష పెళ్ళిచూపుల్లో అంత సంస్కారహీనంగా ప్రవర్తించినా ఏరి కోరి వెంటపడి చేసుకున్న దివ్యరామ్ తర్వాత ఆమె ప్రవర్తనకు అచ్చెరువొందడం విడ్డూరం. ఈనాటి సగటు యువతికి ప్రతీక మంజూషపాత్ర. కాని యిలాంటి నవలలు మరింతమంది మంజూషలను తయారుచేస్తాయని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఎందుకంటే - యిందులో అసలు సమస్య ఏమిటో స్పష్టంగా చెప్పలేదు. పరిష్కారమూ సమగ్రంగా లేదు.

సినిమాలు, షికార్లు, పిక్నిక్‌లు ఇవే మంజూష దృష్టిలో స్వేచ్ఛాయుత సుఖమయ జీవితానికి కొలమానాలు. భర్త అనగానే తన గొంతెమ్మకోరికలు తీర్చే కామధేనువుగానో లేకపోతే కేవలం తనను సుఖపెట్టడానికే నిర్దేశింపబడిన సాధనంగానో ఆమె అంతరాంతరాల





లోని భావం. అహంకారంతో ఏవేవో ఊహించుకుని సమస్యల్లోకి చొచ్చుకుపోవడం. భర్త డాన్స్ ప్రోగ్రాంకి పిలిస్తే వందరూపాయల టికెట్ ఊసెత్తాడని ఉడుక్కుంటుందికాని, నిర్లజ్జగా పరపురుషునికోసం పాకులాడుతుంది. అతగాడామె అందాన్ని అదేపనిగా పొగుడుతూంటాడాయె! చదువుకున్న ఏ స్త్రీ అయినా సిగ్గుతో తల దించుకోవాల్సిన పాత్ర మంజూషది. అలాగే దివ్యరామ్ కూడా ఏరి కోరి వెంటపడి చేసుకున్న భార్యామణిని బలాదూర్ తిరగమని ఆయనగారు కాదంబినికోసం వెంపర్లాడుతాడు.

"దేర్ ఈజ్ ఎ వుమన్ బిహైండ్ యాన్ ఎవ్విరీ సక్సెస్‌ఫుల్ మాన్". తన బాధ్యత గుర్తెరిగి నడుచుకునే స్త్రీకి ప్రపంచమే యిచ్చిన బిరుదు ఇది. కేవలం హక్కులకోసం పోరాడటంకాక బాధ్యతలు కూడా గుర్తెరిగి మసలుకోవాలి. అలాగే పురుషుడూ స్త్రీలోని అంతర్గత శక్తిని తనకనుకూలంగా మలుచుకోగలగాలి. తిని కూర్చుంటే మనసే దెయ్యమై పీడిస్తుంది. ఏదైనా చక్కని వ్యాపకం ఏర్పరచుకుని నొప్పింపక తానొవ్వక మసులుకోవాలికాని మంజూషలా వీధినపడరాదు.

స్త్రీ ఆలోచనాపరిధిని మరింత కుంచించే యిలాంటి నవలలు కాక ఆమె ఆలోచనాపరిధిని విస్తృతంచేసే నవలలు రావాలి. ఎందుకంటే చదువుకున్న స్త్రీని ప్రభావితం చేసేది ఆమెకందుబాటులోని సాహిత్యమే.

-వి.సంపూర్ణాదేవి,
కావలి

## ఏది అభ్యుదయం?

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

'చైత్రంలో చిరుజల్లు' లక్ష్యం ఏమిటో అంతుబట్టదు. రచయిత వివాహవ్యవస్థను సమర్థించదల్చుకున్నారో, విమర్శించదల్చుకున్నారో ఇదమిత్థంగా తేల్చి చెప్తే బాగుండేది. తోచిన నేపథ్యంతో కథను నడిపి, నామమాత్రంగా వ్యవస్థను గురించి నాలుగుముక్కలు విశ్లేషిస్తే రచనకు అర్థం వుండదు.

ఆసక్తికరమైన సన్నివేశాలూ, సస్పెన్స్ ఉన్నా అడుగడుగునా రచయితే మాట్లాడడంవల్ల నవల కళలేక వెలవెలబోయింది. పరాయి పురుషుడికి తనంతతానుగా పెదవులందీయగల భార్యను ప్రేమతో అక్కున చేర్చుకోవడం మాత్రమే అభ్యుదయం అని రచయిత భావిస్తే అంతకన్నా హాస్యాస్పదం మరొకటి వుండబోదు. కనీసం తనకు అన్నివిధాలా నచ్చిన సంపత్‌తో మంజూష వెళ్ళిపోయినా పాఠకుడికి ఓ తృప్తి మిగిలేది. కానీ 'ముక్కు ఏది?' అంటే తిప్పి చూపించినట్లు ఎటుతిరిగీ వివాహబంధమే భారతనారికి శరణ్యమన్నట్లు మంజూషను దివ్యరాం కౌగిట్లోకి చేర్చి సంబరపడ్డారు. 'అభ్యుదయం' అంటే భార్యభర్తలు తమకు నచ్చిన వ్యక్తులతో కొంత కాలం గడిపి, దాంట్లో సుఖంలేదనీ, వివాహబంధమే భద్రమనీ 'అనుభవపూర్వకంగా' గ్రహించడమేనా?

కాదంబిని ఫారిన్‌కీ, సంపత్ ఆర్మీకీ వెళ్తే తప్ప దివ్యరాం, మంజూషలు కలవలేకపోయారు. అంత దృఢమైన బంధమా వాళ్ళది? అలాంటప్పుడు మళ్ళీ వివాహబంధంపేర వాళ్ళను కలపడం ఆత్మవంచన! బహుశా వాళ్ళకు మరో ఛాయిస్ లేక అలా కలిపినట్టున్నారు రచయిత!

నవల మొత్తంమీద సంపత్ కారెక్టరెలాంటిదో అర్థంకాదు. అతడు దుర్మార్గుడో, మంచివాడో, భావుకుడో, స్త్రీలోలుడో, ప్రేమికుడో - రచయితకే ఓ అవగాహన లేదు. చివర్లో ఓ స్నేహితుడుగా గొప్పగా లేఖలో వీడ్కోలు తీసుకున్న సంపత్ తొలుతనుండీ స్త్రీలపట్ల తక్కువ అభిప్రాయం గలవాడిగానే కనిపిస్తాడు. మరీ పరాయివ్యక్తి భార్యను స్విమ్మింగ్‌డ్రస్‌లో వుండగా ఎత్తుకుని నలిపేసే 'పవిత్రమైన స్నేహం' అందరికీ అర్థంకాదుకదా?!

అసలైన వివాహబంధం పిల్లలు పుట్టాక ఏర్పడుతుంది. ఈ వ్యవస్థలో ఎన్ని లోపాలున్నా అది నిల్చివున్నదంటే కారణం - సంతానమే! వ్యవస్థను విశ్లేషిస్తూ అతి ముఖ్యవిషయాన్ని మాటవరసకైనా ప్రస్తావించకపోవడం అవగాహనలోపం అనుకోవాలి.

ఒక వ్యవస్థను సమగ్రంగా పరిశీలించి,



నిశితంగా విశ్లేషించి, సహేతుకంగా విమర్శించడం ఓ అద్భుతకళ! అది అందరికీ సాధ్యంకాదని రచయిత చక్కగా నిరూపించాడు.

-వక్కలంక కిషోర్,
అమలాపురం

## గాలిలో హరివిల్లు...?

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

"చైత్రంలో చిరుజల్లు" కాదది "గాలిలో హరివిల్లు" అనిపించింది. నవలలోని పాత్రల అస్థిరత, రచయిత భావాలలోని అస్పష్టత చూస్తుంటే! తప్పటడుగు వేసిన ప్రతివ్యక్తీ తన తప్పుకు తగిన రీజనింగ్ కల్పించుకోగలడు. అంతమాత్రాన ఆ వ్యక్తి చేసినది తప్పుకాదని అనగలమా?

'సౌశీల్యవతి'గా అభివర్ణింపబడిన మంజూష, 'మృదు మనస్కుడిగా' చిత్రింపబడిన దివ్యరాంలు 'ధర్మేచ, అర్థేచ...' అంటూ చేసిన పెళ్ళినాటి ప్రమాణాలను మంటగలిపి వైవాహిక జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసుకోవటంలో సమర్థించదగిన బలమైన కారణాలేమీ కనిపించవు. అయితే మనసులు ముడిపడని మనువుకు మనుగడ లేదనుకుంటే అంతవరకు వారి పాత్ర సమర్థనీయమే. అంటే వారి మధ్య ప్రేమకు అస్థిత్వం లేదని అనుకోవాలి.

అయితే మంజూష సంపత్‌తోనూ, దివ్యరాం కాదంబినితోనూ గడిపినది ప్రేమజీవితం కాదా? అది కేవలం స్వార్థపూరిత వ్యామోహమేనా? అదే నిజమైతే వారి ఎదలోతుల్లోంచి ఉప్పొంగిన ప్రేమావేశపు పలుకుల మాటేమిటి? వారి వదనంలో కనిపించిన అనురాగవల్లరికి అర్థం ఏమిటి? ఆ యాంగిల్‌లో చూస్తే వారి ప్రేమ ఎంతో ఉన్నతమైనదిగా కనిపిస్తుంది. కాని అంతవరకు వారితో ప్రేమైక జీవితం గడిపి, పవిత్ర ప్రేమ మూర్తులుగా నిలిచిన కాదంబిని, సంపత్‌లు ఒకేసారి హఠాత్తుగా వారి జీవితాలనుండి నిష్క్రమించడం ఎంతో అసహజంగా ఉంది. పైగా అందుకు రచయిత సూచించిన కారణాలు కూడా ఏమాత్రం సమర్థనీయంగా లేవు.

ఈ హఠాత్పరిణామానికి తల్లడిల్లిన మంజూష, దివ్యరాంలు వెంటనే సునంస్కారులైన విమల, శోభనాద్రిల ప్రవర్తనవల్ల, డాక్టర్ సాధూ మాటలవల్ల మారి మునుపటి జీవితన్ని ఒక కలలా మరచిపోయి తిరిగి కలిసి జీవించడం, అదే నిజమైన ప్రేమమయజీవితం అనుకోవడం అవకాశవాదంగాను, ఆత్మవంచనగాను అనిపిస్తుంది.

అయితే "స్త్రీ తన జీవితంలో ఒక్కరినే మనస్పూర్తిగా ప్రేమించగలదు" అనే నానుడి నిబట్టి చూస్తే మంజూష ఎవరినీ పరిపూర్ణంగా ప్రేమించినట్లు? ఆమె సౌశీల్యవతిగా అభివర్ణించబడటానికి నిలిచిన మూలకారణాలేమిటి? అనేవి సందేహాస్పదమే. ఇకపోతే వృత్తి ధర్మాన్ని స్నేహధర్మాన్ని అంకితభావంతో నెరవేర్చిన డాక్టర్ సాధూ పాత్ర ఆదర్శప్రాయమైనది. ఏదిఏమైనా ఈ నవల మింగుడుపడని కషాయంలా అనిపించింది.

-కె. అనూరాధ
వెంట్రప్రగడ.

## కృతకం!

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

నవలకి కేరక్టరైజేషన్ ముఖ్యం. అక్టోబర్ నెల చతుర నవల 'చైత్రంలో చిరుజల్లు' కథ వాస్తవానికి దగ్గరగా ఉన్నా కేరక్టరైజేషన్ లోపంవల్ల ఆకట్టుకోలేకపోయింది. ముఖ్యంగా మంజూష, సంపత్ పాత్రలు అస్పష్టంగా స్థిరత్వం లేకుండా ఉన్నాయి. రచయిత తీసుకున్న కథ వాస్తవానికి దగ్గరగా ఉన్నా పాత్రల చిత్రీకరణలో రచయిత ఫెయిలయ్యారు. ముఖ్యంగా మంజూషకి స్థిరత్వం తక్కువ. తన ఇష్టప్రకారమే దివ్యరామ్ పెళ్ళికి ఆఫర్ చేస్తే ఒప్పుకుని మళ్ళీ పెళ్లంటే అర్థంలేని శిక్షగా భావించడం ఆమె అస్థిరత్వానికి పరాకాష్ఠ. సంపత్, సాధూల మాటల ద్వారా మంజూషకి ఆత్మాభిమానం ఎక్కువ అన్పించారు. మొదట్లో అలా అన్పించినా తర్వాత రచయిత ఆ విషయం నొక్కి చెప్పడంలో డిస్‌లీడ్ అయ్యారు. ఇక సంపత్ పాత్రకి అసలు వ్యక్తిత్వం




లేదు. 'హౌ డూయూ లైక్ దివ్యరామ్' అనడం, దివ్యరాం తన ఇంటికొచ్చినప్పుడు హఠాత్తుగా లేచెళ్లిపోవడం, 'అల్ బ్లూ' నేపథ్యంలో ఇన్‌డైరెక్టుగా మంజూషతో ప్రొసీడవాలనుకోవడం, ఆమె చేతిమీద ముద్దుపెట్టుకోవడం వగైరాలంతా కాస్త ప్రేమ కోసం అలమటించే అమాయక స్త్రీలని ట్రాప్‌చేసి మోసంచేసే వ్యక్తిలా అగుపిస్తాడు.

వాస్తవానికి సభ్య సమాజంలో దాదాపు అందరి భార్యాభర్తల మధ్య ఉండే విషయమే రచయిత తీసుకున్న కథావస్తువు. రచయిత మధ్యతరగతి భార్యాభర్తలని సృష్టించి ఉంటే చాలా చెప్పినట్లయ్యేది. కాదంబినీ, సంపత్‌లు మరో జంట అయి వారిమధ్య ఏర్పడ్డ జడత్వమే వారి ఫ్రస్ట్రేషన్‌కి కారణంగా చూపి భార్యాభర్తల మధ్య కమ్యూనికేషన్ గేప్ వారి వారి స్వయంకృతాపరాధం అని చెప్పుంటే వాస్తవానికి దగ్గరగా ఉండేది. కాదంబినీ, సంపత్‌లు దూరమయ్యాక దివ్యరాం, మంజూష ఒకరికోసం మరొకరు తపించిపోవడం కృతకంగా ఉంది.

-డి. వెంకటలక్ష్మి
పీలేరు.

## ద్వేషం - ఆకర్షణ

***(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

"పనిలేనివాడి బుర్ర దయ్యాలనిలయం" అన్న సామెత మంజూషపట్ల నిజమైంది. ఆమెకలా ఒంటరితనపు ఆలోచనలకు అవకాశం ఇవ్వడంలో దివ్యరామ్ పాత్రకంటే ఆమె ఆలోచనా ధోరణే ఎక్కువ పాత్ర వహిస్తుంది. అసలు మంజూష పాత్ర మొదట్నుంచీ వింతైనదే. ఎటూ తేల్చుకోలేని వింత ధోరణిలో వుండగానే దివ్యరామ్‌తో పెళ్లి జరగడం, ఆమె అహంకారం వదలకపోవడం ఆమె పాత్రలోనే ద్యోతకమౌతుంది. ఆ ధోరణిలోనే దివ్యరామ్‌పై అంతర్గతంగా పెంచుకున్న ఏహ్యభావాన్ని మరింత బలపరచుకోడానికి దివ్యరామ్ సంపాదనా తాపత్రయం తోడైంది.

నిజానికి ఒక ఉన్నత స్థానానికి ఎదగాలనుకున్న పట్టుదల వున్న ఏ మగాడైనా నిత్యం భార్య దగ్గరే కాలం గడపలేడు. ఆ కారణాన్ని అసరాగా తీసుకుని ఆమె మనసులో అంతర్గతంగా వున్న విచ్చలవిడి తత్వాన్ని సంపత్‌కు మార్ని చూడగానే బయటపెట్టింది.

ఒకరిమీద కాస్త ద్వేషం వున్నప్పుడు, కొత్త వ్యక్తిలో ఆకర్షణ చూసినపుడు మొదటివ్యక్తిపై ఏహ్యభావం మరింత పెరుగుతుందే తప్ప తగ్గించుకోరు. ఇక్కడ మంజూష కూడా అదే చేసింది. అదే ఆలోచనల్లో ఆమె సంపత్‌కు మార్‌తో విచ్చలవిడిగా తిరిగింది. తన చిత్త చాంచల్యాన్ని తీర్చుకుంది.

ఇక ఆమె చేసిన తప్పు తప్పుగా కనబడకుండేందుకు రచయిత చాలా కష్టపడ్డారు. అదే కాదంబినికి దివ్యరామ్ దగ్గర కావడం. ఒక అభిమానిగా పలకరించడానికి వెళ్లినంత మాత్రాన ఏ ప్రత్యేకత లేకుండా ఆమె దివ్యరామ్‌కి ఆకర్షితురాలవడంతో ఆమె ఎవరు అభిమానం చూపినా లొంగిపోతుందనే అర్థం స్ఫురింపచేస్తోంది. అసలు బిజినెస్ మీద కాన్సన్‌ట్రేషన్‌తో మంజూషతో గడపలేకపోయాడుకానీ ఆమెలో లోపంగానీ ఆమెపై కోపంతోకాని కాదు. మరొక స్త్రీకి దగ్గరవాల్సిన అవసరం అతడికి లేదు.

ఏదో కొత్తదనాన్ని సంస్కరణ వాదాన్ని చూపిద్దామనుకున్న రచయిత చివరికి పురాతన భావాల్నుంచి దూరంకాలేకపోయాడు. దివ్యరామ్‌ని కాదంబిని విడిచివెళ్లిన సమయంలోనే సంపత్ కూడా మంజూషని విడిచి వెళ్లడం అతుకులబొంతలాగే వుంది తప్ప వాస్తవతకి దగ్గరగా లేదు. వారు మరొక దిక్కులేక భార్యాభర్తలుగా తిరిగి దగ్గరయినట్లుగానే చివరికి అర్థమౌతుంది తప్ప అనురాగంతోకాదు. ఒకవేళ మరల ఎవరికెవరు ఎదురుపడినా చిత్త చాంచల్యం కలుగుతుంది. అలాటి ముగింపు ఇచ్చారు.

ఏదేమైనప్పటికీ పాత్రల చిత్రణం బాగుంది, కథాగమనంలో వేగం, చదివించే తత్వం వున్నాయి. కథా కథనం శైలి చక్కగా వున్నాయి.

-అయ్యగారి శ్రీనివాసరావు
పార్వతీపురం



# చతుర ప్రపంచం

## మాయ సాధువులు

1987 సంవత్సరం, మార్చినెలలో మహారాష్ట్రలోని కరాడ్ జిల్లాకు చెందిన వాడ్‌గామ్ గ్రామానికి ఓరోజు ఉదయమే పదకొండుమంది సాధుపుంగవులు దయచేశారు. కాషాయాంబర ధారులై, ఓ ఏనుగు, రెండు గుర్రాలను వాహనాలుగా చేసుకొని వచ్చిన ఆ సాధుపుంగవులు తమ నివాసం హరిద్వారమని చెప్పారు.

గ్రామంలోకి ప్రవేశిస్తూనే సాధువులందరూ స్నానాలకై నది దగ్గరకు చేరుకున్నారు. వారి రాక తెల్సి నదీతీరానికి గుంపులుగుంపులుగా చేరిన కొందరు గ్రామస్తులతో వారు ఆప్యాయంగా సంభాషించారు.

ఘోరతపస్సుచేసి పరమేశ్వరుణ్ణి ప్రసన్నం చేసుకున్నామనీ, అనేక వరాలుపొంది దివ్యశక్తుల్ని సంపాదించామనీ చెప్పి "మీమీ కష్టనష్టాల్ని ఈడేర్చుతాం; సందేహాలను, సమస్యల్ని నివృత్తి చేస్తాం" అంటూ వారిని సంతృప్తిపరిచారు.

అనంతరం గ్రామవిశేషాలు, విషయాలు అడుగుతూ మాటల మధ్యలో- "కొన్నేళ్ల క్రితం ఈ గ్రామంనుండి మగపిల్లలు ఎవరైనా ఎవరికీ చెప్పకుండా వెళ్లిపోయారా?" అని అడిగారు వారు. కాంబే అనే ఓ ఇల్లాలు తన బాబాయి కొడుకైన వసంత్ పన్నెండేళ్ల క్రితం పదవతరగతి పరీక్ష బాగా రాయలేదనే కారణంతో ఇంటినుండి పారిపోయాడు" అని చెప్పింది.

అప్పుడు సాధువులంతా నవ్వుతూ తమలోని ఒక సాధువును చూపించి "ఇతనే ఆ వసంత్, మీరు గుర్తుపట్టారో లేదో తెలుసుకుందామని మిమ్మల్ని ప్రశ్నించాం" అని చెప్పారు. తరువాత వారంతా ఆ గ్రామంలోని గుడిని దర్శించడానికి వెళ్లారు.

ఆశ్చర్యం, ఆనందం కాంబేను ముంచెత్తగా పరుగెత్తుకుంటూ వెళ్లి ఈ విషయం ఊరంతా చెప్పింది. ఊరు ఊరంతా బయలుదేరి గుడి దగ్గరికి వచ్చారు. వసంత్ తల్లిదండ్రులు అతన్ని గుర్తుపట్టకపోయినప్పటికీ తమకొడుకు తిరిగివచ్చాడనే సంతోషంతో అతన్ని ఆప్యాయంగా అక్కున చేర్చుకున్నారు. గ్రామస్తులు అతన్ని అభిమానంతో పలకరించారు. ఈ విషయంతెల్సి వసంత్‌ను చూడటానికి పక్కఊర్లో టీచర్‌గా పనిచేస్తున్న అతని సోదరుడు కూడా వచ్చాడు.

అతనెలా తప్పిపోయాడో తెలుసుకోవాలనే ఉత్సాహం ఎవరిలోనూలేదు కాని తమ గ్రామస్తుడు పుణ్యతీర్థమైన హరిద్వార్ వెళ్లి అక్కడి నదిలో నిలబడి ఏళ్ల తరబడి తపస్సు చేసాడనే విషయమే వారికి ఎంతో గర్వంగా తోచింది. తపస్సువల్ల శంకరుడి మెప్పుపొందిన సాధువుల శుశ్రూషలుచేస్తే పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయని వారు నమ్మేరు.

వసంత్ తల్లిదండ్రులు అతన్ని ఇంటికి ఆహ్వానించారు. కాని వసంత్ ఒప్పుకోలేదు. తాను సన్యాసినని, తన సహచరులతో ఆ గుడిలోనే ఉంటానని చెప్పాడు.

అతని నిశ్చలత్వాన్ని భక్తిని పొగడుతూ గ్రామస్తులంతా ఆగుళ్లో అతనితో పాటు మిగతా సాధువులకూ సపర్యలుచేస్తూ, విందూవినోదాలతో వారికి తృప్తికలిగిస్తూ వచ్చారు.

కొంతకాలం అక్కడే ఉండి క్షుద్రశక్తుల్ని తరిమికొడతామని, గ్రామంలో శాంతినెలకొల్పుతామనీ అన్నారు సాధువులు. గ్రామస్తులు వారిపై పూర్తి విశ్వాసాన్ని కనబరుస్తూ, ఎంతో భక్తిశ్రద్ధలతో మెలగుతూ బంగారం, డబ్బుతో





పాటు విలువైన వస్తువులను కూడా కానుక లుగా సమర్పించుకోవడం ప్రారంభించారు.

వసంత్ తల్లి కొడుకుని, అతని గొప్పతనాన్ని చూసి మురిసిపోయింది. వసంత్ భుజంపై ఉండవలసి పుట్టుమచ్చగురించి తల్లి అడిగినప్పుడు అతను "దాదాపు మూడేళ్లు నీళ్లలో నిలబడి తపస్సు చేయడంవల్ల చేపలు నాశరీరాన్ని తినేశాయి. అందువల్ల పుట్టుమచ్చ చెరిగిపోయింది. కొత్తచర్మం రావడంతో పుట్టుమచ్చ తిరిగిరాలేదు'' అన్నాడు.

తల్లిదండ్రులను సాధువువేషంలో వచ్చి నమ్మించి మోసం చేసిన ఓ యువకుడి ఉదంతమది. సంపత్ వెంటనే వెళ్ళి జిల్లా పోలీసు అధికారికి అన్ని విషయాలూ చెప్పాడు. అయితే సాధువులపై చర్యతీసుకోవడానికి ఆయన ఒప్పుకోలేదు. గ్రామస్థుల మతస్వేచ్ఛకు తను అడ్డురానని అన్నాడు. సంపత్ కొందరు స్థానిక ప్రజలకు చెప్పిచూశాడు. కానీ ఎవరూ అతని మాటల్ని పట్టించుకోలేదు.

మరోపక్క వసంత్ తల్లిదండ్రులు కొడుకు




ఆ జవాబుకు ఆ తల్లి మనసు ద్రవించిపోయింది. వసంత్ ఎదుర్కొన్న కష్టాలను విని బాధపడినప్పటికీ, అతని దృఢనిశ్చయానికి పొంగిపోయింది.

అయితే గ్రామస్తుల సపర్యలతో సాధువులు దర్జాగా ఉండటం అదే గ్రామానికి చెందిన యువసేన సభ్యుడు సంపత్‌కు నచ్చలేదు. సంఘసేవకుడైన అతను, గ్రామస్థుల మూఢనమ్మకాలను సదా వ్యతిరేకించేవాడు. సంపత్‌కు వారు నిజమైన సాధువులో కాదో తెలుసుకోవాలనిపించింది. సరిగ్గా అలాంటి సమయంలోనే అతను దినపత్రికలో ఒక వార్త చదివాడు. చిన్నప్పుడెప్పుడో తప్పిపోయిన వ్యక్తినంటూ ఓ

తిరిగివచ్చాడనే సంతోషంతో యజ్ఞం చేయతలపెట్టారు. ఆ సందర్భంగా ఐదువేల రూపాయలు, రెండుతులాల బంగారు వస్తువులు బహుమతిగా ఇచ్చారు. వైభవంగా జరుగనున్న ఆ యజ్ఞానికి గ్రామస్థులంతా తరలివచ్చారు. ఇంతలో వసంత్‌కు గతంలో చదువుచెప్పిన ఉపాధ్యాయుడు ఒకరు కాకతాళీయంగా అక్కడకు చేరుకున్నాడు. వసంత్ తనను గుర్తించక పోయేసరికి ఆయనకే అనుమానం కలిగింది. అవకాశంకోసం చూస్తున్న సంపత్ వెంటనే కిక్కిరిసిపోయిఉన్న గ్రామస్థుల మధ్య

నుండి తేవచేసుకొని యజ్ఞవేదిక సమీపించి అందరి సమక్షంలో వసంత్‌ను ప్రశ్నలతో ముంచెత్తాడు. వసంత్ పుట్టిన తేదీని, తనకు చదువు చెప్పిన ఉపాధ్యాయుల పేర్లు, దగ్గరి బంధువుల పేర్లు అడిగాడు. వసంత్ నుండి మాత్రం, ''నేనివన్నీ మరచిపోయాను. నాకేం గుర్తులేవు'' అన్న జవాబుమాత్రమే వచ్చింది. సంపత్ పట్టువదలని విక్రమార్కుడిలా, ''కనీసం మీ అమ్మగారి పూర్తిపేరయినా చెప్పగలవా?'' అని అడిగాడు. దానికి కూడా అతని నుండి జవాబులేదు. సాధువు ప్రతి విషయానికి మరచిపోయానంటూ చెప్పడం, అతను చిన్నప్పుడెప్పుడో తప్పిపోవడం మాత్రం గుర్తుండటం ఇవన్నీ చూసేసరికి గ్రామస్థుల్లో చాలామందికి వసంత్‌పై అనుమానం చోటుచేసుకోసాగింది.

నువ్వెవరో నిజం చెప్పకుంటే పోలీసుల్ని పిలుస్తానని బెదిరించాడు సంపత్. ఆ బెదిరింపులకు భయపడిపోయిన వసంత్ నిజం చెప్పేశాడు.

వసంత్ అసలు పేరు రాజన్ గిరి. తపస్సు చేసిన విషయం అంతా బూటకం. ఇలా చిన్నచిన్న గ్రామాలవారిని మోసంచేస్తూ పొట్ట నింపుకొని, నగదు, బంగారం సమకూరగానే ఉడాయిస్తున్నామని చెప్పాడు.

గ్రామస్తులంతా ఆగ్రహంతో బూటకపు సాధువులపై దూకి తామిచ్చిన కానుకలను, డబ్బును లాక్కున్నారు. ఇంతలో సంపత్ కబురు అందుకున్న పోలీసులొచ్చారు. ఆ సాధువుల దగ్గర ఈ గ్రామస్తులవికాక మరో 13 వేల నగదు, రకరకాల విలువైన వస్తువులు దొరికాయి. పోలీసులు సాధువులను వారి వాహనాలతో సహా పోలీస్‌స్టేషన్‌కు తీసుకువెళ్లారు.

రాజన్ అతని శిష్యగణం ప్రస్తుతం జైలులో శిక్ష అనుభవిస్తూ ఉన్నారు.

---

## హృద్రోగుల పాలిటి వరం

హృద్రోగులపాలిట వరంలా కనిపెట్టబడింది కలర్ డాప్లర్‌మెషీన్. దీన్ని 1982లో జపాన్‌కి చెందిన డాక్టర్ కాజీ అనే ఎలెక్ట్రానిక్ ఇంజనీర్ కనిపెట్టాడు. దాన్ని ఎకో-కార్డియోగ్రఫీ అని కూడా అంటారు. హృదయాన్ని భద్రంగా ఎలా కాపాడుకోవాలో వివరంగా చెప్పే ఈ మెషీన్ విజ్ఞానశాస్త్రప్రపంచంలో సంచలనం సృష్టించింది.

ఎలక్ట్రానిక్స్, మెడికల్ సైన్స్‌ల సంఘటిత విజ్ఞానంతో ఈ మెషీన్ అవతరించింది. ఇది కేవలం హృద్రోగాన్ని కనిపెట్టటమే కాకుండా భవిష్యత్తులో హృద్రోగాలకు గురయ్యే అవకాశం వున్న రోగులకు కూడా ఆ విషయాన్ని తెలియజేసి దానికి తీసుకోవాల్సిన జాగ్రత్తలు చెపుతుంది.

ఇప్పుడు ఇండియాలో కూడా ఈ మెషీన్‌ని ఉపయోగిస్తున్నారు. దీనితో గుండె స్థితిగతులను అతివేగంగా తెలుసుకోవచ్చు. ఇది రాకపూర్వం టూడైమన్షనల్ పద్ధతిలో గుండె స్థితిగతులను తెలుసుకోడం జరిగేది. చెడిపోయిన గుండె వాల్వ్‌ల పరిస్థితిమాత్రమే తెలుసుకోగలిగేవారు వైద్యులు.

ప్రస్తుతం ఈ మెషీన్‌వల్ల గుండె పనిచేయడంలోని చిన్నపాటి దోషాన్ని కూడా నిర్దిష్టమైన పద్ధతిలో, నిక్కచ్చిగా తెలుసుకోవచ్చు. అసలు దీనికి 19వ శతాబ్దంలో ఆస్ట్రియన్ సైంటిస్ట్ డాక్టర్ డాప్లర్ అనే ఆయన పునాదివేశాడు. ఆయన పరిశోధన ప్రకారం ఈ మెషీన్‌తో గుండెచప్పుళ్ళను బిగ్గరగా వినడమేకాక, ముందుకి వస్తున్న శబ్దాలను, అక్కడే వున్న శబ్దాలను, వెనక్కి వెడుతున్న శబ్దాలను ఒకేవేగంలో, ఒకే ధ్వనితో వినచ్చు. రోగులను పరీక్షించేటప్పుడు ఈ సౌండ్‌డాప్లర్ మెషీన్ ఒక నిర్దిష్ట పరిమాణంలో శబ్దాన్ని విడుదల చెయ్యడం, అది వెళ్ళి హృదయభాగంలో రక్తప్రసారానికి తగిలి మళ్ళీ ఒక నిర్దిష్టవేగంలో వెనక్కి రావడం జరుగుతుంది. ఆ వేగాన్ని ఈ మెషీన్ లోపలిభాగంలో ఉండే ఆటో-కో-రిలేటర్ ఆటోమేటిగ్గా రికార్డ్‌చేస్తుంది. దీన్నిబట్టి గుండె ఎలావున్నదీ, రోగగ్రస్థమయితే దాని







యొక్క పరిస్థితి మొదలయిన ఎన్నో వివరాలను టీ.వీ. స్క్రీన్‌మీద ప్రాజెక్ట్ చేస్తుంది. అవసరమయితే ఈ స్క్రీన్‌మీద పిక్చర్‌ని ఎన్‌లార్జ్ చేసుకుని పరిశీలించవచ్చు.

## హక్కులను కాపాడుకోండి

కుళాయిల్లోంచి నీళ్ళు రావట్లేదన్నా ఎంతో డబ్బుపోసి కొనుక్కున్న గ్యాస్‌స్టౌ మండటంలేదన్నా వీధి దీపాలు సరిగ్గా వెలగడంలేదన్నా ఇన్సూరెన్స్, గ్రాట్యుటీ వగైరా డబ్బు వసూలుకావడంలో జాప్యం జరుగుతోందన్నా ఇలాంటి నిత్యజీవిత సమస్యలెన్నిటినో తన భుజస్కంధాలమీద వేసుకుని పనులు పూర్తిచేసి మానవసేవ చేస్తోంది గుజరాత్‌లోని 'కంజ్యూమర్ ఎడ్యుకేషన్ రీసెర్చి సెంటర్'. వినియోగదారుల హక్కులను కాపాడటంలో అవసరమయితే హైకోర్టుకేకాదు, సుప్రీంకోర్టుదాకా కూడా వెడుతుంది ఈ సెంటర్. ఈ పనులన్నీ పైసా తీసుకోకుండా ఉచితంగా చేస్తుంది. కేవలం గుజరాత్ రాష్ట్రానికే పరిమితం కాకుండా దేశంలో ఎక్కడనుంచి అర్జీలు వచ్చినా పరిశీలించి వాటిని పరిష్కరించడంలో తోడ్పడుతుంది.

అబూదాబికి చెందిన రామచంద్రన్ అనే ఆసామి మంగుళూరులోని ఓ ఆయిల్ కంపెనీలో పనిచేసేవాడు. 1981లో అతడు కారు ఏక్సిడెంట్‌లో మరణించాడు. కానీ అతను పోయి 5 ఏళ్ళయినా, ఇన్సూరెన్స్ కంపెనీ నుంచి అతని భార్యకి రావలసిన లక్షాపదిహేనువేల రూపాయలు రానేలేదు. ఆవిడ ఎన్నో ప్రయత్నాలు చేసి విసిగిపోయి చివరకు ఈ సంస్థ సహాయమడిగింది. అప్పుడు ఈ సెంటర్ అబూదాబిలోని భారత రాయబార కార్యాలయాన్ని సంప్రదించి మొత్తంమీద ఆ డబ్బు ఆమెకి అందేలాచేసింది.

మరో చిత్రమైన కేసును అతి చాకచక్యంగా పరిష్కరించింది సెంటర్. జ్యోతిబెన్ అనే యువతి కుక్క కరిచి చనిపోయింది. ఆమె జీవిత భీమా చేసింది కానీ రూల్సుప్రకారం కుక్క కరిచి 90 రోజులు దాటాక చనిపోయింది

కాబట్టి కంపెనీనుంచి ఒక్క పైసా కూడా రాద న్నారు. ఆమె 92వ రోజు చనిపోయింది. దాంతో ఆమె బంధువులు ఈ సెంటర్‌వారి సహాయం అడిగారు. వాళ్ళు అమెరికాలో ఓ వ్యక్తి అగ్నిప్రమాదానికి గురై అయిదేళ్ళ తరువాత చనిపోతే భీమా కంపెనీ అతని బంధువులకు మొత్తం




డబ్బు చెల్లించిందనీ, కాబట్టి జ్యోతిబెన్ కేసును కూడా సరైనతీరులో పరిష్కరించాలంటూ కోర్టుకెక్కారు. ఇన్సూరెన్స్‌పైకం మొత్తం ఆమెకిచ్చితీరవలసిందే అని కోర్టు తీర్పు ఇచ్చింది. ఈ సెంటర్‌కి అహమ్మదాబాద్ ఐ.ఐ.టి.లోని సీనియర్ ప్రొఫెసర్ డాక్టర్ మనుభాయ్‌షా మేనేజింగ్ ట్రస్టీగా వ్యవహరిస్తున్నారు. ఈ సెంటరు ఒక లైబ్రరీని నడుపుతోంది. అందులో వినియోగదారుల హక్కులు, వాటి రక్షణకు సంబంధించిన సమాచారాన్నిచ్చే పుస్తకాలు 5,000 దాకా వున్నాయి. అప్పుడప్పుడు ఈ సెంటర్ ఎగ్జిబిషన్‌లను నిర్వహిస్తుంది. వాటిద్వారా కంపెనీల, వ్యాపారస్థుల చేతుల్లో వినియోగదారులు ఏవిధంగా మోసపోతున్నారో తెలియజేస్తుంది. దీనికి ఆస్ట్రేలియా, జర్మనీ, అమెరికా మొదలయిన దేశాలలోని అలాంటి సంస్థలు కూడా నిధులను సమకూరుస్తున్నాయి.

## విలువకట్టలేని వజ్రాలవైనం

ప్రపంచ మొత్తంమీద కీర్తిశేషుడైన 'నిజాం' నవాబే ధనికుడన్న సంగతి తెలిసిందే. ఎన్నోరకాల విలువకట్టలేని వజ్రాలు వారివద్ద వున్న సంగతి జగద్విఖ్యాతం. కానీ ప్రస్తుతం 37 వజ్రాలు మాత్రమే మిగిలివున్నట్టు లెక్కలను బట్టి తెలుస్తోంది. భారతప్రభుత్వం అందులో 7 వజ్రాలను కొంటాననీ, మిగతా 30 వజ్రాలను వారసులు తీసుకోవచ్చనీ ఆమధ్య ఒక ప్రకటన చేసింది. కానీ నిజాంముని మనవరాలు ఫాతిమాఫాజియా దీనికి ఒప్పుకోలేదు. ఈవిడ ఈ వజ్రాలను విదేశాలలో అధికధరలకు అమ్మాలని ముచ్చటపడుతూ ఈ విషయాన్ని సుప్రీంకోర్టుకు విన్నవించుకుంది. ఆ సందర్భంలో కొంతమంది వజ్రాల వర్తకులు, ఆ వజ్రాలను విలువకట్టడంకోసం పిలిపించబడ్డారు. బొంబాయిలోని మర్కంటైల్ బ్యాంక్‌లో ఈ వజ్రాలను భద్రంచేశారు.




అందులో ఒక వజ్రాన్ని చూసి వర్తకులు ముక్కున వేలేసుకున్నారు. దాని బరువు 414.25 క్యారట్లు వుంది. దాని విలువ సుమారు 10 కోట్లు వుంటుందని అంచనావేశారు. కోహినూర్‌కన్న అత్యంత విలువైన అద్భుత వజ్రంగా తేల్చారు దాన్ని. నిజామ్ తన మెడలో ఒక హారంలో ఈ వజ్రాన్ని బిగించుకోవాలని అనుకునేవాడు. కానీ ఆ వజ్రానికి తగిన హారం, దాని డిజైను... ఎలా వుండాలనే విషయం తేలక రోజులు గడిచిపోయాయి. మరికొన్ని వజ్రాలు అర్ధరూపాయంత పెద్దసైజులో వున్నాయి. నిజామ్ దర్బారులో కొలువుతీరినపుడు ఈ వజ్రాలను ధరించేవాడు.




మరో అందమైన వస్తువు ఆర్మ్‌లెట్. దీంట్లో రెండు వజ్రాలు తాపడం చెయ్యబడ్డాయి. వీటి విలువ 2.28 కోట్లు.

ఈ వజ్రాల విలువకట్టిన కొంత కాలానికి నిజామ్ ట్రస్ట్‌వాళ్ళు వీటిని అమ్ముతున్నట్టు ప్రకటించారు. అన్నింటికన్న పెద్ద టెండరు 12 కోట్లకి వచ్చింది. కానీ 'టైమ్స్ ఆఫ్ ఇండయా'వాళ్ళు ఈ టెండర్లో ఎన్నో లోటుపాట్లున్నట్టు ప్రకటించడంతో అది రద్దయింది. అప్పటి నుంచీ ఎంతోమంది ఆ వజ్రాలను కొనటానికి ప్రయత్నాలు చేస్తూనేవున్నారు. అందులో గ్రీసుకు చెందిన స్టెవ్‌టోన్ నికోస్ అనే కోటీశ్వరుడు, దుబాయ్‌కి చెందిన గలాధరి ప్రముఖులు. గలాధరి టెండరు 20 కోట్లకు వుంది. కానీ అప్పట్లో ఈ టెండర్లలో కూడా లొసుగులు కనపడి రద్దుచేశారు.

20 కోట్లవరకూ టెండరు వచ్చింది కాబట్టి కనీసం 21 కోట్లకయినా ఈ వజ్రాలను ఖరీదు చేసి వాటికున్న చారిత్రక, విలువలు కాపాడవలసిన బాధ్యత ప్రభుత్వానిదే అని కొందరు అభిప్రాయపడుతున్నారు. విదేశాలలో జరిగే ఎన్నో వేడుకలలో భారతీయ వస్తువులు చోటు చేసుకోడం చూస్తే వారికి మనదేశంపట్ల, మన వస్తువులపట్ల ఎంత మోజుందో తెలుస్తుంది. మన మామూలు పురాతన వస్తువులనే వాళ్ళెంతో పదిలంగా దాచుకుని మురుస్తుంటే కోట్లాది రూపాయలు విలువచేసే ఈ వజ్రాలను మనం ఎక్కడో మారుమూల బ్యాంకుసొరుగుల్లో దాచి వాటిని ఎంత అశ్రద్ధచేస్తున్నామో అనిపిస్తుంది.

1947లోనే ఇండియాలో మొదటి ఫ్రెంచిరాయబారి డాక్టర్ ఫ్రాన్సిస్ బ్రూనెల్ ఈ వజ్రాలు, వాటి విలువ గురించి అద్భుతమైన ఉపన్యాసాలివ్వడమే కాకుండా, అనేక వ్యాసాలు కూడా రాశాడట.

## పేర్లు కలిసినవేళ

కొన్ని విషయాలు యాదృచ్ఛికంగానే జరిగినా అవి అలాగే ఎందుకు జరగాలీ అని ఆశ్చర్యం కూడా వేస్తుంది. టి.వి. సీరియల్ రామాయణంకోసం లవ, కుశల పాత్రలకు సరిపడే అబ్బాయిలను వెతుకుతున్నప్పుడు రామానందసాగర్‌కు దొరికిన కవలల పేర్లు కూడా లవ (లవదాస్), కుశ (కుశదాస్) అవడం అందరినీ ఆశ్చర్యపరిచింది. వీళ్ళు కలకత్తాకు చెందిన బాలురు.

లవ, కుశుల తండ్రి ప్రభాత్‌దాస్ మంచి గాయకుడు. సుప్రసిద్ధ హిందీ గాయకుడు అనూప్‌జలోతా టీమ్‌లో పనిచేస్తున్నాడు ఈయన. లవ, కుశులిద్దరూ కూడా తమ ఎనిమిదో ఏటనుండే చిన్నచిన్న ఫంక్షన్స్‌లో పాటలుపాడేవారు. అనతికాలంలోనే 'మన్నాడేనైట్'లాంటి పెద్ద ప్రోగ్రాముల్లో కూడా పాటలు పాడటం ప్రారంభించారు.

వీరి పాటలు విన్న బప్పీలహరి ముగ్ధుడై, 'బొంబాయి వస్తే మీకేమైనా సహాయం చేస్తా'నన్నాడు. ఆ ఆహ్వానాన్ని పట్టుకుని బొంబాయి వెళ్ళారు లవ, కుశులు. వీళ్ళిద్దరినీ చూసిన బప్పీలహరి మామగారు రామానందసాగర్ లవ, కుశ పాత్రలకోసం వెతుకుతున్నట్టు తెలుసుకుని వెంటనే వీళ్లిద్దరినీ సాగర్ కొడుకు సుభాష్‌కి పరిచయం చేశాడు. అతడు తండ్రికి చూపించి, తనకు కూడా నచ్చినట్టు చెప్పాడు. "మీరు హిందీలో మాట్లాడగలరా?" అని అడిగారు రామానందసాగర్.

"మాట్లాడ్డం రాదుగానీ హిందీ పాటలు పాడగలం" అంటూ కొన్ని పాటలు పాడి వినిపించారు లవకుశలు.




పాటలు కొంచెం నచ్చినట్టే మొహంపెట్టి అటుపైన వాళ్లని జీన్స్‌ప్యాంటు, బాబ్డ్‌హెయిర్‌తో వున్న ఒక యువతివద్దకు తీసుకెళ్ళి "ఈవిడే మీ అమ్మ సీత" అన్నారు నవ్వుతూ.

అప్పుడు వాళ్ళకి అర్థమయింది తమని సెలెక్ట్‌చేశారని.

"షూటింగ్ డేట్ ఫిక్స్ అయ్యాక తెలియచేస్తామనీ, అంతవరకూ మీరు మీ శరీరాల వెయిట్ పెరగకుండా చూసుకోవాలని సలహా ఇచ్చాడు సాగర్.

ఇంతకీ తమ తల్లిదండ్రులు లవ, కుశల పేరెట్టడంవల్లే ఇల్లా కలిసొచ్చిందని .మురిసిపోతున్నారు ఆ పిల్లలు.

## అలరించే
## అద్భుతకళ

కుమ్మరపని (పాటరీ) ఇండియాలో చాలా మందికి ఉపాధినిస్తోంది. సాధారణంగా ఈ వృత్తికి సంబంధించినవారు పేదరికంలోనే మగ్గుతూ కనిపిస్తారు. చదువులు, సంపదలు ఈ వృత్తిచేసేవారిలో ఎక్కడా కనిపించవనే చెప్పాలి. కానీ... దానికి భిన్నంగా అగ్రకులంలో పుట్టి చక్కని విద్యా సంస్కారాలుగల ఓ యువతి తన ధ్యేయం 'కుండల తయారీలో నిష్ణాతురాలినవడమే' అని నిశ్చయించుకోవడం ఆశ్చర్యమే. ఆవిడ పేరు ప్రమీలాపండిట్.

ఈ కుండలు, కూజాలు రకరకాల ఆకర్షణీయమైన డిజైన్లలో తయారు చేయడానికి కొన్ని ఆధునిక పద్ధతులను తెలుసుకోడానికి విదేశ యానం కూడా చేసి వచ్చిందీ మహిళ. ఆవిడే కనక నిజంగా తన ధ్యేయాన్ని నెరవేర్చుకోగలిగితే ఈ వృత్తిలో ముందంజ వేసిన మొట్టమొదటి ఆధునిక యువతిగా ఆమె మన్ననలందుకోడం ఖాయం.

కుండలు తయారు చేసేటప్పుడు ఈమె ఎవరి సహాయం తీసుకోకుండా మట్టికలపడం దగ్గరనుంచి, నగిషీ చెక్కడం వరకు స్వయంగా చేస్తూ వుంటుంది. ఈమె మట్టితో చేసే ఎన్నో రకాల వస్తువులు అధునాతన గృహాల్ని చూడముచ్చటగా అలంకరిస్తున్నాయి.

ఎమ్మేలు, ఎం.బి.ఏలూ లాంటి విద్యలు మాత్రమే నేర్పే విద్యాసంస్థలున్న ఈ దేశంలో కేవలం కుమ్మరిపనినేర్పే సంస్థల కోసం తెగ వెతికిన ప్రమీలా పండిట్ అలాంటి సంస్థలేమీ దొరక్క నిరుత్సాహపడింది మొదట్లో.




విదేశాలనుంచి తిరిగొచ్చాక ఆమె తన కారు గేరేజినే ఓ వర్క్‌షాపుగా మార్చి రాత్రింబవళ్లు కుండల తయారీలోనే మునిగి తేలేది. ఆర్ట్ అండ్ పాటరీ మీద ఆమె ఎన్నో పుస్తకాలని అధ్యయనం చేసింది. కళావిమర్శకులెంతో మంది ఆమె హస్త నైపుణ్యాన్ని పొగిడారు. ఈ విద్యలో ప్రపంచం మొత్తం మీద గొప్పవాడనిపించుకున్న బెర్నార్డ్ అనే కళాకారుడివద్ద ప్రమీలా పండిట్ ఆరు నెలలు శిక్షణ కూడా

పొందింది.

ఆవిడ పాటరీ స్కూలు నొకదానిని ప్రారంభించి అందులో ఎంతోమంది బాలబాలికలకు శిక్షణ నిస్తోంది. ఈ విద్యార్థులు శిక్షణ కాలంలో చేసిన వస్తువుల్ని కూడా ఎంతో అపురూపంగా భావించి కొంటున్నారట కష్టమర్లు. ఈ అద్భుత గ్రామీణకళావృత్తియందు పట్టణవాస స్త్రీలు కూడా అభిరుచి పెంచుకోవాలని అంటూవుంటుందిట ప్రమీలా పండిట్. తన నివాసాన్ని కుమ్మరి పనివారుండే ఓ మారుమూల గుడిసెల ప్రాంతానికి మార్చుకుందట ఈమె. దానివల్ల వారినుంచి అవసరమైన సలహాలు పొందవచ్చన్నది ఆమె అభిప్రాయం. ఈ కళని ఏదో మట్టి-కుండ వ్యవహారంలా మలకనచేయకుండా అద్భుతకళగా గుర్తించాలన్నది ఈమె ఆశయం.

## వరుడు మెచ్చినవైనం

పెళ్ళిళ్ళు అవడానికీ, అవకపోవడానికీ కూడా చాలా కారణాలుంటాయి. పెళ్ళి అవకపోవడం విషయంలో ఆడపిల్లలకే ఎక్కువ సమస్యలు




న్నట్లు మనందరికీ తెలిసిందే. వరుడు నలుపయినా, అనాకారయినా, తక్కువ సంపాదనపరుడయినా పెళ్ళి అవడం అతని విషయంలో అంత కష్టంకాదు. కానీ ఇవే లక్షణాలు అమ్మాయికుంటే అంతేసంగతులు. అందం వుంటే చదువులేదనో, ఆ రెండూ వుంటే కట్నం తక్కువనో, అవన్నీ వున్నా సాంప్రదాయం విషయంలో సందేహమనో... ఏదో కారణం వెతికి సంబంధాలు వదిలేస్తూ వుంటారు వరుడిపక్షంవారు. కలకత్తాకు చెందిన మాధురి అనే అమ్మాయి తన తలకట్టు కారణంగా తనకు పెళ్ళికావడం కష్టమని భయపడేది. అలాగని అది ఏ పిలకజడో, బట్టతలో అనుకునేరు! మాధురి పొడవు 5 అడుగుల 1 అంగుళమయితే ఆమె జుట్టు పొడవు 5 అడుగుల 5 అంగుళాలు. ఈమెగారి కేశవైపరీత్యానికి తల్లిదండ్రులు కూడా పెళ్లికాదేమో అని బెంగపడ్డారు. కాని జుట్టు కత్తిరించుకోవడానికిమాత్రం మాధురి ససేమిరా అనేది. అయితే మాధురిని చూడ్డానికి వచ్చిన ఓ పెళ్ళికొడుక్కి అమితంగా నచ్చింది ఆమె నిడుపైన కేశరాసే. పెళ్ళయ్యాక అత్తవారింట్లో ఆమెకన్నా ఆమె జుట్టుకే చక్కటి సంరక్షణ జరిపించసాగారు. ప్రతి 3 వారాలకొకసారి తలస్నానం చేసి అతి భద్రంగా తన జుట్టును కాపాడుకునే మాధురి ఎప్పటికైనా తన కేశసంపదతో గిన్నీస్ బుక్‌లో కెక్కాలని చూస్తోంది.

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చేతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'ఛతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియవరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# మళ్ళీమళ్ళీ చూడాలనిపించే

హిమాచల శిఖరాగ్రాల్లో, మంచుకొండలమధ్య ప్రకృతి అందాలన్నిటినీ సంపూర్ణంగా పుణికిపుచ్చుకున్న ప్రాంతం చంబాలోయ. అద్భుత శిల్ప, చిత్రకళా నైపుణ్యంతో, ప్రజల భక్తి భావాలకు ప్రతీకలుగా నిల్చే అనేక గుళ్ళూ గోపురాలతో, సౌమ్యులయిన ప్రజల సంస్కృతీ సంస్కారాలమధ్య మూర్తీభవించిన వనదేవతలా నిలిచిన చంబాని దర్శించడం ఓ మరపురాని అనుభూతి.

రావీ నదికి కుడివైపున సుమారు 926 మీటర్ల ఎత్తులో ఉన్న చంబాని చూడాలంటే షామాదర్ పర్వతాల మీంచి చూడవలసిందే. చంబాకి ఓ కిలోమీటర్‌కి ఎగువగా శిఖరాగ్రంలా కనిపిస్తూ చాముండాదేవి ఆలయంవుంది. డల్‌హౌసీ నుంచి చంబాకు దట్టమైన పచ్చటి పర్వతారణ్యాలగుండా చేసే ప్రయాణం ఓ అద్భుతమైన అనుభవం. భూమికి 8100 అడుగుల ఎత్తున ఈ ప్రయాణం కొనసాగుతుంది.

చంబాకి చేరుకునేలోగా దారిలో ఎదురయ్యే అందమైన ప్రదేశం ఖజ్జియార్. అక్కడ బస్ దిగగానే దొన్నెలా విస్తరించిన ఆకుపచ్చని



మూడు శివాలయాలు, మూడు వైష్ణవాలయాలతో అలరారే అతి పెద్ద లక్ష్మీనారాయణ మందిరం

# చంబా లోయ

పచ్చికబయళ్లమధ్య పుష్యరాగం పొదిగినట్టు ప్రాతఃకాలపు సూర్యకాంతిలో మెరుస్తూ ఓ పెద్ద కొలను దర్శనమిస్తుంది. దాని పక్కన ఖజ్జినాగ దేవాలయపు బంగారు శిఖరాగ్రం తళుకులీనుతూ కనబడుతుంది. 'ఖజ్జినాగుడు' పేరుతో అక్కడ విరాజిల్లుతున్న నాగదేముడిని పాండవులు తమ అజ్ఞాతవాసంలో ఆరాధించారని చెబుతారు. కర్రతో కట్టిన ఈ దేవాలయం మీద చెక్కడాలు అద్భుత కళానైపుణ్యానికి ప్రతీకలుగా నిలుస్తాయి. చుట్టుపక్కల గ్రామాల నుంచి వేలాది ప్రజలు పర్వదినాల్లో వచ్చి ఖజ్జినాగుణ్ణి దర్శించుకుంటారు. ఆ గుడి ఆవరణలోనే ఆరుబయట పిల్లలు చదువుకుంటూ కనిపిస్తారు. ప్రశాంతమయిన ఆ వాతావరణంలో పిట్టల అరుపులు, అప్పుడప్పుడు పోయే ఒకటీ అరా వాహనాల శబ్దం తప్ప మరేమీ వినిపించదు.

ఖజ్జియార్ తరువాత ప్రయాణీకులు చేరుకునేది చంబని. చంబానగరాన్ని పాలించిన రాజులలో రాజ్ సింగ్ (1764-1794) ప్రముఖుడు. మంచి కళాభిమాని, గులేరాచంబాగా ప్రసిద్ధమైన సాంప్రదాయిక పద్ధతిలో చక్కని



పెయింటింగ్‌లను ప్రోత్సహించి, చంబాకి ఆ కళలో ఓ ప్రత్యేకతను సంతరించిపెట్టాడు.

1735లో రాజ్‌నగర్‌లో జన్మించి 9 సంవత్స రాల వయసులోనే పట్టాభిషిక్తుడయ్యాడు. అనేక యుద్ధాలు చేసిన వీరుడుగా పేరు గాంచిన రాజ్‌సింగ్ చాముండాదేవి భక్తుడు. ఎప్పుడూ ఆ దేవిని తనకి వీరమరణం ప్రసా దించమని కోరుకునేవాడు. అది కాకతాళీ యమో, భక్తిభావ ప్రతిఫలమోగానీ, అతడు కోరుకున్నట్టే నేర్తి వద్ద కాంగ్రాకు చెందిన సంసార్‌చంద్ అనే రాజుతో యుద్ధం చేస్తూ అమరుడయ్యాడు. అతడు మరణించిన ప్రదే శంలోనే అతని కొడుకు జీత్‌సింగ్ తండ్రి జ్ఞాపకార్థం ఓ దేవాలయాన్ని కట్టించాడు. రాజ్ సింగ్ సంస్మరణ దినంగా ఏటా అక్కడ తిరు నాళ్లు జరుపుకుంటారు. అనేకమంది ప్రజలు ఆ దేవాలయానికి వచ్చి ఆ రోజు అక్కడ గడిపి వెడతారు.



విశాలమైన లక్ష్మీనారాయణ దేవాలయ ప్రాంగణంలోని శివాలయం



'చంబ' ప్రజలు భక్తి ప్రపత్తులతో పూజించే 'చాముండాదేవి' ఆలయం

ప్రకృతి సౌందర్యంలో చంపాతో పోటీపడ గల ప్రదేశాలు అతి తక్కువని చెప్పొచ్చు. ఉదయపు వేళల్లో పొగమంచుతో కప్పబడిన చెట్లు పొద్దెక్కిన కొద్దీ క్రమంగా ఆ బూడిద రంగునుంచి బయటపడి తేలికగా ఊపిరి పీల్చుకుంటాయి. మంచు విడుతూనే అంద మైన చంబాలోయ పెద్దపెద్ద దేవదారు చెట్లతో, చిన్నచిన్న మలుపుల్లో చదును చేయబడిన మట్టి ప్రదేశాలతో, విరులు నిండిన ఉద్యానవ నాలతో కన్నుల పండుగ చేయడానికి ఆయత్త



దేవాలయ ప్రాంగణంలోనే పాఠశాల తరగతులు



**అందమైన చంబలోయలో అలవోకగా పారే నదీ జలాలు**

మవుతుంది.

మరికొంచెం దిగువకు చూస్తే చిన్నచిన్న ఇళ్లు వరుసక్రమంలో పేర్చినట్టు కనిపిస్తాయి. ఇంటి కప్పులన్నీ నల్లటి నాపరాతితోటి, ఎరువు లేక ఆకుపచ్చ రేకులతోటి నిర్మించబడి వుంటాయి. ఆ ఇళ్ల మధ్య ఒకప్పటి రాజులు పోలో ఆటకి నిర్మించిన మైదానం ఒక కిలో మీటరు పొడవు, 75 మీటర్ల వెడల్పుతో తీర్చి దిద్దినట్టు కనిపిస్తుంది.రంగమహాల్, లక్ష్మీనారాయణ దేవాలయం, అఖన్‌చండీ పాలెస్‌లు అన్నీ ఒక వైపు వుంటే మరో వైపు నీలి రావీనది పరవళ్లు తొక్కుతూ పారుతూ వుంటుంది. 'చంబని చూసిన ప్రతివాళ్లూ చంపారాణిలా ముగ్ధులవ్వాలసిందే' అంటారక్కడ ప్రజలు. చంపావతి రాజపుట్ రాజు షాహిల్ వర్మన్ కూతురు. బుధాల్‌నది ఒడ్డునవున్న భరమార్‌ని పాలించేవాడు షాహిల్‌వర్మ. అక్కడి జానపద కథల ప్రకారం చంపావతి అక్కడ ఒక సమతలమయిన ప్రదేశాన్ని ఎత్తుపల్లాల కొండల మధ్య చూసి చకితురాలయింది. ఆమె తన తండ్రిని ఆ ప్రదేశంలో ఒక పట్టణాన్ని నిర్మించమని కోరింది. కానీ రాజు ఆ భూమిని ముందుగానే బ్రాహ్మణులకు దానం చేసేయడంతో ఇంక ఆ ప్రదేశం మీద తమకు హక్కువుండదని చెబుతాడు కూతురుకి. పైగా తమకు ఇచ్చిన భూమిని తిరిగి ఇవ్వడానికి బ్రాహ్మణులు నిరాకరిస్తారు. కానీ చంపావతి పట్టుదల కారణంగా బ్రాహ్మణుల ఇళ్లలో జరిగే



**షామాదర్ పర్వతాలమీంచి కనుపించే చంబ పట్టణం**







యాత్రికులను ఆకట్టుకునే పురాతన దేవాలయాలు

ప్రతి వివాహానికి 8 బంగారు నాణేలు కానుకగా ఇస్తానని వాగ్దానం చేసి ఆ ప్రాంతాన్ని తిరిగి పుచ్చుకున్నాడు రాజు. అక్కడొక పట్టణాన్ని



చంబ శిల్పుల కళా నైపుణ్యానికి ప్రతీక

రూపొందించి కూతురి పేరుతో దానికి చంపానగరమని నామకరణం చేశాడు. కాలక్రమంలో అది ప్రజల నోళ్లలో చంబగా స్థిరపడింది. ఆ లోయలో లెక్కకు మిక్కలిగావున్న చంపావృక్షాల కారణంగా ఆ లోయకు ఆ పేరొచ్చిందని మరో కథనం కూడా వుంది.

చంపావతి కోరిక మేరకు చంబ పట్టణ నిర్మాణం జరిగాక అక్కడొకసారి దుర్భరమయిన నీటికొరత ఏర్పడింది. అప్పుడు అక్కడి బ్రాహ్మణులు గంగను శాంతపరిచి, పూజించి రాణినిగానీ యువరాజునిగానీ బలివ్వాలనీ లేకపోతే నీళ్లు రావనీ చెప్పారు. వెంటనే రాణి ఆత్మత్యాగానికి సిద్ధపడింది. తవ్విన నీటికాలువలో ఆమెను సజీవ సమాధి చేశారు. వెంటనే ఆ కాలువలో నీళ్లూరడమేకాక మళ్లీ చంబకెన్నడూ నీటికొరత రాలేదని చెబుతారు అక్కడి ప్రజలు. రాణి ఆత్మత్యాగం చేసిన చోట సుయిామాత గుడి కట్టబడివుంది. రాణి సంస్మరణార్థం ఏటా అక్కడ పూజలు జరుగుతూ వుంటాయి.

కాలక్రమంలో క్రీ.శ. 930 నుంచి 1904 వరకు చంబా ప్రాంతాన్ని వరుసగా పాలించిన

కాశ్మీర రాజులు, మొగలులు, శిక్కులు, ఆంగ్లేయులకూ రాజధాని నగరంగా విరాజిల్లుతూ వచ్చింది చంబా పట్టణం. అటుపైన కేంద్రపాలిత ప్రాంతమైన హిమాచల్ ప్రదేశ్‌లో విలీనం చేయబడింది.

చంబాలోని దేవాలయ నిర్మాణాలు ఓ ప్రత్యేక పద్ధతిలో వుంటాయి. చాలా ఆలయాలు దేవదారు చెక్కతో నిర్మించబడివుంటాయి. దేవదారుకి మన్నికలో విశిష్టత వుండడమేకాక, ఆ కలప అక్కడ విరివిగా దొరకడం కూడా కారణం కావచ్చు. గృహ నిర్మాణాలు భూకంపాల నుంచి తట్టుకునే ఓ ప్రత్యేక పద్ధతిలో కట్టబడి



ఫౌంటెన్‌లవద్ద కనపడే శిలాఫలకాలు

వుంటాయి. దేవాలయాలన్నిటినీ పరిశుభ్రంగా వుంచుకోవడం, నిత్యపూజా కార్యక్రమాలను నిర్విఘ్నంగా జరిపించడంలో ప్రజలు ఉమ్మడి బాధ్యత వహిస్తారు. శివుడు, విష్ణువు, దుర్గాదేవి, సుబ్రహ్మణ్యేశ్వరుడు అక్కడి ప్రజల ఆరాధ్యదైవాలు. దుర్గని ఉగ్రరూపంలో మహిషా



పర్వతారోహణకు అనువైన ప్రదేశం

సుర మర్దినిగా కొలుస్తారు. చంబ నగరానికి చుట్టుపక్కల దేవీకోఠీ, చౌరా మొదలయిన ప్రాంతాల్లో కూడా అనేక చాముండదేవాలయాలున్నాయి. భర్‌మార్‌లోగల లక్షణాదేవి ఆలయం క్రీ.శ. 680లో తయారు చేయబడిన లోహపు విగ్రహంతో ఎంతోమందిని ఆకర్షిస్తుంది.

చౌగాన్ గేటువద్ద హరిరాయ్ దేవాలయం వుంది. ఈ ఆలయంలోని 338 కిలో గ్రాముల బరువుతూగే చతుర్భుజ విష్ణు విగ్రహం 11వ శతాబ్దం నాటిది. ఆ విగ్రహం అందచందాలు వర్ణింపనలవికావు అంటారు చూసినవారు. 1971లో ఆ విగ్రహం దొంగిలింపబడింది. అయినా విదేశాలకు తరలింపబడే సమయంలో అనూహ్యంగా పట్టుబడి పునఃప్రతిష్ఠించబడింది. అక్కడి లక్ష్మీనారాయణ దేవాలయ ప్రాంగణంలోనే మూడు శివాలయాలు, మూడు వైష్ణవాలయాలు దర్శనమిస్తాయి. ప్రధాన దైవమయిన లక్ష్మీనారాయణ విగ్రహం పాలరాతి పై చెక్కబడి, నిలువెల్లా ఆభరణాలతో నిండుగా వుంటుంది. శివాలయాల్లో గౌరీ శంకరాలయం ప్రఖ్యాతిగాంచింది. కంచుతో చేయబడిన శివపార్వతుల విగ్రహాలు నిల్చున్న భంగిమలో వుంటాయి. ఇవి తొమ్మిదవ శతాబ్దంనాటివి. చంద్రశేఖరాలయంలో శివుడు లింగాకృతిలో దర్శనమిస్తాడు.

ఇవికాక చంబాలో వజ్రేశ్వరి, చంపావతి, వంశీగోపాలుని ఆలయాలు కూడా వున్నాయి. పరమత సహనానికి ప్రతీకగా బౌద్ధులకు సంబంధించిన అవలోకితేశ్వర ఆలయం కూడా వుందక్కడ. కూర్చున్న భంగిమలో ఆరు




కనువిందు చేసే ప్రకృతి శోభ

చేతులతో కనిపించే పాలరాతి బుద్ధ భగవానుడు చూడగానే ఆకట్టుకుంటాడు. చంబాకు 30 కి.మీ.ల దూరంలో కాతనందేవి ఆలయంవుంది. ఇది బైరాసియూల్ ప్రాజెక్టుకు దగ్గరగా వుంది. ఈ ఆలయం చుట్టూ సుందర వుద్యానవనాలు పచ్చగా కళకళలాడుతూ వుంటాయి. ఈ దేవిని చూడడానికి అనేక మంది భక్తులు సుదూర ప్రాంతాల నించి వస్తారు.

చంబాలో మరో ప్రత్యేక శిలాఫలక నిర్మాణం వుంది. జలాశయాల వద్ద రాతి పలకలు స్థాపించబడి వుంటాయి. వాటి మీద దేవతా మూర్తుల బొమ్మలు, వాటి కింద పువ్వులు, ఆకులు, లతలు ఇంకా దిగువన సైనికులు, గుర్రాలు చెక్కబడి వుంటాయి. ఇవి వరుణదేవుడి ప్రీత్యర్థం నిర్మిస్తారు. ఈ పలకలను తమ స్వంత ఖర్చుతో తయారు చేసినవారి పేర్లు వాటి మీద చెక్కివుంటాయి. అలా తయారు చేయిస్తే వారిని, వారి కుటుంబ సభ్యులను వరుణ దేవుడు చల్లగా చూస్తాడని నమ్ముతారు.

చంబావాసుల కాంగ్రా, బసోలీ మొదలయిన పెయింటింగ్‌లు, కర్ర చెక్కడాలపై వారి నైపుణ్యం, ఆభరణాల తయారీలో వారి మెళుకువలు... ఇవన్నీ ఒక చోట చూడాలంటే భూరిసింగ్ మ్యూజియంను దర్శించాలి. ఎన్నో పురాతన వస్తువులను అతి భద్రంగా కాపాడుతూ, చంబా సంస్కృతీ సంప్రదాయాలను నిలబెడుతూ వస్తోంది ఆ మ్యూజియం.

పర్వతారోహణకు కూడా చాలా వీలయిన ప్రదేశం చంబా. ఇది కాక చంబా చుట్టుపక్కల నరోల్, బందల్, సరూని, పంగి... లాంటి మరెన్నో లోయలు యాత్రికులను ఆకర్షిస్తున్నాయి. నరోల్‌వాలీ చంబాకి 11 కి.మీ.ల



ఖజ్జినాగుడిని ఆరాధించిన యుధిష్టిరుడు



రాణి సంస్మరణార్థం వెలసిన సుయామాత

డమే కష్టమవుతుందంటే అతిశయోక్తి కాదు.

అత్యద్భుత ప్రకృతి సౌందర్యంతోపాటు. ఆకర్షణీయ విశేషాలతో ఆకట్టుకునే చంబా పర్యటన ఒక్కసారి చేస్తే చాలదనే వారే ఎక్కువ.

దూరంలోవుంది. ఇక్కడి సారవంతమయిన నేలలో పెరిగే వృక్షాల ద్వారా ఫలసాయం లభించడమేకాక, ఈ ప్రాంతంలో కోళ్లఫారం, గొఱ్ఱెల పెంపకం అత్యంత లాభదాయకమైన వ్యాపారాలుగా నిలుస్తున్నాయి.

'సరూనివాలీ' చంబాకి 56 కి.మీ.ల దూరంవుంది. ఇక్కడినుంచే బందల్‌వాలీకి వెళ్లడానికి మార్గం అనువుగా వుంటుంది. బందల్ వాలీ చంబకి 22 కి.మీ.ల దూరంలోవుంది. ఇక్కడ క్రూరమృగాలెక్కువ. ఈ వాలీ చంబాని కాశ్మీర్ జమ్ములతో కలుపుతుంది.

చంబా ప్రాంతంలోని స్త్రీలు వస్త్రాలపై చేసే ఎంబ్రాయిడరీ ఒక ప్రత్యేక ఆకర్షణ. దోరుఖా అంటూ రెండు వైపులా వచ్చే ప్రత్యేక ఎంబ్రాయిడరీ చేసిన రుమాళ్లు చంబారుమాళ్లుగా పేరెన్నికగన్నాయి. ఈ రుమాళ్లపై స్త్రీలుకుట్టే డిజైన్లు అసంఖ్యాకంగా వుండి, ఎన్ను కోవ



'దోరూఖా' ఎంబ్రాయిడరీతో 'చంబరుమాలు'

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

